PRSV1402A 1/0



మాసపత్రిక

"All that we are is the product of what we have thought"
*- Dammapada.*


సంపుటి 24 నవంబరు 2013 సంచిక 11





<u>*Printed & Published by*</u>

**Bapanna Alapati**
at **Kala Jyothi Process Pvt. Ltd.,**
1-1-60/5, R.T.C. 'X' Roads,
Musheerabad, Hyderabad - 500 020.
Ph. 040-27645536
E-mail : misimi_monthly@yahoo.in
e-magazine : www.kinige.com/misimi

ప్రతి : ₹20 సంవత్సరానికి : ₹240
విదేశాలకు ప్రతి : $ 2.50 సంవత్సరానికి : $ 25

(Library of Congress Control Number)
LCCN 91-903060


# ఈ నెల...


కమ్మతెమ్మెరలు .......... 4

జవహర్‌లాల్ నెహ్రూ : డిస్కవరి ఆఫ్ ఇండియా
సమకాలీన సామీప్యత .......... 5
- డాక్టర్ కె.యస్. కామేశ్వరరావు

సాంకేతిక పదజాలం: మాతృభాషాభివృద్ధి .......... 10
- షేక్ షమీ ఉల్లా

గుంటూరు శేషేంద్ర శర్మ - కాలరేఖ .......... 13
- ప్రొఫెసర్ రావినూతల సత్యనారాయణ

మన బరంపురం .......... 27
- కణుగుల వేంకటరావు

సవర రీడర్లకు వంద సంవత్సరాలు .......... 31
- డాక్టర్ అజాద్ సవర

అనేకాంత వాదం (డాక్టర్ ప్రేమ సుమన్ జైన్).......... 35
- అనువాదం : డాక్టర్ జె. లక్ష్మిరెడ్డి

ఒకప్పటి సోవియట్ సమాఖ్య-స్వతంత్ర దేశాల కవిత్వం ... 40
- ముకుంద రామారావు

నోబెల్ పురస్కారం : ఏలిస్ మన్రో .......... 53
- ముక్తవరం పార్థసారథి

చైనా ప్రయాణం .......... 55
- డాక్టర్ ఎమ్. ఆదినారాయణ

అశ్రుగీతి : జయశంకర ప్రసాద్ (ఆంసూ) .......... 62
- కోడూరు పుల్లారెడ్డి

రజక వృత్తి : రేవు నవల .......... 72
- డాక్టర్ లంకా వెంకటేశ్వర్లు

పుస్తక పరిచయం .......... 75
- ఎన్నార్కె

గోపల్లెకు దారి .......... 77
- డాక్టర్ సగిలి సుధారాణి


ముఖచిత్రం : బంగరు వాకిలి — అడాల్ఫ్ బొగురు
రెండవ అట్ట : 'నేనే' దావులూరి
మూడవ అట్ట : బొగురు లోగిలి — అడాల్ఫ్ బొగురు
నాల్గవ అట్ట : అమ్మ చెక్కిలి


(వివరాలు : 38...)

విద్యకు సరియైన నిర్వచనం కేవలం చదువుకున్నది అప్పజెప్పటమే కాదు, చదువు యొక్క సారాన్ని గ్రహించి నిత్యజీవితంలో ఉన్నత విలువలతో జీవనం సాగించటం. వ్యక్తిగతంగా, సాంఘిక పరంగానే కాక మానవత్వంతో సామాజికంగా పురోగమించటమే దాని దశ, నిర్దేశం. కానీ ఈనాడు మన విద్యార్థులకు మనం ఈరకమైన విద్యను అందించలేక పోతున్నాం. భారతదేశంలో విద్యార్థులకు ప్రణాళికాబద్ధమైన, దేశానికి అవసరపడే విద్యావిధానం రాలేదు. కఠినతరమైన పరీక్షావిధానం మాత్రమే ఉంది. పరీక్షలలో మార్కులు సాధించడమే విద్యార్థుల ఏకైక లక్ష్యమైంది. దానివల్ల అర్థం చేసుకోవడం కంటే అప్పజెప్పటమే ప్రధానమయింది. ఆంగ్లేయుల కాలంలో విద్య, వారి ప్రభుత్వాన్ని సమర్థించడానికి, సుస్థిర పరచడానికి మెకాలే చే ప్రారంభింపబడింది. అదేవిధానం స్వాతంత్ర్యం వచ్చిన తరువాత కూడా చాలాకాలం కొనసాగింపబడింది. దీనివల్ల భారతీయులలో ఉన్న మౌలిక సృజనాత్మకత దెబ్బతింది. "చదువుకున్న వానికంటే...... మేలని" సామెత పుట్టింది. పాశ్చాత్య విద్యావిధానంలో ఓనమాలు నేర్చుకొని, ప్రభావితుడైన భారత ప్రథమ ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ భారతదేశపు మూలాలు తెలుసుకొని దాని ఔన్నత్యాన్ని తిరిగి పునరుద్ధరించాలనే తలంపుతో డిస్కవరి ఆఫ్ ఇండియా అనే పుస్తకాన్ని వ్రాసి అందులో సృజనాత్మకమైన భారతీయ పరిశీలనా అనుభవాలను మనందరి ముందూ ఉంచారు. జవహర్‌లాల్ నెహ్రూ ఈ దేశం గురించి, ఈ ప్రజల గురించి ఎంతో చదివి "నన్ను నేను తెలుసుకున్నాన"ని కదా అన్నారు.

జపాన్, చైనా, ఫ్రాన్స్, రష్యా, జర్మనీ, ఇటలీ మరెన్నో దేశాలు ఆంగ్లభాషపై ఆధారపడకుండానే అభివృద్ధి చెందాయి. ప్రపంచ జనాభాలో, ఆంగ్లంతో పరిచయం ఉన్నవారు కేవలం ఒక్క శాతం మాత్రమే.

అయితే ఆధునిక జీవనంలో యంత్రాలు ముందుండి నడుపుతున్నాయి. ఇవన్నీ సహజంగానే పాశ్చాత్య దేశాల తయారీ. వాటిని నడపటానికి తప్పనిసరిగా ఆ చదువు కావాలి. ఇది సాంస్కృతికంగా కలుగజేసుకోకపోయినా, కట్టు, బొట్టు యంత్రపరంగా అలవాటు చేసుకోవాలి. భారతీయ సంస్కృతి ప్రమాణాలను స్థిరంగా ఉంచుకొంటూనే, సాంకేతికతను ఇప్పటి జీవన ప్రమాణాలకు అనుగుణంగా అన్వయించుకోవాలి.

మన విద్యావిధానం కేవలం ఉద్యోగాల కోసమే రూపొందించబడుతోంది. నైతిక నియమావళి, మర్యాద, మన్ననలను అసలు నేర్పటం లేదు. బడిలో, ఇంటిలో కూడా. దీని పర్యవసానం ఇప్పుడు మనం చూస్తున్న నవ్య భారతం.

జపాన్‌లో ఈ మర్యాదలు అయిదవ తరగతిలో బడిలోనే నేర్పుతారు. పరిసరాల శుభ్రత, నడక, మాటతీరు కూడా చక్కగా బోధిస్తారు. మన బడులలో ఈ బోధనాంశాలు లేవు. వినయంతో కూడిన విద్య, విజయాన్నిస్తుందని చెప్పాలి.

మనం సహనశీలురమని చెప్పుకుంటాం. ఆధునిక జీవన విధానం ఈ సహనాన్ని హరించి వేస్తుందని వాపోతాం. కాని దీనిని ఎలా అధిగమించాలో విద్యావిధానంలో చిన్న వయసులో నేర్పితే మనం రోజూ చూసే ఘర్షణ లెన్నో నివారించ వచ్చు. అలాగే పిరికితనం సహనంగా చెల్లుబాటు కాకుండా తెలియజేయాలి.

ప్రాథమిక పాఠశాలనుంచే బోధనాంశాలలో, పాఠ్య ప్రణాళికలో, భాష, సాంఘిక శాస్త్రం, సాంకేతిక విద్యలతో పాటు సాంఘిక ప్రవర్తనావళిని, మర్యాద, మన్ననలను, ఆరోగ్య పరిరక్షణను విద్యార్థులకు నేర్పవలసిన అవసరం ఎంతైనా ఉంది. భావి పౌరులు తమ హక్కులతో పాటు బాధ్యతలనూ గుర్తెరిగి తమ నడవడికను ఏర్పరచుకుంటారు.

జరిగిపోయింది ఎలా ఉన్నా నేటి విద్యార్థులు రేపటి బాధ్యత కల పౌరులుగా ఎదగాలన్నదే మనందరి ఆకాంక్ష.

**- సంపాదకులు**



# బాలల దినోత్సవం


జవహర్‌లాల్ నెహ్రూ

**నవంబరు 14** వ తేది చాచా నెహ్రూ జన్మదినం. భారతదేశం దానిని *బాలల దినోత్సవం*గా గుర్తించింది. ఆ రోజు పిల్లలను ప్రోత్సహించే విధంగా అనేక అవగాహన సదస్సులు, సాంస్కృతిక రంగంలో పిల్లలతో ప్రదర్శనలు, చిత్రకళ, క్రీడలు మున్నగు వాటిలో పోటీలు నిర్వహించి, పిల్లలను ప్రోత్సహిస్తున్నారు.

ప్రపంచవ్యాప్తంగా పిల్లలకు జరుగుతున్న అన్యాయాలకు, వారిపై జరుగుతున్న అఘాయిత్యాలకు చరమగీతం పాడాలంటూ 1925వ సంవత్సరంలో *లీగ్ ఆఫ్ నేషన్స్ వరల్డ్ కాన్ఫరెన్స్* నిర్ణయించింది. రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత దీనిపై దృష్టి నిలిపారు. 1954వ సంవత్సరంలో ప్రపంచవ్యాప్తంగా బాలల దినోత్సవంగా నవంబరు 20వ తేదీని నిర్ణయించారు. కానీ చాలా దేశాలు సంవత్సరంలో తమకు అనుకూలంగా ఉన్న ఒక రోజును బాలల దినోత్సవంగా పరిగణిస్తున్నారు. ఎక్కువ దేశాలు(సుమారు 50) ఈ ఉత్సవాన్ని జూన్ 1వ తేదీన జరుపుకుంటున్నాయి.

ఈనాటి పౌరులు నిన్న, మొన్నటి బాలలే. ఈనాటి బాలలే రేపటి పౌరులు. తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య ఒక తరం తేడా ఎప్పుడూ ఉంటుంది. కాలం మారుతూ ఉంటుంది. తల్లిదండ్రులు తాము పుట్టిన నాడు, అప్పటి సంఘంలో పాదుకొల్పబడిన విశ్వాసాలకు, దానిని కొనసాగించే సంప్రదాయాల పట్ల నిబద్ధులుగా పెరుగుతారు. కాలగతిలో, పిల్లలు పుట్టే సమయానికి అందులో కొన్ని అశాస్త్రీయంగా గుర్తించబడి తొలగించబడతాయి, లేదా నిరాదరించబడతాయి. అందువల్లనే వర్తమాన తరం వారికి తమ ముందుతరం వారు ఛాందసులుగా కనిపిస్తే, పాతతరం వారికి నూతన తరం వారు బాధ్యతా రాహిత్యంతో కూడిన అసందర్భ, అనాచారులుగా కనిపిస్తారు. ఈ వైరుధ్యాల నేపధ్యంలో ఇరువైపులా అవగాహన లోపిస్తుంది. తల్లిదండ్రులు తమ తీరని కోరికలను పిల్లలద్వారా తీర్చుకునే ప్రయత్నం వల్ల కొన్ని కుటుంబాలలో బాల్యం ఛిద్రమవుతుంది. ఇంతేకాక ప్రపంచంలో ఎంతో మంది పిల్లలు పౌష్టికాహార లోపం మూలంగా వచ్చిన రుగ్మతలతో రోగాల బారిన పడుతున్నారు.

దీనిని అరికట్టే దిశలో U.N-1959 వ సంవత్సరంలో Declaration of the rights of the child ను ప్రకటించింది. తరువాత 1989లో convention on the rights of the child ను జరిపింది. 2000వ సంవత్సరంలో మిలీనియం అభివృద్ధి పేర మానవాళి శ్రేయస్సు రీత్యా ఎనిమిది లక్ష్యాలను నిర్దేశించింది. అందులో ఆరు చిన్నపిల్లల గురించే. 2018వ సంవత్సరం నాటికి ప్రపంచవ్యాప్తంగా పిల్లలందరికీ చదువు తప్పనిసరి బాధ్యతగా ప్రపంచ దేశాలు స్వీకరించే విధంగా నిర్ణయం తీసుకుంది.


మారని బ్రతుకులు

చిన్నపిల్లలను కేంద్రంగా తీసుకొని చిత్రాలు వేసిన ప్రముఖులలో స్పెయిన్ దేశస్థుడైన మురెల్లో ఒకడు. ఇతడు అనాథగా పెరగటం వలన, అనాథ పేద పిల్లల చిత్రాలను హృద్యంగా చిత్రించాడు. మురెల్లో వేసిన రెండు చిత్రాలను మనం పబ్లిక్‌గార్డెన్స్‌లోనున్న మ్యూజియమ్‌లో చూడవచ్చు. ఇక రెండవ వాడు అడాల్ఫ్ బొగురు. బొగురు వేసిన బిబ్లిస్ చిత్రం సాలార్‌జంగ్ మ్యూజియంలో ఎందరినో ఆకర్షించడం మనకి తెలిసిందే. బొగురు నవంబరు 30, 1825 వ సంవత్సరం ఫ్రాన్స్‌లో జన్మించాడు. ఆయన జన్మదినం, బాలల దినోత్సవ సందర్భం కలిసే విధంగా నవంబరు నెలలో అతను వేసిన చిన్నారుల చిత్రాల వివరాలను (39 పుటలో) మిసిమి మీ ముందుంచుతుంది. మి

# కమ్మతెమ్మెరలు

★ "...నిజమే పెద్దిరామారావుగారన్నట్టు మంచి సాహిత్యపు విలువలున్న కథలు ఈ నాడు నాటకీకరణలు జరగడంలేదు, ప్రదర్శనాయోగ్యం కావడంలేదు. నాటకాల రచయితలు ఎక్కువైపోయారు. మంచినాటకాలు తక్కువైపోయాయి. కథలను నాటికలుగా మలిచి పోటీలకు పంపమన్నారని ముందు నాటికను తయారు చేసి తర్వాత దాన్ని కథగా మలిచి తన పలుకు బడితో స్థానిక వార్తా పేపరులో ప్రచురింపచేసుకున్న రచయిత నాకు తెలుసు. వ్యాసంలో స్పృశించ వలసిన వాస్తవ విషయాల్ని తడిమారు. మేం నాటక రచయితలం కాబట్టి మా శైలి గాంభీర్యంగా ఉండాలన్నట్లు కాకుండా చదవదగ్గ శైలిలో రాశారు. పెద్ది రామారావుగారు అభినందనీయులు...

... అట్టమీద బొమ్మలు అందంగాను మనసును ముచ్చటగొలిపేవిగానూ ఉన్నాయి. *సీతజోస్యం, ఆయుర్వేదం ఆత్మకథ, చరిత్రలో చంద్రగిరి మహల్...* ఇత్యాది వ్యాసాలు పత్రికకు నిండుదనాన్ని తెచ్చాయి..." **– డి. రాములు,** ఏలూరు.

★ "...***మిసిమి*** పత్రికను ఈ మధ్యనే చూశాను. ఎంతగానో ఆకట్టుకుంది. చదివాను. అన్ని వ్యాసాలు ఆలోచనాత్మకంగా ఉన్నాయి. ఎన్నో విషయాలను పాఠకులకు సరళమైన భాషలో అందిస్తున్నారు. ఈ రోజే చందా పంపిస్తున్నాను. నెల నెలా ***మిసిమి*** పత్రికను పంపండి..." **– సంపత్‌కుమార్,** వరంగల్.

★ "... ప్రస్తుతం మన ***మిసిమి*** బంగారు కాంతులతో మిసిమిసలాడుతోంది. ప్రతివాక్య విషయంలోను మీరు తీసుకునే శ్రమ, జాగ్రత్త కొట్టొచ్చినట్లు కనబడుతోంది. ఎక్కడా, ఎప్పుడూ ప్రచురింపబడని ఎన్నో గొప్ప విషయాలు పాఠకులకు అందుతున్నాయి. అయితే కొందిర రచయితల శైలి కొంచెం బరువుగా, కాంప్లికేటెడ్‌గా అక్కడక్కడ అనిపిస్తుంది. తప్పదు – ఒక్కో రచయితకు ఒక్కొక్క శైలి వుంటుంది కదా! అదీవొక కొత్తదనమే...

...కళ ముసుగులో చెలామణీ అవుతున్న కుక్కమూతి పిందెలకు, ఇటు వినోదం ముసుగులో భీభత్స కామోద్రేకాల మత్తుకు బానిసలైన సినీ ప్రేక్షకులకు, మాడు పెంకు అదిరేట్టు మీరు చేసిన సినిమా నగ్న విశ్లేషణ *నూరేళ్ళ నిండిన వెండితెర*. వార్తా పత్రికలవాళ్లు, సినిమా అంటే చాలు ఆత్మల్ని చంపుకుని, అసలు సత్యాల్ని అవతలపెట్టి, మూడు నాల్కల నంగితనాన్ని కప్పుకుని పదాల ఊడిగం చెయ్యడానికి అంకితమై పోయారు. డబ్బు జులుం ఏమైనా చేయిస్తుంది కదా! ...

... మీరన్నట్టు, "బాధ్యతలేని 'క్విక్‌మనీ' గాళ్లు, నటనకు ఎ.బి.సి. తెలియని కుక్కమూతి పిందెలు, అన్నిటిని విప్పి పరిచేందుకు సిద్ధంగావున్న బేడాపరకా ఆడవాళ్లు, మాటల్ని పేర్చి పాటగా బుకాయించేవాళ్లు, గందరగోళపు డబ్బామోతల సంగీతకారులు, సారాజులు, చేపల చెరువుల మత్స్య గంధంగాళ్లు, రియాల్టర్లు–వీరే నిర్మాతలు! వీళ్లందర్నీ మోసుకు తిరిగే దురభిమాన సంఘ సూకరాలు, "వారసత్వపు పారంపర్యంలో నిర్వీర్యమైన సినీ వృక్షపు కుక్కమూతి పిందెలు – వెరసి *'నూరేళ్ల నిండిన' వెండితెర!"* ఇన్నేళ్లకు తెలుగు సినిమా బురదను కడిగి, ఝాడించిన ఒకే ఒక్క సందర్భం ఇది. బాధ్యతలేని సినిమావాళ్లూ, ప్రభుత్వాలూ, టి.వి. చానెళ్లూ, కలిసి, మొత్తానికి సమాజాన్ని ఎంతవరకు పతనం చేయవచ్చో అంతవరకు చేస్తున్నారు. కాస్తో కూస్తో అక్షరాస్యులు ఈ పతనానికి ప్రాధాన్యత వహిస్తున్నారు. అవగాహన లేక, అజ్ఞానం తలకెక్కి, అధిక సంఖ్యాకులు ఈ బురద ప్రవాహంలో కొట్టుకుపోతున్నారు తెలియకుండానే. అసలే కంపుగొడుతున్న మన రాజకీయవ్యవస్థలోకి మళ్లీ వీళ్లే 'ప్రజాసేవ' డైలాగుల్తో, మీసాలు మెలేస్తూ, తొడలు చరుస్తూ ఘోషయాత్ర చేస్తున్నారు. కాస్తో కూస్తో మనిషి లక్షణాలున్నవాళ్లకి ఈ పరిస్థితుల మధ్య ఊపిరాడదు...

...తట్టెడు గడ్డిపెట్టినా నిశ్చింతగా మేసి తన 'స్వభావాన్ని' నెమరేసే ఈ దున్నపోతు సామాజిక వ్యవస్థని ఎవరు చలింపజేయగలరు? బాధపడడం తప్ప!..." **బి.వి.రామిరెడ్డి,** రుద్రవరం.

---

✦ **మంచి ఉత్తరానికి ఒక మంచి పుస్తకం బహుమతి!** ✦




జవహర్‌లాల్ నెహ్రూ :

# డిస్కవరి ఆఫ్ ఇండియా

## సమకాలీన సామీప్యత

– కె. యస్. కామేశ్వరరావు

ప్రతి తరం తన జాతికి స్ఫూర్తినిచ్చిన మహోన్నత వ్యక్తులను స్మరించి, వారి సేవలను దర్శించి, పునర్దర్శించి, వారి సమకాలీన సామీప్యతను మూల్యాంకనం చేయటం, నివాళి అర్పించటం సర్వసాధారణం. ఈ దృశ్యం సాకారం కావాలంటే మూడు ప్రధాన ప్రాతిపదికలైన స్ఫూర్తిప్రదాతల నేపథ్యం (background), సందర్భం (context) స్వప్నం (vision) ను ఆధారంగా తీసుకోవాలి. 20వ శతాబ్ది ప్రమధ్యభాగంలో జవహర్‌లాల్ నెహ్రూ రచించిన *ది డిస్కవరి ఆఫ్ ఇండియా*ను విభిన్న కోణాల నుండి ఎందరో దర్శించి తమ దృక్పథాల నుండి విశ్లేషించారు. నిరంతరం సంక్షోభాలకు గురౌతూ, తీవ్ర వైవిధ్యాలకు, వైరుధ్యాలకు నెలవైన సమకాలీన భారతదేశం ఎప్పటికప్పుడు తన సమస్యలను, పరిష్కరించుకుంటూ ప్రపంచంలో అభివృద్ధి చెందుతున్న సమాజం అన్న విశ్వాసాన్ని కలుగజేస్తూ ముందుకు సాగుతున్న సందర్భంలో నెహ్రూ భావజాలాన్ని ప్రతిబింబించే *ది డిస్కవరి ఆఫ్ ఇండియా* సమకాలీన సామీప్యతను పునః సందర్శించటమే ఈ వ్యాస లక్ష్యం.

నేపథ్యంలోని ముఖ్య అంశం ఈ స్ఫూర్తి ప్రదాతలు జీవించిన కాలం నాటి సామాజిక, సాంస్కృతిక, రాజకీయ, ఆర్థిక వాతావరణాన్ని ప్రతిబింబించే భావజాలం. ఈ సమకాలీన భావజాలానికి ముందు నుండి తరతరాలుగా కొనసాగుతూ ప్రభావితం చేస్తున్న మంచి, చెడు విలువలు, ఆదర్శాలు, ఆకాంక్షలు, జ్ఞాన మార్గాలు, సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, దృక్పథాలను ప్రతిబింబించిన సాహిత్య, తాత్విక ధోరణులను గ్రహించటం ఈ నేపథ్యాన్ని అవగాహన చేసుకుందుకు అత్యావశ్యకం. పరస్పర ప్రభావితాలైన ఈ అంశాలన్నీ వైయక్తిక, సమిష్టి దృక్కోణాలను, ఆలోచనలను, తాత్విక, మత రంగాలను ప్రభావితం చేస్తాయి. ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా, ఏ జాతిలోనైనా, ఈ నేపథ్యం మానవుడ్ని సమకాలీన భావజాలానికి వారసునిగా చేస్తుంది. ఆ వారసత్వమే వ్యక్తులకు ఒక సమిష్టి వ్యక్తిత్వాన్ని, శక్తినిచ్చి సామాజిక గమనానికి, లక్ష్యాల సాధనకు మార్గదర్శకత్వం అవుతుంది.

ఒక వ్యక్తి సమకాలీన భావజాలానికి భిన్నంగా రూపుదిద్దుకొని, నూతన సమాజ లక్ష్యాలను ప్రతిపాదించి, ఆ లక్ష్యాల సాధనకు మార్గనిర్దేశనం చేసి, ప్రజలను తన మార్గాన నడిపించి, ఆ ప్రజలను గమ్యానికి చేర్చటమే సందర్భంగా చెప్పవచ్చు. ఏకాలంలోనైనా అటువంటి సందర్భాల వలననే స్ఫూర్తి ప్రదాతలైన మహాపురుషులు సజీవమూర్తులుగా నిలచి తమ కాలానికి, రాబోయే కాలానికి అవసరమైన నూతన సమాజ ఆవిష్కరణ చేస్తారు.

ఏ వ్యక్తి అయితే ఆనాటి నేపథ్యానికి భిన్నంగా రూపుతీసుకుని, సందర్భాన్ని బట్టి నూతన సమాజ ఆవిష్కరణకు, కొన్ని నిర్దిష్ట ఆలోచనలకు స్వరూపమిస్తే, ఆ ఆలోచనలకు సాకార రూపమే స్వప్నం (vision). ప్రణాళికా బద్ధమైన రీతిలో తాను విశ్వసించిన స్వప్నాన్ని అమలు పరచేందుకు కృషిచేస్తూ, ఇతరులచే ఆచరింప చేయడానికి నిబద్ధతతో కృషి చేసేవాడే స్వాప్నికుడు (visionary). మానవ చరిత్రలో మన గమనాన్ని ఎప్పటికప్పుడు సరిదిద్దుతూ మార్గనిర్దేశనం చేస్తూ మనను చీకటి నుండి వెలుగులోకి, అజ్ఞానం నుండి జ్ఞాన మార్గం వైపుకు, అభద్రతా భావం నుండి భద్రత వైపుకు నడిపించిన ప్రాచ్య, పాశ్చాత్య వేగుచుక్కలెందరో ఉన్నారు. అట్టి సమిష్టి జ్ఞాన సంపద వారసులమే మనమందరం.

సామ్రాజ్యవాద భావజాలానికి చెందిన వలస ప్రపంచపు ఆధిపత్యానికి లోబడి నిద్రాణంగా, నిస్తేజంగా, నిరాశా

నిస్పృహలకు లోనైన ఆధునిక భారతజాతిని మేలు కొలుపుటకు కృషిచేసిన మహాపురుషులు-తత్త్వవేత్తలు, సాహితీ మూర్తులు, సంస్కరణ వాదులు, మేధావులు, నూతనంగా తలెత్తుతున్న రాజకీయ నాయకులు ఎందరో ఉన్నారు. భారతజాతిని ఆత్మ న్యూనతాభావం, అజ్ఞానం, అవివేకం, అనైకమత్యాల కారణంగా విచ్ఛిన్నకర ధోరణులకు గురైన వారందరిలో చైతన్య స్ఫూర్తిని రగిలించి, ఆత్మ విశ్వాసాన్ని పెంచి, జాతీయవాద చింతనచే ప్రభావితమైన 'భారతీయ' (Indianness) అనే విస్తృత అస్తిత్వాన్ని పెంపొందింపచేసి స్వతంత్రులుగా చేయటమే వీరందరి లక్ష్యం. ఆనాటి వారందరి మంత్రం జాతీయవాద చింతన, అందుకు వారెన్నుకున్న మార్గం చర్చలు, గ్రంథ రచన, ప్రసంగాలు.

19, 20 శతాబ్దాలలో భారతీయ మూలాలు అన్వేషిస్తూ జాతీయతావాద చింతనచే ప్రభావితమైన భవిష్యత్ సామాజిక నమూనాను ప్రతిపాదించే ఈ మేధోకరమైన ప్రక్రియకు మొదటిస్థానం ఇచ్చారు. ఆనాటి మేధావులు జాతీయతా వాద చింతనకు సంబంధించి నిర్దిష్టమైన నిర్వచనం ఇచ్చి, ఆ జాతీయతా భావనను శాశ్వతంగా ప్రజానీకంలో పెంచేందుకు అవసరమైన చర్యలు తీసుకోకపోవటం చేతను, తక్షణ లక్ష్యమైన స్వాతంత్ర్యం సంపాదించాలన్న లక్ష్యంతో తాత్కాలిక సర్దుబాట్లు చేసుకొని, ఎప్పటికప్పుడు తలెత్తిన సమస్యలను పరిష్కరిస్తూ వచ్చారు. తత్ఫలితంగా దేశభద్రతకు, సుస్థిరతకు కొంత వరకు అస్థిరత్వం కలిగించే స్థానీయతా, ప్రాంతీయతా, భాష, మత, కుల భావజాలాలను సమూలంగా నిర్మూలించక పోవటం వలన జాతీయతాభావం అవసరమైనంతగా పెరగలేదు. ఈ తాత్కాలిక సర్దుబాట్ల ఫలితంగా జాతీయవాద చింతన లక్ష్యానికి దూరమై, విఫలమైంది.

**జవహర్‌లాల్ నెహ్రూ 1944 ఏప్రియల్-సెప్టెంబర్ మాసాల మధ్య కాలంలో అహ్మద్ నగర కారాగార వాసంలో వ్రాసిన భావజాల సమాహారమే *ది డిస్కవరీ ఆఫ్ ఇండియా.* తన గ్రంథానికి ఆ పేరు పెట్టడానికి కారణం భారతదేశానికి వచ్చిన విదేశీయులు తాము భారతదేశాన్ని డిస్కవర్ చేశామని చెప్పకోవటం అయివుండవచ్చు. గ్రంథం పేరు కొన్ని ప్రశ్నలు లేవనెత్తుతుంది. అతడు ఏం డిస్కవర్ చేశాడు? అది డిస్కవరీనా? లేక రీడిస్కవరీనా? అనేవి.**

ఆధునిక భారతీయ మేధావులు భారతదేశాన్ని బహుకాలంగా పీడిస్తున్న రుగ్మతకు కారణాలు పట్టుకోగలిగినా, రుగ్మతను సమూలంగా నయం చేయగల మందును కనిపెట్టక తాత్కాలిక ఉపశమనం కలిగించే మార్గాలను ఎన్నుకున్నట్లే నెహ్రూ కూడా అదే మార్గాన్ని ఎంచుకొని జాతీయవాద చింతనకు ప్రాధాన్యమిచ్చి, తన భావజాలానికి మూలాధారం చేసుకున్నాడు. ఒక పక్కన భారతీయ మేధావులు విస్తృత ప్రాతిపదికన జాతీయతావాదాన్ని అస్పష్టంగానైనా ప్రచారం చేస్తూ, మరొక పక్కన స్థానిక, ప్రాంతీయ, జాతీయ స్థాయిలలో చైతన్యవంతమైన సంస్థాగత నిర్మాణాన్ని వ్యవస్థీకృతం చేసే కృషి కొనసాగించారు. ఆ విధంగా రూపుదిద్దుకొన్న భారత జాతీయ కాంగ్రెస్ స్థాపన జరిగిన నాలుగు సంవత్సరాల తర్వాత మోతీలాల్ నెహ్రూ అనే సుసంపన్న కాశ్మీరీ పండిట్ గృహంలో నెహ్రూ జన్మించాడు. విదేశాలలో విద్యను అభ్యసించి, బారిస్టర్‌గా వృత్తి చేపట్టిన నెహ్రూ స్థానిక, ప్రాంతీయ జాతీయోద్యమంలో పాల్గొని, జాతీయస్థాయి నాయకుడై, జాతిపిత గాంధి అడుగుజాడలలో స్వాతంత్ర్య రథసారథియై, మొదట స్వతంత్ర భారతదేశ ప్రధానమంత్రిగా వ్యవహరించి, తన స్వప్నాన్ని సాకారం చేసుకొనే కృషిలో పూర్తిగా సఫలీకృతుడు కాలేదు కాని, కొన్ని బలమైన పునాదులు వేయటంలో, కృతకృత్యుడైనాడు. నెహ్రూ భావజాల నేపథ్యానికి సందర్భానికి, స్వప్నాన్ని వివరించే ఆధారాలు అతని గ్రంథాలైన *గ్లింప్సెస్ ఆఫ్ వరల్డ్ హిస్టరి, స్వీయ చరిత్రయిన టూవర్డ్స్ ఫ్రీడమ్, ది డిస్కవరీ ఆఫ్ ఇండియాలు.* వీటిలో భారతీయ మూలాలను అన్వేషిస్తూ అతడు సాగించిన స్వీయ సత్యాన్వేషణకు అక్షర రూపమే *ది డిస్కవరీ ఆఫ్ ఇండియా.*

జవహర్‌లాల్ నెహ్రూ 1944 ఏప్రియల్ - సెప్టెంబర్ మాసాల మధ్య కాలంలో అహ్మద్ నగర కారాగార వాసంలో వ్రాసిన భావజాల సమాహారమే *ది డిస్కవరీ ఆఫ్ ఇండియా.* తన గ్రంథానికి ఆ పేరు పెట్టడానికి కారణం భారతదేశానికి వచ్చిన విదేశీయులు తాము భారతదేశాన్ని డిస్కవర్ చేశామని చెప్పుకోవటం అయివుండవచ్చు. గ్రంథం పేరు కొన్ని ప్రశ్నలు లేవనెత్తుతుంది. అతడు ఏం డిస్కవర్ చేశాడు? అది డిస్కవరీనా? లేక రీడిస్కవరీనా? అనేవి. ఈ ప్రశ్నలకు ఒక సమాధానం కనిపిస్తుంది. బాల్యం నుండి ఆంగ్లభాషలో విద్యనభ్యసించి, ఇంగ్లండులో బారిస్టర్ చదువును నేర్చుకున్న నెహ్రూ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటూ, దేశమంతటా

పర్యటిస్తూ ప్రజలను స్వయంగా కలుసుకొని వారితో మాటలు కలిపి, వారి జీవన విధానాన్ని, ఆకాంక్షలను, విలువలను అర్థం చేసుకొనుటకు చేసిన ప్రయత్నంతో పాటుగా, ప్రాచీన సాహిత్యాన్ని, తత్త్వశాస్త్రాన్ని చదివి అవగాహన చేసుకొనుటకు కారాగారవాసం సహాయపడగా రూపుదిద్దుకున్న స్వీయ అన్వేషణే ఆ గ్రంథంలో నిబిడీకృతమైన అతని భావజాలం.

ఈ ప్రక్రియలో తన్నుతాను తెలుసుకుంటూ, తన తోటి భారతీయుల సమిష్టి ఆత్మను, శక్తిని డిస్కవర్ చేశాడని చెప్పవచ్చు. కాబట్టి, నెహ్రూ వ్యక్తిత్వ ఆవిష్కరణగాను, భారతజాతి రీడిస్కవరీగాను భావించవచ్చును. మన ముందున్న మరో ప్రశ్న ఈ గ్రంథం ప్రచురించబడి 70 సంవత్సరాలు గడవటం చేత, ఎంతవరకు సమకాలీన సామీప్యత (రిలవెంట్) అనేది.

*ది డిస్కవరి ఆఫ్ ఇండియా* మొదటిసారిగా 1945 డిసెంబర్‌లో ప్రచురించబడి, ఆ తరువాత అనేక ముద్రణలకు నోచుకుంది. దీనికి ముందరే స్వీయచరిత్ర రాయబడింది. ఈ గ్రంథంలో మొత్తం 10 అధ్యాయాలున్నాయి. ఈ పది అధ్యాయాలలో మొదటి మూడు అధ్యాయాలు ఆత్మాశ్రయ ధోరణిలో తన స్వీయ సంశయాలకు, వివరణకు పరిమితమైనాయి. 3, 4, 5, 6 అధ్యాయాలు మధ్యయుగం దాకా జరిగిన చారిత్రిక విశేషాలను, భారతీయుల తాత్విక, సాహిత్య, వాస్తునిర్మాణ, కళారంగాల వైశిష్ట్యాన్ని అవి ఏ విధంగా 'భారతీయత'ను ప్రతిబింబిస్తాయో వివరించే ప్రయత్నం చేస్తాడు.

**_ది డిస్కవరి ఆఫ్ ఇండియా_ మొదటిసారిగా 1945 డిసెంబర్‌లో ప్రచురించబడి, ఆ తరువాత అనేక ముద్రణలకు నోచుకుంది. దీనికి ముందరే స్వీయచరిత్ర రాయబడింది. ఈ గ్రంథంలో మొత్తం 10 అధ్యాయాలున్నాయి. 1, 2, 3 అధ్యాయాలు ఆత్మాశ్రయ ధోరణిలో, 3, 4, 5, 6 అధ్యాయాలు మధ్యయుగం దాకా జరిగిన చారిత్రిక విశేషాలను, భారతీయుల తాత్విక, సాహిత్య, వాస్తునిర్మాణ, కళారంగాల వైశిష్ట్యాన్ని అవి ఏ విధంగా 'భారతీయత'ను ప్రతిబింబిస్తాయో వివరించే ప్రయత్నం చేస్తాడు.**

ఈ ప్రయత్నంలో గతకాలాన్ని కథనం చేస్తున్నప్పుడు, మనదేశంలో రెండు గొప్ప ఉద్యమాలు, దీర్ఘవలయం, క్లుప్తవలయం కలిగినవి చోటు చేసుకున్నాయని, దీర్ఘ వలయం 11వ శతాబ్దపు తొలిటంచుల– ఆఫ్గన్ దాడులలో ముగిసిందని అన్నాడు. ఇంకా ఇలా అన్నాడు "ఒక అంతర్గత బలహీనత భారతదేశాన్ని కుంగదీసింది. అది దాని రాజకీయ స్థాయినేకాక, తన సృజనాత్మక కార్యకలాపాలను ప్రభావితం చేసింది. అది ఎప్పుడు జరిగిందో కచ్చితంగా చెప్పే తారీకు తెలియదు కాని అది క్రమక్రమంగా మెల్లిగా జరిగింది. అది దక్షిణాని కంటే ఉత్తర భారతాన్ని ముందుగా ప్రభావితం చేసింది. (*ది డిస్కవరి ఆఫ్ ఇండియా* పుటలు 221, 222). ఈ క్షీణతకు కారణం భారతీయ సామాజిక నిర్మాణంలోని వివక్షతను ప్రోత్సహించే కులవ్యవస్థ అన్నాడు. ఇంకా 'భారతదేశాన్ని మొత్తంగా గ్రహించే విశాల భావనలకు బదులుగా స్థానియతాభావనలు, భూస్వామ్యభావాల ప్రభావం పెరిగి పోవటం' అన్నాడు.

క్లుప్త వలయమైన ఢిల్లీ సుల్తానుల, మొగలుల కాలంలో భారతీయుల జీవశక్తి పూర్తిగా చలనశీలం కాకపోవటంచే భారతదేశం తన ఎప్పటి చలనరహిత, మార్పులేని జీవితాన్ని కొనసాగించిందన్నాడు. 7, 8, 9 అధ్యాయాలు బ్రిటీష్ వలస పాలన ఫలితంగా భారతదేశంలో తలెత్తిన జాతి విముక్తి చైతన్యం, జాతీయతావాద సామ్రాజ్య వాదాల ఘర్షణ, ద్వితీయ ప్రపంచ యుద్ధాన్ని కేంద్రంగా తీసుకుని ప్రపంచంలో వచ్చిన మార్పులను శాస్త్రీయ, సాంకేతిక, పారిశ్రామిక, సాంస్కృతిక, ఆర్థిక రంగాలలోని పరిణామాలను సవాళ్ళను తన స్వీయ చారిత్రిక పద్ధతిలో విశ్లేషిస్తూ భారతీయ సమాజ వైఫల్యానికి వలస వాద పాలనా పరిస్థితులే పూర్తిగా కారణమన్నాడు. 10వ అధ్యాయంలో స్వేచ్ఛా, సమానత్వ, సోదర భావాలచే ఉత్తేజితులై విముక్తి పోరాటంలో అవిశ్రాంతంగా పాల్గొంటున్న భారతీయులు అతి కొద్దికాలంలో తప్పనిసరిగా స్వాతంత్ర్యం సంపాదిస్తారన్న విశ్వాసంతో, భవిష్యత్ భారత నిర్మాణానికి అవసరమైన లక్షణాలను అలవరచుకోవలసిన ఆవశ్యకతను ఈ క్రింది విధంగా తెలియపరిచాడు. "ఆచరణాత్మకమైన, వివేకశీలమైన, నైతికమైన, సామాజికమైన, పరహిత చింతన, మానవత్వం కలిగిన ఆధునిక బుద్ధిని అలవరుచుకుని, ప్రాచీనుల దార్శనిక మార్గాన్ని, మధ్యయుగపు భక్తి, మార్మిక విధానాలను విడనాడి, మానవత్వాన్నే భగవంతునిగా, సామాజికసేవే భగవంతుని సేవగా భావించే మానవతా వాదాన్ని, శాస్త్రీయ స్ఫూర్తిని పెంపొందిచుకోవాలన్నాడు". అవసరమైతే ఈ దృక్పథాన్ని పాశ్చాత్యుల నుండి నేర్చుకోవటానికి సిద్ధపడాలన్నాడు.

అదే అధ్యాయంలో ఉపసంహారం (epilogue) భాగంలో భవిష్యత్ బృహత్ నిర్మాణానికి భారతీయులు తమ సమిష్టి వ్యక్తిత్వంలో తెచ్చుకోవలసిన మార్పును, పెంపొందిచుకోవలసిన సమన్వయదృష్టిని వివరించాడు. ఈ విధంగా ఉద్భవించడానికి కారణం భారతీయ సంస్కృతి ఒక్క హిందూ సంస్కృతి మాత్రమే కాదని, బౌద్ధ, జైన, మహ్మదీయ, శిక్కు, క్రిస్టియన్ సంస్కృతుల సమ్మేళనమని విశ్వసించటమే.

నెహ్రూ ఎంతో ఆలోచించి తన స్వీయ అన్వేషణకు *ది డిస్కవరి ఆఫ్ ఇండియా* అన్న నామకరణం చేశాడని అనిపిస్తుంది. అతడు వృత్తిరీత్యా చరిత్రకారుడు కాదు. వృత్తి రీత్యా బారిస్టర్ కాని ప్రవృత్తి రీత్యా స్వేచ్ఛా, స్వాంతంత్ర్య పిపాసియైన ప్రజాస్వామిక వాది, అకుంఠిత దేశభక్తుడు. సమకాలీన ప్రపంచాన్ని ప్రభావితం చేస్తున్న బహుళ భావజాలాలలో సన్నిహిత పరిచయం, కొన్నింటితో ఆకర్షణకు గురైనా, ఏ నిర్ణీత భావజాలానికి కట్టుబడి, అదే అన్ని పాత సమస్యలకు పరిష్కారానికి, నూతన సామాజిక, రాజకీయ, ఆర్థిక, వ్యవస్థకు ఆవిష్కారానికి మూలాధారమని విశ్వసించలేదు.

నెహ్రూ భారతీయుల సమిష్టి శ్రేయస్సు అనే గమ్యాన్ని చేరేందుకు అనేక మార్గాలున్నాయని మన ప్రాచీనుల వలె నమ్మినవాడనిపిస్తుంది. ఇందుకు మరో కారణం నెహ్రూ స్వతహాగా సంశయవాది (Sceptic) కావటంతో పాటు, ప్రతి అంశాన్ని, విషయాన్ని హేతుబద్ధంగా, తార్కిక పద్ధతిలో ప్రశ్న, సమాధానాల రూపంలో గమనించటం అనిపిస్తుంది. కనుకనే నెహ్రూ జీవిత చరిత్ర రచించిన సర్వేపల్లి గోపాల్ 'నెహ్రూను ఏదో ఒక వర్గానికి చెందినవాడిగా వర్గీకరించటం సాధ్యంకాదు (not possible to categorize) అంటూనే నెహ్రూ మార్క్సిస్టే కాని సిద్ధాంత నియంత్రణ (regimentation) ను అంగీకరించలేదని, అతడు సోషలిస్టే కాని పౌరహక్కులకు ప్రాధాన్యమిచ్చాడని, "అహింసా వాది అయిన అతివాదని, స్వీయశక్తి సామర్థ్యాల మీద ఆధారపడుతూ అభివృద్ధి చెందాలన్న జాతీయవాదైన ప్రపంచ పౌరుడు" అన్నాడు. ఈ లక్షణాలుండబట్టే నెహ్రూను స్వాప్నికుడే కాని ఆచరణాత్మక వ్యూహరచనా నిపుణుడు కాడని విమర్శించారు. నెహ్రూను సూక్ష్మంగా పరిశీలిస్తే భారతీయుల లోనున్న వైరుధ్యాలన్నీ అతనిలో కనిపిస్తాయి. భారతీయులలో తరతరాలుగా ప్రతిబింబిస్తున్న పురోగమన, తిరోగమన, మత, తాత్విక, సాంస్కృతిక, శాస్త్రీయ ధోరణులకు నెహ్రూ ఒక సజీవ చారిత్రక ప్రతీక. నెహ్రూ పై జ్ఞాన వికాస సంప్రదాయం, కాల్పనిక వాదం, ప్రత్యక్ష జ్ఞానవాదం, గతి తార్కిక భౌతిక వాదాలేకాక ప్రాచీన భారతీయ తాత్విక ప్రభావం స్పష్టంగా కనబడుతుంది.

ఆధునిక శాస్త్రీయం, సాంకేతిక విజ్ఞానాన్ని అభిమానించినా భారతీయ గతాన్ని నిరుపయోగమైనదిగా, సంపూర్ణంగా తిరోగమనమైందిగా విశ్వసించక 'గతం లేకుండా మనం జీవించలేం' అంటూనే 'గతంలోనే బ్రతుకుతూ ఉండవలసిన అవసరం లేదని' నమ్మి, గతంలోని హానికరమైన ధోరణులను విడనాడి, మంచివాటిని గ్రహించి, భవిష్యత్‌ను మనకు నచ్చిన ఆకాంక్షలతో, విలువలతో నిర్మించుకునే హక్కు, సామర్థ్యం మనకే ఉందని నిర్ద్వంద్వంగా ప్రకటించి మనలో మనపై నమ్మకం పెంచి ఆశాజ్యోతిని వెలిగించాడు.

స్వాతంత్ర్యం సాధించటం తప్పనిసరి అని నమ్మకం కుదిరిన తరుణంలో ప్రచురించబడిన ఈ పుస్తకం ఆ తరానికి చెందిన వారందరికీ స్ఫూర్తి నిచ్చిందనుటలో ఎటువంటి సందేహం లేదు. ఈనాడు 70వ పడిలో నున్న ఎందరికో నెహ్రూ మార్గదర్శి, ఒక దీపస్తంభం.

*ది డిస్కవరి ఆఫ్ ఇండియాలో* 10వ అధ్యాయంలోని ఉపసంహారం (epilogue) మానవ క్రియాశీలక శక్తిపై అతడికున్న అపారమైన విశ్వాసానికి, ప్రతీకగా నిలుస్తుంది. ఈ భాగంలో 'The Discovery of India - what have I Discovred' అన్న ప్రశ్నను తనకు తానే వేసుకొని వివరణ రూపంలో సమాధానమిచ్చాడు. 'కాలగమనంలో మరుగునపడిన ఈనాటి భారతదేశ అంతశ్శక్తిని ఆవిష్కరించానా? లేదా సుదీర్ఘమైన గతంలో ఇలా ఉండేది అని భావించడం సాహసమే అవుతుంది.

ఈనాడు భారతదేశమంటే విడివిడిగానున్న నాలుగు వందల మిలియన్ల స్త్రీ, పురుష సమూహం; ఈ సమూహంలో ప్రతివాడు మరొకనికి భిన్నం, ఎవరికి వారు తమ తమ స్వంత ఆలోచనలతో, భావాలతో దూరదూరంగా విసిరేసినట్లు ఎవరి ప్రపంచంలో వారి వారి ఆలోచనలతో, భావాలతో విడివిడిగా బ్రతుకుతున్నారు. ఈ వర్తమాన మానవ స్వభావమే ఈ విధంగా ఉంటే తరతరాలుగా మన దేశంలో

నివసిస్తున్న వారి జీవనాడిని ఆకళింపు చేసుకోవటం ఎంత కష్టమో. అయినప్పటికి తరతరాలుగా సహజీవనం చేస్తూ ఈ మానవ సమూహాన్ని కట్టివేస్తున్న జీవశక్తి ఒకటి ఉందని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు. కంటికి కనుపించని బలమైన దారంతో బంధించబడిన భారతదేశం ఒక భౌగోళిక ఆర్థిక అంశం, భిన్నత్వం ప్రాతిపదికగానున్న సాంస్కృతిక ఏకత్వం, వైరుధ్యాల పుట్ట. మరల మరల మనల్ని బాహ్యశక్తులు దాడులు చేసి ముంచెత్తి విజయం సాధించినా భారతీయుల అంతశ్శక్తిని ఎవరూ ఎప్పుడూ అణచివేసి జయించ లేకపోయారు.

భవిష్యత్ మీదనున్న ఆశతో నెహ్రూ ఇంకా ఇలా అన్నాడు. "భారతదేశం, స్వాతంత్ర్యం సంపాదించటంలో నూతన శక్తి సామర్థ్యాలు పెంచుకొని తక్షణ గతంలోని నిరాశా, నిస్పృహలకు స్వస్తి చెప్పి భవిష్యత్ వైపుకు ఆశాజనకంగా వీక్షిస్తుంది. ఆత్మవిశ్వాసంతో ముందంజ వేస్తూ, ఇతరుల నుంచి నేర్చుకుంటూ, ఇతరులకు సహాయపడుటకు ముందు ఉంటుంది... భారతదేశం తనంతట తానుగా బయటకు వచ్చి ఆధునిక యుగపు కార్యకలాపాలలో పూర్తిగా పాల్గొంటే తప్ప సంపూర్ణంగా అభివృద్ధి చెందలేదు. అనుకరణ వలన ఏ విధమైన మార్పురాదు. నిజమైన సంస్కృతి ప్రపంచంలోని అన్ని దిక్కుల సంస్కృతి నుండి ఉత్తేజాన్ని పొందినప్పటికి స్వదేశీయమైనదై ప్రజల సహకారంతోనే మనగలుగుతుంది... ప్రజలందరి గత, భవిష్యత్ ఆకాంక్షలకు, ఆదర్శాలకు, ఆశయాలకు నెలవైనదే ఈనాటి ప్రజా సంస్కృతి.

నెహ్రూ ఆలోచనా స్రవంతిని, భవిష్యత్ బహుత్వ భారత నిర్మాణాన్ని జాతీయవాద చింతన గాఢంగా ప్రభావితం చేసినా, ఆ జాతీయవాద చింతన సంకుచితమైనది కాదు. అంతర్జాతీయ దృక్పథం జాతీయ సంస్కృతికి ఆలంబనమై ఉండాలని అంటూనే, ఆ భావన సక్రమంగా పెరగాలంటే స్వాతంత్ర్యం, సమానత్వం, వాస్తవ అంతర్జాతీయ పునాదులుగా అభివృద్ధి చెందాలని గట్టిగా నమ్ముతూ మన ముందుండాల్సిన లక్ష్యం నిజమైన భారతీయులుగా, ఆసియన్లుగా, ప్రపంచ పౌరులుగా ఎదుగుతూ, నికొలి అస్ట్రోవస్కి (Nicoli Ostrovsky) తో ఏకీభవిస్తూ 'మానవ జాతి విముక్తికి నాజీవితాన్ని, శక్తిని ధారపోశానన్న తృప్తితో కన్నుమూయడమే మానవుని ప్రథమ కర్తవ్యం అన్నాడు.

*ది డిస్కవరి ఆఫ్ ఇండియా* ప్రచురించబడి దాదాపు ఏడు దశాబ్దాలైంది. ఈ మధ్యకాలంలో భారతదేశం అనేక పెనుమార్పులకు గురైంది. ప్రజలు స్వతంత్రంగా తమ భవిష్యత్‌ను నిర్మించుకొనేందేకు కావాలసిన శక్తిని కొంత వరకు సంపాదించారు. ఫలితంగా వారి ఆకాంక్షలలో, ఆశయాలలో, విలువలలో, అస్తిత్వ భావనలో వచ్చిన మార్పులను నెహ్రూ ఊహించలేదు. ఆనాడు 'విస్తృత భారతీయ' అస్తిత్వ భావన ప్రజలను ఉత్తేజపరచగా, ఈనాడు ప్రత్యేకమైన పరిమితమైన అస్తిత్వభావనలు ప్రజలను చిన్న చిన్న సమూహాలుగా విభజించి తమ హక్కుల ఆకాంక్షలను సాధించేందుకు సంఘటిత పరచి పోరాటానికి సంసిద్ధం చేస్తున్నాయి.

నెహ్రూ అమలు పరచుటకు మొదలు పెట్టిన ప్రజాస్వామిక జాతీయ అభివృద్ధి సిద్ధాంతంపై ఆధారపడిన ప్రణాళికాభివృద్ధి వలన వచ్చిన ఫలాలు అందరికి సమానంగా అందుబాటులోకి రాక, కొందరికి ఎక్కువగాను, అనేక మందికి అతి తక్కువగాను అందటంచే ఆ నమూనాపై విశ్వాసం సన్నగిల్లింది. దీనికి తోడు ప్రపంచీకరణ దేశాల మధ్య అసమానతలను పెంచి, దేశ జనాభాలో అంతరాలను విపరీతంగా పెంచింది. సమ్మిళిత అభివృద్ధి సాధించాల్సిన ఆదర్శంగా మిగిలిపోయింది. ఈ నేపథ్యంలో, నెహ్రూ భావజాలానికి కాలం చెల్లిందనే వారు పెరిగారు. కాని సూక్ష్మంగా, నిష్పక్షపాతంగా పరిశీలిస్తే నెహ్రూ భారతీయులను నిటారుగా వెన్నెముక ఉన్న సంఘటిత శక్తిగా రూపొంది జాతీయవాద స్ఫూర్తితో ఉత్తేజితులైన అంతర్జాతీయ వాదులై, స్వావలంబన, స్వయం నిర్ణయకశక్తి కలిగిన బలమైన ఆధునిక శక్తిగా రూపొందటం మన చేతిలోనే వుందన్న విశ్వాసాన్ని కలిగించిన స్ఫూర్తి ప్రదాత అని స్పష్టమౌతుంది. ఈ భావజాలం సర్వకాలాలకు సమకాలీనమేకదా. ఆ విధంగా నెహ్రూ భావజాలానికి సజీవ ప్రతీక అయిన *ది డిస్కవరి ఆఫ్ ఇండియా*కు కాలం చెల్లలేదు, ఎప్పటికి కాలం చెల్లదు.

*(ఈ వ్యాసం మీ ఆగష్టు 2013 సంచిక సంపాదకీయానికి స్పందన.)*

---

డాక్టర్ కె.యస్. కామేశ్వరరావు
కాకినాడ, ఫోన్ : 9959682711

## సాంకేతిక పదజాలం

# మాతృభాషాభివృద్ధి

- ఎస్. షమీ ఉల్లా

ప్రపంచంలో ఏ భాషా సమగ్రం కాదు. నిజానికి, ప్రతి భాషా 60 ఏళ్ళ కొకసారి మార్పుకు లోనవుతుంటుంది. నూత్నమైన అవసరాల రీత్యా నూత్న పదజాలాన్ని సృష్టించు కోవడమో; వెతుక్కోవడమో; దిగుమతి చేసుకోవడమో సర్వ సాధారణం.

భాషకు సాధికారత రావాలంటే సాహిత్యంతో పాటు శాస్త్ర, సాంకేతిక, వైజ్ఞానిక రంగాలకు సంబంధించిన పదాల వ్యాప్తి భాషలో విరివిగా ఆమోదం పొందాలి. విరివిగా వ్యవహారం జరగాలి. అప్పుడే భాషాభివృద్ధి జరుగుతుంది. ఆ భాషే నిత్య నూత్నమౌతుంది.

భాషా శాస్త్ర విషయాల అనువర్తనంకంటే ఆంగ్లంలో ప్రకటించడాలూ, తద్వారా ఒనగూడే ప్రయోజనాల గురించి బాకాలు ఊదుతున్నారు తప్ప కొత్త పదాల్ని సృష్టించి, దానిని రూఢి చేసి జన జీవన స్రవంతిలో మార్గ నిర్దేశనం చెయ్యవలసిన రీతిలో చెయ్యకపోతే భాషా వికాసం ఎలా జరుగుతుంది? అది భాషా సంక్షోభం తప్ప భాషా సంక్షేమం ఎట్లా ఔతుంది? వాస్తవానికి, ఆధునిక కాలంలో శాస్త్ర, సాంకేతిక పదజాలంతోనే మాతృభాషాభివృద్ధి సాధ్య మౌతుంది.

వస్తువుల వెనుక ఉండే భావాన్ని అర్థం చేసుకొని పదాల్ని రూపకల్పన చేసినట్లయితే కొత్త పదాల సృష్టి విస్తృతంగా జరగడానికి ఆస్కారం వుంది. తనదైన భాషాంతర్గత ధ్వని నిర్మాణ పద్ధతులను అనుసరించి రక రకాల మార్పులతో నూత్న పదాలను అనుసరించి రకరకాల మార్పులతో నూత్న పదాలను తయారు చేసినట్లయితే ఆ భాషలోని సహజమైన ధ్వని, రీతి అబ్బి భాషకు గౌరవం, అభివృద్ధి ఒనగూడుతాయి. ఉదా॥ ఆంగ్ల పదం 'హాస్పిటల్'ను 'ఆసుపత్రి'గా మార్చిన విధానం తెలుగు భాషా వ్యవహర్తల విజ్ఞతకు ఒక మచ్చుతునక. దీనిని గమనిస్తే శాస్త్ర, సాంకేతిక, వైజ్ఞానిక విషయ రంగాలకు తెలుగు అనువైన, ఆచరణాత్మకమైన భాష అని రూఢి ఔతోంది.

ప్రతిరోజూ వేలాదిమంది ఆంధ్రప్రదేశ్ సచివాలయానికి వెళ్ళి వస్తుంటారు. వారిలో ఒక్కరైనా 'సచివాలయానికి' వెళ్ళి వచ్చామని చెప్పరు. ఇక 'దూరదర్శన్' ఒక టీ.వి ఛానల్‌గా గుర్తింపే కాని 'టీ.వి' కి ప్రత్యామ్నాయ పదం కాదు. 'కరెంట్ షాక్' కొట్టిందని జనం అంటుంటే 'విద్యుద్ఘాతం'తో మరణించాడని పత్రికలు ప్రజల కోసం రాస్తున్నారు. కానీ, వాటిని రూఢి చెయ్యడం లేదు.

కాశీనాథ నాగేశ్వరరావు 'కాపర్' ను 'రాగి' లేదా 'తామ్రం'; 'నైట్రోజన్' - 'నత్రజని' అని రూఢి చెయ్యడమే కాక 'నికిల్' - 'నిఖిలము' అని; 'నియాన్' అనే మాటను 'న్యోనము' అని అనేక ఇంగ్లీషు మాటల్ని తెలుగు చేశారు. నార్ల వెంకటేశ్వరరావు 'డ్రెడ్జర్' అనే ఆంగ్ల పదానికి విశాఖపట్నం రేవు కార్మికులు వాడిన 'తవ్వోడ' అనే మాటను వాడుకలోకి తెచ్చారు. ఇక 'బస్సు, రైలు, రాకెట్, అసలు' వంటి పదాలు స్వంత భాషా పదాల్లా మారిపోయి తెలుగు వారి నాలుకల మీద నర్తిస్తున్నాయి. సజీవమైన భాష ప్రజల హృదయాల్లో జీవిస్తుందనడానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

'రైలు'ను పూర్వం 'పొగబండి' అనేవారు. ఇప్పుడు 'రైలు' అనే మాటే విరివిగా వాడుతున్నారు. ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీలో 'ఘెరావ్, ధాబా' వంటి సుమారు 800 పై చిలుకు కొత్త పదాలు చేరడం గమనార్హం. 'సిగ్నల్' అనే మాటను 'రెక్క' అని, 'రెక్కమాను' అని, లైన్లను 'పట్టాలు' అని, 'స్లీపర్'ను 'శయనయానం' అని, కంప్యూటర్‌ను 'సంగణక యంత్రం' అని, 'ఇంటర్నెట్'ను 'అంతర్జాలం' అని తెలుగు పదాలతో రూఢి చెయ్యడం ఇవాళ చూస్తున్నాం.

సరైన తెలుగు పదం దొరక్కపోతే కొత్త పదాన్ని సృష్టించుకోవచ్చు. లేదా పదాన్ని యథాతథంగా వాడవచ్చు. కొన్ని మార్లు తెలుగు భాషకంటే పరాయి భాషా పదాలే అయినా ఉపయోగించడంలో లేదా అర్థం చేసుకోవడంలో సులభమనిపిస్తుంది. ఉదా: బస్సు. దీనికి ప్రత్యామ్నాయ

పదమే కనిపించదు. అంత మాత్రానా భాషకు వచ్చే నష్టం ఏదీ లేదు. సరికదా లాభం కూడా.

ఏ భాషకైనా ఆదాన ప్రదానాలు సహజం. అవసరానికి తగినట్లు ఇతర భాషా పదాలు స్వీకరించవచ్చు. తప్పుకాదు. కానీ, సహజమైన వత్తిళ్ళ కారణంగా పారిభాషిక పదాలకు నూత్న పదాల రూపకల్పన కొంత ఇబ్బందితో కూడు కున్నప్పటికీ, ఆ కారణంగా అన్యభాషా పదాలను అదే పనిగా ఉపయోగించడం సరి అయింది కాదు. ఏదైనా నూత్న పదం కన్నా అన్యభాషా పదమే పాఠకులకు సులభంగా అర్థమౌతుందని అనుకుంటే అది మినహాయింపు తప్ప సూత్రం కారాదు.

తెలుగు భాష ఎప్పుడు పుట్టిందో ఖచ్చితంగా చెప్పలేం. సుమారు 3000 సంవత్సరాల చరిత్ర వుండవచ్చు అన్నది కొందరి వాదన. తొలి తెలుగు రాజులైన శాతవాహనుల కాలంలో జన సామాన్యంలో ఒక వ్యవహారిక భాషగా తెలుగు చలామణి అయ్యింది. దీనికి అనేక సాక్ష్యాలున్నప్పటికీ ప్రాకృత గ్రంథమైన గాథాసప్తశతిలోని అసంఖ్యామైన అచ్చ తెలుగు పదాల్ని ప్రబలమైన సాక్ష్యంగా చూపించవచ్చు. శ్రీశైలం, ద్రాక్షారామం, కాళేశ్వరం ఈ మూడింటి మధ్య ముప్పేటలా అల్లుకుపోయిన భాష తెలుగు అని ఇంకొందరి వాదన.

భాషా ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడిన తర్వాత తెలుగు భాషను ఉద్ధరించేందుకు ఒక ప్రయత్నం మొదలైనా అందుకు పూనుకోవలసిన అధికారులు ఆంగ్ల భాష మీద వున్న మమకారం వల్ల తెలుగుకు దక్కాల్సిన గౌరవాన్ని దక్కనీయలేదు.

ఇవాళ ఏడు కోట్లమంది ఆంధ్రరాష్ట్రంలోనూ, వీళ్ళేకాక భారతదేశంలో మరియు దేశం వెలుపల గల జనాభాతోనూ కలుపుకుంటే మొత్తంగా 16 కోట్లమంది మాట్లాడే పెద్ద భాష తెలుగు. ఆర్ద్రత, నాద సౌందర్యం, అక్షర రమ్యత ఈ భాషలో ఎక్కువ.

స్వర్ణోత్సవాల సందర్భంగా కొందరు తెలుగు భాష కనుమరుగైపోతోందని, అందుకు కారణమౌతున్న ఆంగ్లభాషా ప్రభావాన్ని నిలువరించలేక పోవడం వల్లే అని ఇంకొందరు; శాస్త్ర, సాంకేతిక, వైజ్ఞానిక రంగాలకు ఆంగ్ల భాషలో వున్న సులువు, సమానార్థకాలు తెలుగులో లేవని మరికొందరూ... ఇలా ఎవరికి వారు, వారికి తోచిన అభిప్రాయాలను ప్రకటించారు.

నిజమే! ఒక భాష యొక్క అస్తిత్వం దాని భౌగోళిక స్థితి గతుల మీద ఆధారపడి వుంటుంది. తెలుగు అభివృద్ధి చెందాలంటే తెలుగు జిల్లాలలో పరిపాలన పూర్తిగా తెలుగులోనే జరగాలి. కేవలం మాటల్లో జరగదు. ఆంగ్లానికి ధీటుగా సమానార్థకాలు, పద బంధాలు వాడాలి. అప్పుడే ఆ భాష తన ఐడెంటిటీ (ఉనికిని) కోల్పోకుండా వుండగలదు.

పారిశ్రామీకీకరణ, గ్లోబల్ విలేజ్ భావనలు సహజంగానే తెలుగు భాషా స్వరూపాన్ని మార్చివేశాయి. ఇటువంటి సందర్భంలో ప్రాంతీయ భాషలపట్ల వ్యతిరేకత సహజం. ప్రాంతీయ భాషలపై న్యూనతా భావం పెంచు కోవడం కంటే-ముఖ్యంగా ఉపాధికోసం ఉపయోగ పడేటట్లు తీర్చి దిద్దుకోకపోవడం; మారుతున్న కాలాను గుణంగా శాస్త్ర, సాంకేతిక రంగాలలో వచ్చే మార్పులకు అనుగుణంగా భాషను సంసిద్ధం చేసుకోకపోవడం ప్రధాన లోపం. కారణం దేశభాషల్లో మేటిగా, భావ వ్యక్తీకరణకు సులభమైందిగా ప్రాచ్యపాశ్చాత్యులచే నేటికీ కొనియాడ బడుతున్న భాష తెలుగు. దీన్ని బట్టి వైజ్ఞానిక, శాస్త్ర, సాంకేతిక రంగాలకు సంబంధించిన పదజాలాన్ని, పరిభాషను, సమానార్థకాలను సృష్టించుకొనేందుకు అనువైన భాష అని ప్రత్యేకంగా చెప్పకనే తెలుస్తోంది.

ప్రారంభపు తొలి దశాబ్దాలలో వైజ్ఞానిక, శాస్త్ర, సాంకేతిక రంగాలకు సంబంధించిన పదజాలానికి, పారిభాషిక పదాలకు, సమానార్థకాలకు కొరత వుండేది. అప్పుడు కొత్త పదాల సృష్టి కోసం తెలుగు దినపత్రికలు, భాషా శాస్త్రవేత్తలు విశేషమైన కృషి చేశారు. చక్కని ఫలితాన్ని పొందారు. దీనిని బట్టి తెలుగు జీవద్భాష అనేది నిరూపితమైంది.

దిగవల్లి వెంకట శివరావు శాస్త్ర పరిభాష పదకోశం అనే నిఘంటువు తయారు చేశారు. కాశీపట్నం కొండయ్య, కొడవటిగంటి కుటుంబరావు, వేమరాజు భానుమూర్తి... వంటివారు నూత్న పదసృష్టి, అనుసృష్టి చేసి అనేక పదాలను రూఢి చేశారు. ఆధునిక కాలంలో ఏ.బి.కె. ప్రసాద్, బూదరాజు రాధాకృష్ణ, టంకశాల అశోక్, సి. నరసింహారావు తెలుగులో చక్కగా ఒదిగే మాటల్ని రూపకల్పన చేస్తున్నారు.

అజ్ఞత వల్లనో, అలసత్వం వల్లనో, శ్రద్ధ చూపించక పోవడం వల్లనో నేడు శాస్త్ర సాంకేతిక, వైజ్ఞానిక పదజాలం తగిన రీతిలో సృష్టించబడటం లేదు. సరైన ప్రామాణిక

పదాలను రూపొందించుకోలేక పోవడం వల్ల తెలుగు భాషకు వైకల్యం ఏర్పడ్డమే కాక చాలా అన్యాయం కూడా జరుగుతోంది.

అభిరుచి, ఆసక్తి, అభినివేశం లేని వారు ఎక్కువగా పత్రికలలో, ఛానళ్ళలోకి రావడం మూలానా కొత్త పదాల సృష్టి, మందకొడిగా మారింది. ఇదంతా ఒక ఎత్తయితే, రూపకల్పన జరిగిన నూత్న పదాల వినియోగం మీడియా ద్వారా ఆశించినంత మేర జరగకపోవడం ఇంకో రకమైన బాధ.

పారిభాషిక పదాలకు తెలుగులో సమానార్థకాలు రూపొందించడం లక్ష్యంగా తెలుగు అకాడమి వంటి సంస్థల ఏర్పాటు జరిగింది. వివిధ పారిభాషిక పదాలకు సమానార్థకాలను నిర్ణయించడం, అనువదించడం వంటి ప్రక్రియ చేపట్టింది. పత్రికలు, సినిమాలు, రేడియోలు, టి.విల ద్వారా ఒక ప్రామాణికత చేకూరేటట్లు పదాల్ని కాయిన్ చెయ్యాలి. అప్పుడే వైజ్ఞానిక, సామాజిక విషయాల పదాలు మాతృభాషలో స్థిరీకరణ పొందుతాయి.

మాతృభాషలో రూఢి చేసుకొన్నట్లయితే అవగాహన, వ్యక్తీకరణ, విషయ గ్రహణ సామర్థ్యాలు ఆయా భాషీయులలో ఎక్కువ అవుతాయి. అప్పుడే భాషకు జవం, జీవం, మనుగడ లభ్యమౌతుంది. భాషా శాస్త్రవేత్తలు, కవులు, రచయితలు, శాస్త్రవేత్తలు, అధ్యాపకుల సహకారమే ఈ ప్రయత్న సాఫల్యానికి ప్రాణాధారం. వైజ్ఞానిక, సాంకేతిక విషయాలు, దాని సమానార్థకాలు మాతృభాషలో ఒదగకపోతే మాతృభాష ఎంత గొప్పదైనా ఆ భాష మృత భాషతో సమానమే.

గతంలో మాదిరి కాకుండా శాస్త్ర, సాంకేతిక రంగాలు నానాటికీ పెరుగుతున్నాయి. ఆయా రంగాలు జీవితంలో భాగమౌతున్నాయి. వాని అవసరం పెరిగే కొద్దీ పద సంపద పెంచుకోవడం మినహా మరో మార్గం లేదు. శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం సమాజంలో పెరిగే కొద్దీ కొత్త పదాల జోరు పెరగడం తప్ప తగ్గడమేమీ వుండదు. కాబట్టి పాత్రికేయులతో పాటు విశ్వవిద్యాలయాలు, అకాడమీలు, ముఖ్యంగా ప్రెస్ అకాడమీలు... కలసి ప్రయత్నం చేస్తే నూత్న సాంకేతిక పద సృష్టి అసాధ్యమేమీ కాదు. అలా కాలానుసారంగా భాషను మలచుకొన్న రోజే మాతృభాష అందరి అభిరుచుల కాణాచి కాగలదు.

షేక్ షమీ ఉల్లా
తెలుగు లెక్చరర్, ఎస్.ఎస్.ఎస్. డిగ్రీ కాలేజ్,
అనంతపురం. ఫోన్ : 9441178415.

---



దువ్వూరి రామిరెడ్డి

ఇరవయ్యో శతాబ్దం ప్రథమార్థంలో తెలుగు సాహిత్య నందనోద్యాన్ని కలకూజితం చేసిన కవికోకిల దువ్వూరి రామిరెడ్డి (1895-1947) కవి, నాటకర్త, విమర్శకుడు, సినీ రచయిత, దర్శకుడు, శిల్పి, చిత్రకారుడుగా తెలుగు సాహిత్యాన్ని, కళలను సుసంపన్నం చేసిన బహుముఖ ప్రజ్ఞాశాలి. సామాన్య కర్షకుని జీవితాన్ని, విజ్ఞాన శాస్త్రాన్ని, ఒకే నాగలికి ఆంధ్ర కవితాకేదారంలో సేద్యం చేసిన కృషీవలుడు. "గరికపోచ కదలికతో హృదయం శ్రుతికలిపి విశ్వవ్యాప్త జీవిత రహస్యం గ్రహించగలడు". కృషీవలుడు, *జలదాంగన*, *నలజారమ్మ*, *నక్షత్రమాల*, *పానశాల* మొదలైనవి రామిరెడ్డి కృతులు.

సాహిత్యానికి ఒక తీరుతెన్నూ ఏర్పడాలంటే పాఠకజనంలో నిత్యం అప్రమత్తత అవసరమని నమ్మిన రమణారెడ్డి (1927-98) తన విమర్శలో, సమీక్షలో, విశ్లేషణలో వస్తువుని, హృదయాన్ని వుంచిన విప్లవ సాహిత్యకుడని రామిరెడ్డిని పొగిడారు.

ఈయన రచనలో పల్లవ కోమలమైన తెలుగు కొత్త చిగుళ్ళెత్తింది. రామిరెడ్డికి ఒక చక్కని బిరుదు ఇవ్వాల్సి వస్తే ఎలాంటిది సరిపోతుంది? ఆయన గీతాలలో పలుమార్లు ప్రసక్తమైన కోకిల పేరే స్ఫురిస్తుంది.

1929 నవంబరు 4న కడప కోటిరెడ్డి అధ్యక్షతన బెజవాడలో కూడిన ఆంధ్రమహాసభవారు దువ్వూరి రామిరెడ్డిని 'కవికోకిల'గా సత్కరించారు. ఏ వేళావిశేషమోగాని రామిరెడ్డిని మరచినవాళ్ళు కూడా కవికోకిలను గుర్తుపెట్టుకొన్నారు.

సేకరణ : కొమ్మలు రెమ్మలు నుంచి....



గుంటూరు శేషేంద్ర శర్మ

# కాలరేఖ

- రావినూతల సత్యనారాయణ

**భూమిక :**

తెలుగు దేశంలో సుప్రసిద్ధ విద్వాంసులు చాలామంది జన్మించారు. అనేకమంది మహాకవులు అద్భుత కవితా ఖండాలను సృష్టించి ఖ్యాతిగడించారు. కాని విద్వత్కవులుగా కీర్తి ప్రతిష్ఠ లార్జించినవారు తక్కువ సంఖ్యలోనే ఉన్నారు. అట్టివారిలో గుంటూరు శేషేంద్ర శర్మ ఒకరు. శర్మ బహుముఖ ప్రజ్ఞాశాలి, భాషాపరశేషభోగి. తెలుగు, సంస్కృత, ఆంగ్ల భాషా సాహిత్యాలలో నిష్ణాతులేగాక, హిందీ, ఉర్దూ సాహిత్యాలలో సహితం గణనీయమైన కృషి చేశారు.

శేషేంద్రశర్మ ఎంత గొప్ప కవియో, అంతటి గొప్ప విద్వాంసుడూ, విమర్శకుడు అనుటలో ఎలాంటి భిన్నా భిప్రాయము లేదు. ప్రముఖ కవిగా, మహాపండితునిగా, గొప్ప విమర్శకునిగా శర్మ ప్రదర్శించిన ప్రతిభ అనన్య సామాన్యము. వీరి *శ్రీవిద్యారహస్యనేతృత* సర్వం కష్టమని పేర్కొనుట అతిశయోక్తి కాదు. "భారత రామాయణములను కలిపి శర్మ చదివినట్లుగా చదివిన వారి సంఖ్య లేదనియే చెప్పవలెను" (విశ్వనాథ సత్యనారాయణ).

ప్రపంచ సాహిత్య ధోరణులను అవగాహన చేసుకొని, విస్తృత దృక్పథాన్ని అలవరచుకొని, కవితారంగంలోను విశ్వజనీన ప్రవృత్తిని ప్రకటించారు. నూతన కవితా 'వాహిక' చేబట్టి కవితా రంగంలో నూతన శకాన్ని సృష్టించారు. ఆధునిక కవితా రంగంలో 'మండేసూర్యుని'గా అభివర్ణించారు శ్రీశ్రీ శేషేంద్రశర్మని. తన కాలం వరకు ఉన్న కవితా ధోరణులను పూర్తిగా ఆకళింపు చేసుకొని, నాటికి లేనిదాన్ని సృజించి అభివృద్ధి చేయడమే వినూత్న శక్తిగా పరిగణిస్తారు శేషేంద్రశర్మ. శర్మ కలం నుండి అనేక రచనలు ప్రవహించాయి. రచనలన్ని కలిపి దాదాపు 40కి పైగా ప్రచురితమయ్యాయి.

**శేషేంద్రశర్మగారి సాహిత్య ప్రస్థానం :**

శేషేంద్రశర్మ వృత్తి రీత్యా ప్రభుత్వోద్యోగి (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో డిప్యూటీ మునిసిపల్ కమీషనరుగా పని చేశారు) ప్రవృత్తి మాత్రం సాహిత్యం. వారి సాహిత్య జీవితం అత్యంత మహోన్నతమైనది. శ్రీనాథ మహాకవి వలె నూనూగు మీసాల నాడే అంటే 20వ ఏటనే (1947లో) రచనా వ్యాసంగం మొదలెట్టారు. అనువాద కావ్యం *సొరాబు*తో ఆయన సాహిత్య ప్రస్థానం ఆరంభ మయింది. తర్వాత 1961వ సంవత్సరంలో శర్మ *చంపూవినోదిని* పద్య కావ్యం ప్రచురితమైంది. ఆ కావ్యం శర్మగారి ఆశు కవిత్వ పటిమకు, పాండిత్య ప్రకర్షకు అద్దం పడుతుంది. శేషేంద్రశర్మ 11 పద్య కావ్యాలు, 12 విమర్శనా గ్రంథాలు రచించి పేరు ప్రతిష్ఠలు ఆర్జించారు. వారి ప్రముఖ రచనలను గూర్చి సంక్షిప్త వివరణ పాఠక మహాశయుల నిమిత్తం ఇందు పొందు పరచడమైనది. విజ్ఞులు దీనిని సహృదయంతో స్వీకరిస్తారని ఆశిద్దాం!

**ప్రసిద్ధ రచనలు :**

శేషేంద్రశర్మ *నాదేశం - నాప్రజలు, శేషజ్యోత్స్న, రక్తరేఖ, ఆధునిక మహాభారతం, జనవంశం, స్వర్ణహంస, షోడశి - రామయణ రహస్యాలు, మండే సూర్యుడు, కవిసేన మేనిఫెస్టో* విశిష్ఠ రచనలుగా పేర్కొంటారు పండితులు. ఆయా రచనలలోని విశేషాలను తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం.

**నాదేశం - నాప్రజలు :**

సాహిత్య వ్యాసంగంలో ప్రయోగాలు చేయుట శేషేంద్రశర్మకి అత్యంత ప్రీతికరమైన విషయం. ఆధునిక సాహిత్యంలో కావ్యేతిహాసాలు లేని లోటును తీర్చే ఉద్దేశ్యంతో శేషేంద్రశర్మ *ఆధునిక మహాభారతము (నాదేశం-నాప్రజలు)*

రచించారు. విలక్షణ ప్రక్రియ అయిన 'వచన కవితా వాహిక' ద్వారా ఒక అద్భుత కావ్యాన్ని సృష్టించి ప్రపంచస్థాయి రచయితగా నిలిచారు శేషేంద్రశర్మ. సామాజిక చైతన్యాంశాలను సాహిత్యంలో ప్రవేశపెట్టి విలువలను పెంచడమే కాక, ఒక నూతన ప్రక్రియ ఆధునికులకు పరిచయం చేశారు. "ఇతిహాస నిర్మాణానికి బాధానుభూతి పూర్వక బలి కావాలి. నేనే ఆ బలి! నా వయస్సు నా పాండిత్యం, నా ప్రతిభ, నా అనుభవం సర్వస్వం పిండి, మాటల గొంతుల్లో పోసిన నా రక్తం ఈ ఇతిహాసం. ప్రపంచ మానవుల్ని, వాళ్ళ చరిత్రల్నీ, వాళ్ళ జయాప జయాల్నీ, వాళ్ళ భూత భవిష్యద్వర్తమానాల్నీ, అన్నిటినీ అనుభవ జ్ఞాన నేత్ర ద్వయంతో అవలోకన చేసి, ఆ విశ్వ దృశ్యం నుంచి ఈ తాత్పర్యం పిండాను" అంటారు శర్మగారు *నాదేశం-నాప్రజలు* గురించి ప్రస్తావిస్తూ!

వర్తమాన తెలుగు కవిత్వంలో ఇతిహాసం ఒక అచుంబితమైన ప్రక్రియ. "ఇప్పుడు నేను ఈ ఇతిహాసం సమర్పిస్తున్నాను, దేంట్లో ఒక సామాన్య కర్షకుడు నాయకుడో ... కర్షకుడి జీవితంలో ఏం గాథలుంటాయి... ఈ ఇతిహాసంలో కథ కోసం చూడకూడదు... ఆధునిక యుగంలో పాశ్చాత్య దేశాల్లో కథా రూపం ఇతివృత్తం లేని ఇతిహాసాలే వస్తున్నాయి". ఈ పుస్తకం ద్వారా కవిత్వంలో విలువల్ని, వస్తు రూపాల్లాంటి కవితాసామాగ్రిని, కవి అలోచనలే నిర్దేశిస్తాయని, ఋజువు చేశారు శర్మ.

**శేషజ్యోత్స్న :**

శేషేంద్రశర్మ "వేదనా జీవితం నుండి ప్రేమోప జీవిగా మారిన తరుణంలో రచించిన రచన *శేషజ్యోత్స్న*. ఇది ఇరువది కవితల ఖండ కావ్యం. దీనికి శేషేంద్రశర్మ రచించిన ఉపోద్ఘాతం 'నేనూ - నా నెమిలీ లేక నెమిలీ - నా నేనూ' విశేషించి పేర్కొనదగినది.

ప్రేమ కూడా ఒక తపస్సే! విరహావస్థలో కంటే, సాఫల్యంలో దాన్ని తపస్సుగా, దర్శనంగా, ఆత్మ సంస్కారంగా, అనుభవించుట గొప్ప సంస్కార వంతుల విశేషం. అట్టివారు అరుదుగా వున్నారు. సాధారణంగా ప్రేమ తపస్సులైన కవులు విరహులే!

*శేషజ్యోత్స్న* కవితా ఖండికలలో ఎక్కడ చూచినా ప్రేమ సాఫల్యానుభూతి కవితా మధు స్రవంతిగా ప్రవహిస్తుంది! మచ్చుకు :

**ఇన్నాళ్ళు ఎక్కడున్నావు నీవు అన్నాయి -**
**నా పెదవులు మృదువులైన అక్షరాలుగా మారిన**
**జన్మాంతర నిరీక్షా మధువుతో తడిసి - ...**
**బహు జన్మల సమూహాలకు పూర్వం**
**నాలో నీవు, నీలో నేనూ ఉన్నాను కాబోలు ...** *(ఆమె రెండు కళ్ళు)*

**నిన్నూహించి రెండు ముక్కలు చెపితే -**
**అవే రెండు రెక్కలయి - ఊహ**
**విహాయసంలో కెగిరి పోతుంది -**
**అదే ఒక గీతం అవుతుంది - ...** *(ఏవో చినుకులు)*

ఇందు లోని మిగతా కవితా ఖండికలు ముఖ్యంగా, *పడవలూ-తెరచాపలూ, నూతన తీరాలు, నీవు, ఆరోజు, మనసే ఒక మధుమాసం, చీకటి దయ్యాలు, వెన్నెల వృథ,* ఇత్యాదులు చదివి ఆనందింప తగినవి. ఈ కవితా సంకలనం 1972 లో ప్రచురిత మైనది. ఇది ఇంగ్లీషు, ఊర్దూ, హిందీ భాషల లోనికి అనువదించ బడినదంటే, దీని ప్రాముఖ్యత, ప్రభావం ఎలాంటివో ఊహించు కోవచ్చు!

**రక్తరేఖ (నాడైరీ) :**

ఈ పుస్తకం శేషేంద్రశర్మ తన స్వంత ఉపయోగం కోసం వ్రాసుకొన్న చిత్తు పుస్తకం (Writers Note Book). దాన్ని యథాతథంగా ప్రచురించటం జరిగింది. ఇందులో తత్వ విచారమూ, తెలుగు దేశంలో కవిత్వం పట్ల ప్రబలిన అపోహల ఖండనమూ ప్రధాన భాగాలు.

కవిగా భావకుడుగా శేషేంద్రశర్మలో జరిగిన పరివర్తన తెలుసు కొనుటకు *రక్తరేఖ* ఉపకరిస్తుంది. శేషేంద్రశర్మగారిలో ఏ మార్పు వచ్చినా - ఆయనకు చిన్న పిల్లల మీద, పక్షుల మీద ఉదయాస్తమయల మీద, ఉండే మోజు పెరుగుతుంది! "ఎందుకు వస్తున్నాయి ఈ చక్కని భావాలు నిశ్శబ్ద బంధురమైన నా మందిరము లోకి" అని తన్ను తానే ప్రశ్నించు కొంటాడు. "నీలాకాశంలో తెలి మబ్బులై పొండి, సాగరాల్లో నావల తెరచాపలై పొండి, దూర తీరాలకు తరలి పోయే పవనాలై పొండి, రేపటి గులాబీల తోటల్లో ఉషస్సులై పొండి!" అంటూ పాఠకుల పైకి తన భావాల్ని గుప్పిస్తారు శేషేంద్రశర్మ.

ఆయన హృదయ పరిణతిని *రక్తరేఖ* కావ్యం వివరంగా చిత్రిస్తుంది. ఈ పుస్తకం 1974వ సంవత్సరంలో ప్రచురితమైనది. సాహిత్యం గురించి, సమాజాన్ని గురించి ఎన్నో ఆలోచనాత్మకమైన విషయాలను పొందు పరిచారు రచయిత ఈ పుస్తకంలో.

**ఋతుఘోష :**

శేషేంద్రశర్మ కవితా ప్రతిభను విశ్వనాథ మొదలు పుటపర్తి నారాయణాచార్యుల వరకు ప్రశంసించని వారు లేరు. శర్మ కవితల్లో శ్రీనాథ మహాకవి ఛందో బద్ధత, ముక్తచ్ఛంద రచనలో బాలగంగాధరతిలక్‌తో సాదృశ్యము కనిపిస్తుంది. భాషా సౌందర్య రహస్యం ఆధునికుల్లో శేషేంద్రశర్మకూ, తిలక్‌కూ తెలిసినంతగా మరెవరికి తెలియదని ఆర్.యస్. సుదర్శనం వంటి విమర్శకుల అభిప్రాయం. కొందరు విశేషజ్ఞులు ఋతుఘోషను శేషేంద్ర హృదయ వేదంగా అభివర్ణించారు. ఒక విధంగా ఆలోచిస్తే *ఋతుఘోష* పేరులోనే కనిపిస్తున్న 'ఘోష' దీనికి అంతస్సూత్రం. ఒకానొక 'ఆర్తి' దీనికి జీవనాడి! శరీరాన్ని 'కారాగారంగా' భావించి ఎక్కడికో ఎగిరి పోవడానికి ఆకాంక్షించే తత్త్వం. అది అసాధ్యమైన నిర్వేదం దీనిలో కనిపిస్తాయి.

**ఆసల్ తీరునే దృష్టిచే, మహిత ఘాదాలింగ నాయుక్తిచే**
**నా సంయోగ నిరంత వేదనము లేయద్వైత సంసిద్ధికో**
**నైసర్గంబగు నేయగాధకుహరాంతకః, ప్రజ్వలానంద కీ**
**లానంతర్పణకో శరీర మొక కారాగారమై తోచగన్.**

అంటూ ప్రగాఢ తాత్త్విక రేఖను ఆవిష్కరిస్తాడు. ప్రణయాన్ని 'ఆనంద' భూమికకు ప్రచోదనం చేస్తాడు. శేషేంద్ర ప్రణయ తత్త్వం శరీరావధి కాదు, 'ఆనందావధి'. అంతేకాదు, 'శరీర మొక కారాగారమై తోచగన్' అనే మాట అత్యంత కీలకంగా తోస్తుంది. కవి ప్రతి కవితా ఖండికలోనూ, ఎగిరి పోవాలనే ఆకాంక్షను ఏదో విధంగా వ్యక్తం చేస్తాడు! పక్షులూ, ఎగరడం, ఆకాశం – ఇవే తరచుగా శేషేంద్రశర్మ కవితలో మన కెదురయ్యే కవితా సామాగ్రి! *ఋతుఘోష* లోనిదే మరో పద్యం పరికించండి:

**ఎవడో చాకలి ఆకలిన్ మరచి తానే వన్యై మల్లీలతా**
**నివహాక్రోడపుటీ తటాకమున నో నిత్యాశ్రమా జీవన**
**వ్యవసాయం బొనరించు చున్న ధ్వనియే వ్యాపించే ప్రాపంచిక**
**వ్యవహార ప్రవిహీన విశ్వహృదయ వ్యాపార మేమో యనన్.**

నిశ్శబ్ద మావహించిన మధ్యాహ్న వేళ చాకలి వాడు బట్టలుతికే ధ్వని 'విశ్వ హృదయ వ్యాపార' మన్నట్లు వినిపించిందట! అంతర్ముఖుడైన ఋషి ధ్యాన నిష్ఠతో కూర్చున్నప్పుడు మనస్సు ఇంద్రియ వ్యాపారముల నుంచి నివర్తితమయ్యే స్థితిలో వినిపించే హృదయ స్పందనాన్ని ధ్వనిస్తూ, ఋషికి విశ్వానికి ఏర్పడే తాదాత్మ్యాన్ని సూచించే తీరున సాగిన పై పద్యం *ఋతుఘోష*లో ఆణిముత్యం లాంటిది. కావ్యమంతా ఇటువంటి ఆణిముత్యాల మాల! ఈ కావ్యంలోని మరో విశేషం కవి ఒక వంక ఋతువుల సౌందర్యాన్ని వివరిస్తూనే అది పేదలకు, దీన జనులకు అందడం లేదనే ఆవేదనను వ్యక్తం చేస్తాడు. పాఠకుల దృష్టిని అందం మీది నుండి లోక భోగ వ్యత్యాసం వైపు మళ్ళిస్తాడు! అదే శేషేంద్ర ప్రత్యేకత!

**స్వర్ణహంస :**

ఈ వ్యాస సంపుటి 1968వ సంవత్సరంలో వెలువడింది. ఇది సంస్కృతంలో హర్షభట్టు (శ్రీహర్షుని) ని విరచితమైన *నైషధ మహాకావ్యం* యొక్క విశ్లేషణాత్మక విమర్శ. సాహితీ లోకం హర్ష నైషధంను కావ్యముగా పరిగణించి పఠించు చున్నది. "హర్షుని కేవలము సారస్వతేయునిగా మాత్రమే లోకము తలచుచున్నది. అది పొరపాటు. హర్షుడపర శంకరుడు. శాంకర సాంప్రదాయము కాంతా సమ్మితముగాజెప్పుటకీ గ్రంథము వ్రాసెను" అంటారు శేషేంద్రశర్మ. ఇంకా "*హర్షనైషధం*లో హంస దానెవరో యెనిమిది వందల సంవత్సరముల నుండి చెప్పు చున్నప్పటికిని ఇంత వఱకు ఎవరును గుర్తింప లేదు"..! ... నైషధము మంత్ర శాస్త్రము; నైషధము యోగశాస్త్రము; నైషధము వేదాంతశాస్త్రము. ఈ విషయమును శేషేంద్రశర్మ సమన్వయ పూర్వకముగా సమర్థించి ఈ విమర్శనా గ్రంథము *(స్వర్ణహంస)*లో చూపించారు (నిరూపించారు). శర్మ విశ్లేషణ ప్రకారం నలుడు జీవాత్మ; భీముడు పరమాత్మ లేక నిర్గుణ బ్రహ్మము; దమయంతి శ్రీ మహాత్రిపురసుందరి. *హర్షనైషధం* లో మొదటి మూడు సర్గలలో క్రమముగా అజప మంత్రాధి దేవతగా, జీవాత్మగా, పరమాత్మగా వర్ణింపబడినది. ఈ విషయం ఉపనిషత్తుల నుండి ఉదాహరణలు తీసుకొని సమర్థించారు శర్మగారు. ఈ సిద్ధాంతాన్ని పూర్వ పక్షం చేయుట సులభ కార్యం కాదు.

నైషధ వ్యాఖ్యాత, మల్లినాథసూరి గాని, నైషధాన్ని తెలుగు జేసిన శ్రీనాథ మహాకవి గాని, ఈ విషయములను విశద పరచలేదు. అదే విధంగా, నైషధము నందలి సరస్వతి నలుని కుపదేసించిన చింతామణి మంత్ర వరమగు 'ఆవామావామార్థే' అను శ్లోకమునకు మల్లినాధుడు "దేవతా, మంత్ర యంత్రాణాం త్రయాణామపి ప్రకృతత్వాత్" అని మూడర్థములను, ప్రకృతములని చెప్పగా, శర్మ ఆ మూడర్థములే గాక బ్రహ్మ విద్యా రహస్య పరమగు నాల్గవ యర్థము కూడా

కలదని, అది ప్రకృతము గాకున్నను బ్రకృతమైన మంత్ర శాస్త్రార్థము కన్న పరమ రమణీయమైనదని పేర్కొన్నారు.

నైషధ కావ్యం ధ్వని కావ్యం. కాని, ఈ కావ్యం లోని ధ్వని గూఢ ధ్వని. హర్షభట్టు వ్యాస వాల్మీకాదుల వలె ఆధ్యాత్మిక యోగమంత్ర శాస్త్ర రహస్యములను ఆ కావ్యము నందు నిక్షేపించి అపార ప్రతిభ ప్రదర్శించారని శర్మ వాదన. శేషేంద్రశర్మకి యోగమంత్ర శాస్త్రములందుగల అభినివేశము అపారం. ఆ శాస్త్రములలోని రహస్యములన్నియు వారికి కరతలామలకము. అందుచే సహేతుకమైన వారి వాదన ఖండింపజాలనిది. *స్వర్ణహంస* శర్మగారికి, తంత్ర, మంత్ర యోగశాస్త్రాదులలో గల అపార జ్ఞానానికి నిదర్శనము.

**పక్షులు :**

పక్షులు అనే కవితా సంపుటి 1970వ సంవత్సరంలో ప్రకటితమైనది. ఈ సంపుటికి వ్రాసిన మున్నుడిలో "కవిత్వమంటే పద్యమేనని కొందరు, కాదు గేయమని కొందరు, కాదు వచన కవితేనని కొందరు ... కవిత్వమనే ఆ ఆనంద స్వరూపిణి ఏ ఒక్క రూపంలో మాత్రమే ఎందుకుంటుంది? ... అన్ని ప్రక్రియలు ఉండవలసిందే" అంటారు శేషేంద్రగారు. "కవిత ధరించే బాహ్య వేషం ఛందస్సు... అంతరదృష్టితో పరిశీలిస్తే దాని నెట్లా చెప్పాలంటే - యుగయుగాల పొరల క్రింద అణగి నూతన వ్యక్తీకరణ కోసం తహతహ లాడుతూవున్న, మానవాత్మ సాహిత్య బంధాలన్నీ ఛేదించుకొని సముజ్వల భావ లావాగా ప్రవహించింది. పశ్చిమ దేశాల్లో ఛందస్సు విగళితం కావడం కవితలో రూపానికి ప్రాధాన్యం నశించడానికి సంకేత మైతే, మన దేశంలో ఒక రూపాన్ని తోసేసి, మరొక రూపాన్ని స్వీకరించడం మాత్రమే అయింది. ...అందుచేత కవిత్వం ఎలా వ్రాయాలి అనే విషయం మీద గంతులు వేయడం కంటే, కవిత్వం ఎలా వుంటుంది అని వివేచన చేయడం లాభదాయకం" అంటారు శేషేంద్ర.

ఈ సంపుటం చెరుకువిల్లు అనే కవితతో ప్రారంభించారు శేషేంద్ర. భావకుడైన సహృదయుడు, ఈ కవితను చదివితే ఆనంద జీవన మధూళిలో స్నాతుడౌతాడు! చెరుకువిల్లు అనేది మన్మథ ప్రతీకమైన కవి సమయం. కాని, దీనిని శేషేంద్ర కవి మన్మథ ఆయుధంగా చిత్రించలేదు. మనసులో చైతన్య జ్వాలగా మెదిలే కవితా మహేంద్ర చాపానికి ప్రతీకగా ప్రయుక్తం చేశాడు. గమనించండి.!

**అక్షరాల ఇసుకతో కవిత కడతారామరి -**
**తలపుల నెత్తావులు చిమ్మే మృదు హృదయ**
**సుమ ధూళి కావాలి; జీవన మధూళి తో తడపాలి -**
**చెఱకువిల్లు విరిచిన వాడే చిగురు కైత చెపుతాడు**
**ఎదల పొదరిళ్ళ మీద మల్లెలు విరియిస్తాడు. ...**
**జీవితంలో లేని కవితా కాగితంలో వస్తుందా -**
**తునక మబ్బు లేకుండా చినుకు నేల బడుతుందా. ...**
**సుందర భావ జగత్తు సృష్టించ లేని వాడు -**
**ముసలి పదాలతో మురిపేలాడుతూ సరి పుచ్చుతాడు**
**ఊహకు రెక్క లున్న వాడు ఉదధులు దాటుతాడు -**
**ఉత్తుంగ శిఖరాలకు ఎగురుతాడు. ...**
**వాడే, చైతన్యం - చరిత్రను సృష్టిస్తాడు -**
**చరిత్ర భారాన్ని జ్ఞాన నేత్రాగ్ని జ్వాలా దగ్ధం చేస్తాడు.**

ఇందులోని కవితలు మనోహర మైనవి. పద్య రచనలు చక్కగా నుండి, కవి నిష్ఠా తత్త్వాన్ని వేనోళ్ళు చాటుతున్నాయి. పద్యం, నిన్నటి కవితా వాహకం, నేటి తొందర జీవితానికి పద్యాలు మాత్రమే అనవద్య సాధనాలనుకోవడానికి, ఈ యుగం అంగీకరించదు. (ఆవంత్స సోమసుందర్).

**షోడశి - రామాయణ రహస్యాలు :**

షోడశి అనే పేరు 'శ్రీ విద్య'కు సంబంధించినది. శ్రీవిద్య మహాతంత్రానికి సంబంధించిన గొప్ప విద్య. గ్రంథమంతటి లోను మంత్ర విద్య, యోగములకు సంబంధించిన వివరములు చర్చించబడినవి. ఈ పుస్తకానికి వ్రాసిన మున్నుడిలో విశ్వనాథ సత్యనారాయణ చివరి అధ్యాయములోని దేవి స్తోత్ర శ్లోకమును పేర్కొని, దానికి శర్మగారు వ్యాఖ్యానించిన విధానాన్ని ప్రశంసించి, వ్యాఖ్యానము లోని విశేషాలను గూర్చి విశదీకరించారు. 'శివః' అన్న శబ్దమును పుంలింగముగా పేర్కొని, అయినప్పటికీ, విశేషణ విశేష్యములకు తత్ర తత్ర భిన్న లింగత్వము యొక్క కలిమిని తగినట్టుగా నిరూపించారు శర్మ అని పేర్కొన్నారు. శర్మ అనుసరించిన పద్ధతిని 'నిగమాగమ' సంప్రదాయమని చెప్పుట సమంజసమని అభిప్రాయపడ్డారు. శివశక్తులకభేద ప్రతిపత్తి కనుక, మరియు శివుడు శక్తి యొక్క ప్రతి బింబము గనుక శివశక్తు లిద్దరు అన్యోన్య ప్రతి బింబములని వక్కాణించారు. గ్రంథ మంతట అనేక విషయములు నిక్షిప్తమై ఉన్న వనియు, శేషేంద్రశర్మ చేసిన పరిశోధన, వారు దృఢ పరచిన విశేషాలు అత్యంత ఆశ్చర్య జనకములనియు, శర్మ మేధా విశేషం మెచ్చుకొనదగినదని చెప్పారు.

*షోడశి గ్రంథంలో* ప్రధాన విషయములలో మొదటిది *రామాయణంలోని సుందరకాండకు* ఆ పేరు ఎందువలన

వచ్చిందన్న ప్రశ్న, దానికా పేరు వచ్చుటకు కారణం ఆ కాండంలో కుండలినీ విద్య ప్రతిపాదించబడినదని చెప్పుట. రెండవది *సుందరాకాండ*లో త్రిజటా స్వప్న వివరాలు చర్చించబడుట. త్రిజటా స్వప్న వివరణకు పూర్వం వానిని గురించిన రహస్యములను శేషేంద్రశర్మ ఎత్తి చూపి, ఋజువు చేసిన విధానము విజ్ఞుల అభిమానాన్ని ఆకట్టుకొన్నది. సుందరాకాండంలో గాయత్రీ మంత్రం నిక్షేపింపబడి యున్నదన్న విషయం పండితులకు తెలియనిది కాదు. కాని ఎచ్చట నున్నదీ ఎవ్వరూ విశదపరచలేదు. కాని, శేషేంద్రశర్మ ఈ విషయాన్ని సాపేక్షతా సహితంగా నిరూపించారు. ఐతే, *సుందరాకాండ* పేరు విషయం. అమ్మవారు సౌందర్య నిధి. నిధి కాదు ఆమెయే సౌందర్యము. 'శ్రీ దీప్తి, హ్రీం శాంత్యాది' శబ్దముల యొక్క యర్థము దేవి యందు పర్యవసించునట్లు సౌందర్యమనగా దేవి - అందుచేత ఈ కాండమునకు *సుందరకాండ* అని పేరు వచ్చిందని శేషేంద్రశర్మ ప్రతిపాదన.

**మరోవిషయం :**

*రామాయణం, భారతము* కన్న ఆధునాతనమన్న వాద తిరస్కారము. దీనికై శర్మ అశేష కృషిసల్పారు. *రామాయణం*లోని కొన్ని శ్లోకాలను యథాతథంగా భగవాన్ వ్యాసులు *మహాభారతం*లో చొప్పించిన వివరాల విశ్లేషణ. ఇది *మహాభారతము* వాల్మీకి *రామాయణా*నికి ప్రతిబింబమనే సిద్ధాంతానికి బలమును చేకూరుస్తుంది.

*షోడశి*ని గూర్చి చివరి మాటగా "మొత్తము మీద ఒకటి నిస్సంశయముగా చెప్పవచ్చును. వీరి పాండిత్యం చాలా లోతు గలది. వీరి శ్రీవిద్యా నేతృత సర్వం కష్టమని చెప్పుట కభ్యంతరముండ కూడదు. భారత రామాయణములను కలిపి వీరు (శేషేంద్రశర్మ) చదివి నట్లు చదివిన సంఖ్య ... భారత దేశమున ఒకరిద్ద రుందురేమో?" అని అభిప్రాయపడినారు విశ్వనాథ సత్యనారాయణ! అందుచే షోడశిని చదివి విజ్ఞులైన పాఠక మహాశయులు *రామాయణ, భారతాదుల*లో నిక్షిప్తమైన తంత్ర, మంత్ర యోగ సిద్ధాంతములను గూర్చి వివరాలను, విశేషాలను గ్రహిస్తారని ఆశిద్దాం. *షోడశి* తొలిసారి 1967వ సంవత్సరంలో ప్రచురితమైనది. 16 శీర్షికల క్రింద వివరాలన్ని చర్చించబడినవి.

*షోడశి, స్వర్ణహంస* గ్రంథాలలో శేషేంద్రశర్మ వివరించిన అంశాలు పరిశోధనాత్మక మైనవి. మంత్ర, తంత్ర శాస్త్రాలలో శర్మకి గల ప్రావీణ్యం విశదపరుస్తాయి. ఎక్కువ మందికి తెలియని విషయాలని చర్చించడం వలన ఈ రెండు పుస్తకాలకు మంచి పేరు వచ్చింది. వీటిని 'శాస్త్రానుస్యూతవర' విమర్శగా పేర్కొన్నారు ఆచార్య సంపత్కుమారవర్యులు. వీనిని తెలుగు సాహిత్య విమర్శలో ప్రామాణిక విమర్శ గ్రంథాలుగా పేర్కొన వచ్చును.

**విహ్వాల :**

శేషేంద్రశర్మ బహుముఖ ప్రజ్ఞాశాలి. కేవలం పద్య రచనలూ, విమర్శాయుక్తమైన వ్యాసాలే కాక మిగతా సాహిత్య ప్రక్రియలలో సహితం అందెవేసిన చేయి. చిన్న కథా ప్రక్రియా రచనలో ప్రయోగాలు చేశారు. ఆయన ప్రచురించిన కథా సంపుటి *విహ్వాల* పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నది. ఈ సంపుటిలో ఐదు కథలను సమకూర్చారు రచయిత. దీనిలో *రంగుల చేప* అనే కథానిక కథా శిల్పానికి చెప్పుకోదగిన ఒక విలక్షణ రచన. మానవీయతలో పాత్ర *అంతరంగిక* కల్లోలం, ఆ కల్లోలం మధ్య ఆర్ద్రంగా ఎగురుతున్న నీటి తుంపరలు-సమస్తమూ క్లుప్తతతో విరిసినై. సముద్రం మీదికి వెళ్ళి తిరిగి రాని తండ్రికై నిరీక్షిస్తూ నిలచిన జాలరి పసిబాలుని చిత్రణ హృదయ విదారకంగా ఉంది. మరువలేని, మరపురాని సంఘటన అద్భుతంగా వర్ణితమైనది. సంపుటిలోని మిగతా నాలుగు కథలూ ఆస్వాదనీయాలు, పఠితలను ఆలోచింప చేస్తాయి.

**మబ్బుల్లో దర్బారు :**

ఈ రచన శర్మ మరో రూపాన్ని (నాటక కర్తగా) ప్రదర్శిస్తుంది. వారి బహుముఖ ప్రజ్ఞకు మరో ఉదాహరణగా పరిగణింపదగినది. కొందరు ఏ పని చేసినా శోభిస్తుంది. శేషేంద్రశర్మ పద్యం వ్రాస్తే, పాడితే 'స్కాచ్' పుచ్చుకున్నంత (శర్మగారి అత్యంత ప్రీతి కరమైన చర్య) పరమానందం, జెట్ ఎక్కినంత సంబరం. "ఈనాడు ప్రచలితమౌతున్న అన్ని బ్రాండుల కవిత్వాన్ని ఆయన పద్య"మంటాడు. అందుకేనేమో శేషేంద్ర కవితని "పద్యమా లేక ఫ్రెంచి మద్యమా" అన్నారు శ్రీశ్రీ.

ప్రస్తుత రచన *మబ్బుల్లో దర్బారు* ఒక ఊహా చిత్రం (ఫేంటసీ). దీనిని విప్లవ నాటికగా పేర్కొన్నారు రచయిత. చదివి ఆనందింపతగినది. పాఠక మహాజనులను బాగా ఆకర్షిస్తుంది. దీనిని తొలిసారి 1968వ సంవత్సరంలో ప్రచురించారు.

**మండే సూర్యుడు (కవితా సంపుటి) :**

*మండే సూర్యుడు* అనే శేషేంద్ర కవితా సంపుటి 1974 లో వెలువడింది. ఈ సంపుటి కార్య కలాపాలలో శ్రీమతి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిరి పాత్ర వహించారు.

ఆమె మాటల్లో : "It has emerged in these poems as the chosen voice of his people".

ఈ సత్యం *మండే సూర్యుడు* కావ్యంలోని ప్రతి కవిత లోను స్పష్టమవుతుంది. శేషేంద్ర కవి వాడిన – చెమట బిందువు, కండల కొండలు, పిడికిలి, ఆక్రోశిస్తున్న అడవులు, వ్రేలాడిన శిరసు, వంతెనలు, వంటి ప్రతీకలు పుంఖాను పుంఖాలుగా మన హృదయం పైన జలపాతంలా విరుచుకు పడతాయి! ప్రతి పేజీలో విశ్వమంత రహస్యాన్ని ఇముడ్చు కొన్న పద చిత్రాలతో వెలితి లేని గీతికా భోగపదం అలరారు తుంది. ప్రతి శబ్ద దళమూ మనలను మంత్ర ముగ్ధుల్ని చేస్తుంది. *మండేసూర్యుడు* సంపుటిలోని కవితలన్నీ ప్రధానంగా అత్యాధునికమైన Imagist symbolist. సంవిధానలకు చెందినవి. నేడు అంతర్జాతీయంగా ప్రచలిత మౌతున్న కవితా ధోరణిని పుణికి పుచ్చుకొన్నవి.

ఇక ఈ సంపుటి శీర్షికను (పేరును) నిర్ణయించిన తొలి కవిత *మండేసూర్యుడు.* ఈ కవిత హైదరాబాదు రేడియో కవి సమ్మేళనంలో మొదటి సారి ప్రసారమయింది. ఆ సమయంలో గొప్ప సంచలనం రేపింది. దీనినే ఆంధ్రప్రభ వారపత్రిక (13-11-1974) సంచిక *మనిషిని చెక్కిన శిల్పి* అనే శీర్షికతో ప్రచురించింది.

సూర్యుడు అనే ప్రతీక పూర్వం చాలామంది కవులు ప్రయుక్తం చేశారు. అయితే, మహత్తర శక్తి సంపన్నంగా ఈ కవితలో ప్రచలితం కావడం వల్ల ఈ ప్రతీక చాలామంది యువ కవులను ప్రభావితుల్ని చేసింది. ఇంతకీ ఈ *మండేసూర్యుడు* అనే కవితలోని విశిష్టత ఏమిటి? పద చిత్ర బాహుళ్యముతో ధగధగ లాడుటయేనా? లేక, ప్రతీకవాద శిల్పంతో శిఖరాగ్రం అందుకొనడమేనా? మరేమైనానా? శేషేంద్రశర్మ చెమట బిందువు స్వగతాన్ని ఇతివృత్తంగా ఎన్నుకొన్నాడు. ఆసాంతం స్వాత్మక ధోరణిలో చెమటబిందువు స్వగతంగా ఈ కవిత సాగుతుంది. అయితే ఈ చెమట బిందువు ఎలాంటిది? 'కండల కొండల్లో ఉదయించే లోకబంధువు'; అంటే లోకబాంధవుడు సూర్యుడని వేరే చెప్పనక్కర లేదు. సూర్యుడే లేకపోతే ఈ భూమిమీద జీవన సర్వస్వమంతా నిర్జీవమవుతుంది. అంతేకాదు, శ్రమైక జీవనానికి సమస్త వస్తూత్పత్తికీ ఈ చెమట బిందువు ప్రతిష్ఠించ బడింది.దీనినుంచే సమస్త భాగ్యభోగ్యాలు రూపొందుతున్నవి. అయినా లోకం ఈ చెమటబిందువుని ఖాతరు చేయుట లేదు. స్వేదశక్తి పరిగణనపొందలేదు. శ్రమబిందువు శ్రమశక్తికీ, సృజనశక్తికీ ప్రతీక. కనుక, తాను సంఘీ భావంతో ఏ ఘనకార్యమైనా సాధించగలదు. ఈ జగత్తు రూపు రేఖల్ని పూర్తిగా మార్చివేయగలదు. ఒక ప్రతీకను నెలకొల్పి ప్రథమపురుషలో దాని పరంగా కవితను వెలార్చే ధ్యానంలో సాధారణంగా కవులకీ తమ ప్రతీకలకీ మధ్య పేచీలు వచ్చుట సహజమే. ప్రతీకను దురాక్రమించి ఆరోపితం కావడం వలన రసభంగం జరుగుతుంది.

**"సూర్యుడు ఉదయించకపోతే – మండే నాగుండె చీల్చి దానిమీద పెడతా"**

సూర్యుడు కాంతి హీనుడయితే ప్రజ్వలించే తన గుండెనే చీల్చి సూర్యుడి స్థానంలో నెల కొల్పుతానంటుంది చెమటబిందువు!

"ఎట్టిటి నా కండలతో ఎండలు కాయిస్తా" అన్న వ్యాక్యంతో ఈ కవిత పరాకాష్ఠనందుకొంటుంది. ఈ ముగింపు వాక్యంతోనే *మండే సూర్యుడు* అనే కావ్య నామం సార్థకృత పొందుతుంది.

ఇంతవరకూ "కేవలం పదాల పోహళింపు ద్వారా శబ్ద శక్తి పై ఆధార పడిన సౌందర్యానికి కవితా శిల్పం కాణాచిగా రూపొందింది. *మండే సూర్యుడు* కవితా సంపుటిలో ఈ లక్షణానికి మూరుగా పదచిత్ర రచన ప్రాధాన్యం సంతరించు కొంది, ప్రతీకలు అతి ధారాళంగా నెలకొల్పబడ్డాయి. నూతన సంవిధానం ద్వారా ప్రతి వాక్యమూ ఒక మనోహర భావ చిత్రంగా (Ideogram) రూపొందింది. ఒక సమగ్ర తేజశ్శక్తిని స్వాయత్తం చేసుకొంది. ఈ సంపుటిలోని ప్రతి కవితకు శేషేంద్ర శర్మ స్వయంగా ఆంగ్లానువాదాన్ని పొందు పరిచారు. పుస్తకం చదువుతుంటే పాఠకునికి చెమట బిందువు స్వగతాన్ని కవి చెబుతున్నాడన్నది సుబోధక మవుతుంది.

**"నేను చమట బిందువుని – కండల కొండల్లో ఉదయించిన లోక బంధువుని"**

ఈ కవిత పాఠకుల హృదయాల్లో యోచనా కిరణాలను ప్రసరిస్తుంది. కావ్యాన్ని పూర్తిగా చదివిన రసజ్ఞునికి మానసికంగా విచిత్రానుభూతిని కల్పిస్తుంది.

రాత్రి నేను కనే కలలు - దినాల మీద కట్టే వంతెనలు-
నా భాష తన నిండా బాధలు నింపు కొంది.
చీకట్ల లాస్యం - ఛేదించు కొని - చుక్కలు నా వాక్యాలై
సూర్యుడిలో కలసి పోతున్న - చిట్ట చివరి రాత్రి ...
రోజూ ఉదయాద్రి శిఖరం మీద -
రక్త కాంతులు చిందే గుండ్రని పాటని!

**కవిసేన మేనిఫెస్టో :**

గుంటూరు శేషేంద్రశర్మ విమర్శాప్రస్థానంలో సాగించిన అతి ముఖ్య మజిలీ ఈ గ్రంథ రచన. తెలుగులో అభ్యుదయ సాహిత్య ఉద్యమం వచ్చి ఉండకపోతే ఇలాంటి విమర్శనా గ్రంథం వెలుగు చూడక పోవునేమో? ఈ *కవిసేన మేనిఫెస్టో* చదివే వారికి శేషేంద్రశర్మపై పాశ్చాత్యుల ప్రతీక వాద ప్రభావం బలంగా కనిపిస్తుంది.

అరిస్టాటిల్, ప్లేటో ఇత్యాది గ్రీకుపండితులయొక్క Poetics ని; లూనాషార్కే, ప్లెఖనోవ్, గోర్కి, మాయాకోవస్కీ వంటి మార్క్సిస్టుల కళా వివేచననీ; భామహ, అభినవ గుప్త, శారదా తనయాది భారతీయ మేధావుల *అలంకార శాస్త్రము*లోని విశేషాలను సమన్వయ పరుస్తూ రూపొందించారు *కవిసేన మేనిఫెస్టో*ని శర్మ. ఇలాంటి తులనాత్మక చర్చ ఇంతకు పూర్వం తెలుగు విమర్శా గ్రంథాలలో చాలా తక్కువగా కనిపిస్తుంది. ఇలాంటి పరిశోధన శేషేంద్రశర్మ వంటి మహా పండితులకే సాధ్యం. కేవలం సామాజిక చైతన్యంతో సాహిత్యం ఉత్పన్నం కాదు. సామాజిక చైతన్యాన్ని సాహిత్య చైతన్యంగా మార్చు కొనుట ఎంతో అవసరమని గట్టిగా చెబుతుంది *కవిసేన మేనిఫెస్టో* అలాంటి శక్తి లేని ఆ కవిత్వాన్ని కవిత్వంగా పరిగణించుట నిరసిస్తుంది కవిసేనలోని వాదనా పటిమ. ఆ కాలంలో అనుభూతి ఆప పదంగా, పెడ ధోరణిగా పరిగణించబడింది. ఆ సమయంలో *మేనిఫెస్టో* అనుభూతి అనే భావనను పునః పరిశీలించింది. కవిత్వానికి అతి ముఖ్యమైన అంశం అనుభూతి అనీ, అనుభూతి అనేది మెదడు ద్వారా, తర్కం ద్వారా కాక, ఇంద్రియాల ద్వారా ఆర్జించుకొనిన జ్ఞానం అని నొక్కి వక్కాణించింది. అనుభూతి అనేది జీవితంలో పూర్తిగా మునిగితే గాని సిద్ధించే వస్తువు కాదని ఉద్ఘాటించింది. "సచేతనంగా, సబుద్ధికంగా, సంకల్ప సహితంగా జీవితాన్ని ఆచమనం చేయటమే అనుభూతి కళగా అభ్యసించడం అంటే" అని పేర్కొన్నది. అంతేగాక, పాండిత్యం పట్ల ఉన్న వ్యతిరేకతా భావాన్ని, వ్యుత్పన్నత పట్ల ఉన్న అలక్ష్య తత్వాన్ని ఖండిచింది. మరియు, "కవి అన్నవాడు పుడతాడు తప్ప తయారు కాడు" అన్న నానుడిని *కవిసేన మేనిఫెస్టో* ఆమోదించదు. కాని, వ్యుత్పన్నత అంటే బహు విషయ పరిజ్ఞానమని స్పష్టీకరించి, జడమైన జీవితాన్ని ఉజ్వలిత అనుభవాలుగా మార్చడానికి ఆ పరిజ్ఞానం అత్యంత అవసరమని వివరించింది. వ్యుత్పన్నత వలన అనుభవం సంపన్నమూ, గాఢమూ అవుతుందని చెప్పింది *మేనిఫెస్టో*. మరో విశేషమేమిటంటే రొమాంటిక్ ఆత్మాశ్రయ కవిత్వం అనే పదాలు నిందా వచనాలుగా భావించే వారికి ఆ పదాల అంతరార్థాన్ని వివరించి పరాశ్రయాన్ని, ఆత్మాశ్రయము చేసుకొనుట వలనే కవిత్వం పుదుతుందని చెప్పారు. Feelings అనేవి ఆత్మాశ్రయాలేనని, అవి లేనిదే కవిత్వం జనించుట కష్టతరమని వెల్లడించారు. ఈ విషయంలో మార్క్సిష్టు సాహిత్య కారుడైన గోర్కీని ఉల్లేఖించారు.

ప్రాచీన అలంకారికులు చెప్పిన హృదయ సంవాదం, ప్రీతి మొదలగు శబ్దాలు కవిలో వస్తువు కలిగించే ఉద్వేదన, తత్ఫలితమైన నిర్మగ్నత (Reaction and involvement) లను ప్రతిపాదిస్తున్నాయి. కమిట్‌మెంట్ అనేది పైపై ప్రకటనలకు, నినాదాలకు అతీతమైనదని శేషేంద్ర అభిమతము. అంతేకాక, అనుభూతీ, కావ్య ప్రయోజనమూ, ప్రతిబద్ధతా ఐక్యం కావాలంటారు శేషేంద్ర.

*కవిసేన మేనిఫెస్టో*తో పోల్చదగిన రచనలు తెలుగులో అరుదుగానే కనిపిస్తాయి. అట్టివానిలో కట్టమంచి వారి *కవిత్వ తత్వ విచారం*, రాచమల్లు వారి *సారస్వత వివేచనా* పేర్కొన దగినవని విజ్ఞుల అభిప్రాయం. పైన పేర్కొన్న మూడు రచనల లోనూ ఆవేశం, అభిక్షేపం, శైలిలో వాడీ వేడినీ గమనించ వచ్చును. పైన ఉదహరించిన రెండు పుస్తకాలలో విస్తృత కొటేషన్లు మాత్రం కనిపించవు. అలాగే శేషేంద్ర శర్మ రచన ఏ సృజనాత్మక రచనను కేంద్ర బిందువుగా వాడుకొనలేదు.

అలాగే, తెలుగు సాహిత్యంలో కొత్తగా వచ్చిన అనుభూతి వాదానికి *కవిసేన మేనిఫెస్టో* ఒక విధమైన శాస్త్రీయ పునాది కల్పించిందంటే, ఏమాత్రం అతిశయోక్తి కానేరదు. ఈ సందర్భములో కవిసేన మేనిఫెస్టోను గురించి ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం వ్యక్త పరచిన అభిప్రాయాలను విజ్ఞులందరూ గమనించాలి.

**కాలరేఖ :**

ఈ పుస్తకం ఈ శతాబ్ది చింతన తులనాత్మక సాహిత్య

వ్యాస సంపుటి. ఇందు శేషేంద్రశర్మ రచించిన దాదాపు 24 వ్యాసాలు పొందుపరచబడ్డాయి. వీనిలో సంస్కృత సాహిత్య సంబంధమైన విమర్శనా వ్యాసాలు ఎక్కువ. మహర్షి వాల్మీకిని, వ్యాసుణ్ణి, మయూరుణ్ణి, కాళిదాసుని గురించిన వ్యాసాలున్నవి. వాటిలో శేషేంద్రశర్మ అత్యంత నిపుణతతో వారి కవితా హృదయాలను చిత్రించారు. కథా-కావ్యాల మీద, నాటకాల మీద తన వ్యతిరేకతను వ్యక్తపరుస్తూ, కాళిదాసుని *మేఘదూతం* రసయుగాన్ని అంతం చేసిందని, లక్షణకారుడు, భామహుడు ఆ ప్రభావం వల్లనే అలంకార యుగాన్ని ప్రారంభించారని శేషేంద్రశర్మ అభిప్రాయపడ్డారు. ఈ వ్యాస సంపుటిలోనే *సావిత్రి* అనే వ్యాసం, *సూర్యశతకం* పై విశ్లేషణ పరిశీలింపదగినవి. ఇందు పొందు పరచిన మిగతా వ్యాసాలు సహితం అత్యంత ప్రశంసనీయమైనవి. *కాలరేఖ* అనే వ్యాస సంపుటికి కేంద్ర సాహిత్య అకాడమీ వారు 1994వ సంవత్సరపు జాతీయ పురస్కారానికి ఎంపిక చేశారు. శేషేంద్రశర్మకి కవిగానే కాక, విమర్శకునిగా ఈ పురస్కార ప్రదానం పండిత లోకాన్ని సంతోషంతో నింపింది. *కాలరేఖ*లోని విశేషాలు పాఠకుల ముందుంచడమే ఈ వ్యాసం యొక్క ప్రధానోద్దేశ్యం. ఈ వ్యాసాన్ని చదివిన పిమ్మట *కాలరేఖ*ను విజ్ఞులైన పాఠకులు తప్పక చదువుతారని ఆశిద్దాం.

**కాలరేఖలోని విశేషాలు :**

ఇదివరలో పేర్కొనిన విధంగా *కాలరేఖ* (The Arc of Time) విమర్శనా సాహిత్యంలో ఉల్లేఖనీయమైన రచన. ఇందులోని మొదటి తొమ్మిది వ్యాసాలు శేషేంద్రశర్మ సాహిత్య విమర్శనా ప్రతిభను, వారి కవితాశక్తిని ప్రశంసిస్తూ ఇతర రచయితలు వ్రాసినవి. వీనిలో శర్మ జీవిత విశేషాలను ముఖ్యంగా వారి సాహితీ ప్రస్థానం స్థూలంగా, చర్చించ బడినది. ఇది వారి స్వీయ వ్యాసాలను చదివి అవగాహన చేసుకొనుటలో పాఠకులకు ఉపకరిస్తుంది. *కాలరేఖ* సంపుటిలో తొలి వ్యాసం *వాల్మీకి కవిత*. ఈ వ్యాసాన్ని క్రింది కవితతో మొదలెడతారు శర్మ.

**నదులు కవులు భూగోళపు రక్త నాళాలు –**
**నదులు ప్రవహిస్తాయి కవితల్లా**
**పశువుల కోసం పక్షుల కోసం మనుష్యుల కోసం –**
**నదులు కంటున్న కలలు పొలాల్లో ఫలిస్తాయి**
**కవులు కంటున్న కలలు మనుష్యులలో ఫలిస్తాయి**

*(ఆధునిక మహాభారతము)*

మనమందరం ఈ దేశంలో కవుల కలలం. కవులకు మూల పురుషుడు వాల్మీకి. ఆయన కావ్యం రామాయణం నుంచి వ్యాసుడి భారతం పుట్టింది! రామాయణ భారతాదుల నుండి భాస కాళిదాసులు పుట్టారు. ఇది ఈదేశపు కవుల వంశ వృక్షం. ఆ వృక్ష ఛాయల్లో మనం పుట్టి పెరిగి మన పరమార్థం చేరుకుంటున్నాము. సాధారణంగా ఉపమలకు కాళిదాసును పేర్కొంటున్నారు. కాని, "వాల్మీకి పెదవి కదిపితే చాలు చిలుక కొరికితే దానిమ్మ గింజలు రాలినట్లు రాలుతాయి ఉపమలు" అంటారు శర్మ. ఈ విషయాన్ని అనేక ఉదాహరణలతో అత్యంత మనోహరంగా ప్రదర్శిస్తారు పాఠకులకు. రాముడు జలాల్లోకి దిగి ఆచమనం చేశాడు. జరిగింది ఇంత మాత్రమే. కాని వాల్మీకి యొక్క వర్ణమయ దృష్టికి ఈ సాధారణ విషయంలో ఎన్నో రమణీయతలు కనిపిస్తాయి... "ఉపా స్పృశత్ సుశీతేన జలేనోత్పల గంధినా" వట్టి ఆచమనం కాదు, కలువ పూల వాసనలు గుభాళించే శీతలమైన జలాలతో ఆచమనం చేశాడు అంటాడు వాల్మీకి... ఆ వర్ణనకు రాముడి ఆచమనం మాట అటుంచి మన నోరు లాలాజలమయం అవుతుంది!

వాల్మీకి ప్రతిభను వర్ణిస్తూ "పిపీలికాది బ్రహ్మ పర్యంతమైన సృష్టిలో వాల్మీకి జ్ఞాన నేత్ర పరిధిలో రానిది ఏదీ లేదు. గుడిసె తెలుసు, మహలు తెలుసు, మద్య మాంస మహిళామయ ప్రపంచమంతా తెలుసు... ఋషిత్వం తెలుసు వేట తెలుసు, పాట తెలుసు, ఇది తెలుసు ఇది తెలియదు అని చెప్పడానికి వీలు లేదు. జ్ఞానం చేత ఆశ్చర్యం కలిగించే సర్వజ్ఞుడు! వాల్మీకి సౌందర్య సింధువు" అంటారు శేషేంద్రశర్మ...

చంద్రోదయాన్ని వర్ణిస్తున్నాడు వాల్మీకి, 'ప్రజగామ నభశ్చంద్రః' (సుందరాకాండ) చంద్రుడు ఆకాశంలో ప్రవేశించాడు. అంతటితో ఆపడు ... అది కోట్లాది కళ్ళకు కనిపించే సాధారణ దృశ్యం ... వాల్మీకికి మాత్రమే మరొకటి కనిపిస్తుంది – నీలి జలాల్లోకి హంస ప్రవేశించడం ... కవి కంటికి మాత్రమే కనిపించే రెండో దృశ్యం పరోక్షం. అది మన ఎదుట లేదు... వాల్మీకి మాటలన్నీ ఇలాంటి మాణిక్యాలే. ఆయన నోరు కదిపితే అలంకారాలు ప్రతీకలు బింబాలు... చివరకు ఆ మూర్ఛావహమైన చాంద్రీమయ నిశా శిల్పిని చంద్రుడ్ని చూచి ఋషి చేతులు జోడించి "రరాజ చంద్రో భగవాన్ శశాంకః" అంటాడు.

"రావణుడు అపహరించి లంకకు తెచ్చిన సీత రామ

వియోగం సహించలేక... ప్రాణత్యాగం చేద్దామనే నిర్ణయానికి వచ్చింది. అదే సమయంలో హనుమ అశోకవన ప్రవేశం... సీతకు ఎడమ కన్ను అదిరింది... "ప్రాస్పంద తైకం నయనం సుకేశ్యాః మీనా హతం పద్మ మివాభి తామ్రం". వాల్మీకి టెక్నిక్ సర్వత్రా ఒక్కటే! – సీత ఎడమ కన్ను అదిరింది, ఎలా – పూచిన తామర కొలనులో ఈదుతున్న చేప తోక తగిలి కదిలిన తామర పువ్వులా కదిలింది! కాని ఆయన పంక్తి పొడవు ఒక్క అంగుళమే, కాని దాని గర్భంలో ఉన్న చిత్రాన్ని – మన శబ్దజాలంలో చెప్పాలంటే ఇన్ని మాటలు తెచ్చుకోవాలి. ఈ విధంగా వాల్మీకి ప్రతిభను, ఉపమలను విశ్లేషిస్తూ వ్యాసాన్ని ముగిస్తారు శర్మగారు. వాల్మీకి ఘనత అద్దంలోని హిమాలయంగా మన ముందుంచారు ఈ వ్యాసం ద్వారా రచయిత!

*కాలరేఖ*లోని రెండోవ్యాసం కాళిదాసుని *మేఘసందేశం* ను గురించినది. శేషేంద్రశర్మ దృష్టిలో *మేఘసందేశం* ఒక కావ్యం కాదు! కుమారావస్థలో దానిని చదువుకున్న వాళ్ళకు అది జీవితాంతం వెంటాడే ఒక బలీయ స్మృతి! "ఏది వృద్ధుల్నీ, ప్రౌఢుల్నీ, కుమారుల్నీ బాలుర్నీ చేసి వయః ప్రవాహాన్ని వెనక్కి మళ్ళిస్తుందో, ఏది మృత్యుబోధ వైపు ప్రవహించే మనిషికి ఆనకట్ట కడుతుందో, ఆ ఆశ్చర్య జనకమైన కావ్యం *మేఘసందేశం*".

వాల్మీకి రామాయణంలో ఎక్కడో అరణ్యంలో ప్రచ్ఛన్నంగా పడి ఉన్న విప్రలంబ శృంగార లక్షణ యుక్తము, కరుణ రస బిందు స్పందమానము అయిన శ్లోకం –

"ఇతి వైశ్రవణో రాజా రంభాసక్తం పురానఘ! –
అనుపస్థీయ మానోమాం సంకుద్ధో వ్యాజహారహ"

అనేదాన్ని తీసుకొని *మేఘసందేశం* వ్రాశాడు మహాకవి కాళిదాసు. పై శ్లోకమే – :

**"కశ్చిత్కాంతా విరహ గురుణా స్వాధికారాత్ ప్రమత్తః ట శాపేనా స్తంగమిత మహిమా వర్ష భోగ్యేణ భర్తుః**
**యక్షశ్చక్రే జనక తనయా స్నాన పుణ్యోద కేషు ట స్నిగ్ధ ఛ్ఛాయా తరుషు వసతిం రామగిర్యాశ్రమేషు"**

శ్లోకంగా రూపమెత్తింది. "కాళిదాసులో ఈ దేశపు మట్టి వాసన ఘ్రాణేంద్రియాల్ని దేశవాసుల్నిగా పిలుస్తుంది! కాళిదాసు పితృపితామహమైన సారస్వతీయ సామ్రాజ్యానికి చక్రవర్తి! వ్యాసుడిలో వాల్మీకి కనిపించడు, వ్యాసుడి అంగాంగాన వాల్మీకి తేజస్సు మండలీకరిస్తున్నప్పటికీ. కాళిదాసులో మాత్రం పంక్తి పంక్తిలో కనిపిస్తుంది! కాళిదాసు శరీరంలో ప్రవహించే వాల్మీకి అంతర్లీనత... భారతీయ కావ్య సామ్రాజ్యంలో వాల్మీకి, వ్యాస, కాళిదాసులు సగర, దిలీప, రాఘువుల వంటి ఆదిమ చక్రవర్తులు" అంటారు శేషేంద్రశర్మ.

*కాలరేఖ*లోని మరో ముఖ్య వ్యాసం *అరవింద సావిత్రి*. వాల్మీకి వ్యాసులు దృశ్య వస్తువైన మానవుడి భౌతిక జీవయాత్రను గురించి కావ్యాలు రచిస్తే, అరవిందుడు ప్రధానంగా మానవుడి మరణాంతర జీవనాన్ని గూర్చి, అంటే, మానవుడి అభౌతిక జీవయాత్రను గురించి కావ్య నిర్మాణం చేశాడు. అంటే, అరవిందుల ఇతివృత్తం అదృశ్య వస్తు ప్రధానం. ఒక విషయం మనం గమనించాలి. వ్యాస వాల్మీకుల్లో అధ్యాత్మిక సంబంధమైన మిథకీయ సృష్టి కొంత ఉన్నప్పటికీ దానికంటే వారిలో ప్రధానం మానవుడు భూగోళం మీద చేసిన జీవయాత్ర. సావిత్రి వ్యాసుడి *మహాభారతం*లో ఉపాఖ్యానం, ఆఖ్యానం కాదు. కాని అరవిందుడు దానిని ఆఖ్యానంగా వికసింపజేశాడు. అందువలన అరవిందుని కావ్య సృష్టి అదృశ్య వస్తువుని దృశ్యమానం చేయడం అనే విచిత్ర ప్రక్రియ! ఒక విధంగా చెప్పాలంటే, వాల్మీకి, వ్యాసుల సరసరన కూర్చోబెట్టగలిగిన మహావ్యక్తి అరవిందులు. అందుచేత మన దేశంలో *రామాయణ, మహాభారత* ఇతిహాస మహాగ్రంథాల తర్వాత మూడవ ఐతిహాసిక కావ్యం *సావిత్రి*, అంటారు శేషేంద్ర.

*సావిత్రి* లాంటి ప్రాచీన కథల్లో ముఖ్యమైనది స్వర్గ నరకాన్ని గురించి చేయబడిన మానవీయ ఊహ! మానవుడు ఇహలోకంలో చేసే దుష్కర్మలు ఫలరహితంగా ఉంటాయని మనిషి ఒప్పుకోలేని దశ చేరినప్పుడు జన్మించిన ఒక ప్రతీకాత్మక తత్వచింతన ఇది. 20వ శతాబ్దంలో ఇంత మహత్తర ఆధ్యాత్మిక కావ్యం మరొకటి లేకపోవడం చేత, అరవిందుని *సావిత్రి* కావ్యం అత్యంత విశిష్ట గ్రంథంగా పరిగణింపబడుతుంది. శేషేంద్రశర్మ దృష్టిలో *సావిత్రి* ఒక భాషకు సంబంధించినది కాదు – మూలం ఇంగ్లీషులో ఉన్నప్పటికీ, అన్ని భాషలలోకి పోయి అది ప్రజల కావ్యంగా పరిగణించ బడవచ్చును. "అరవిందులు యోగి కావడం చేత ఈ కావ్యం కావ్యతలో పరాకాష్ట పొందింది. అయోగులు, అర్థ యోగులు అయిన లౌకిక కవులు ఈ మూర్ఛా మహామాయను ఉత్పాదన చేయలేరు. సృజనాత్మక శిఖరాలైన వాల్మీకి, వ్యాస, హోమర్, వర్జిల్, దాంతే... మహానుభావుల్ని కావ్యమర్మ దృష్టికి గురిచేస్తే తెలుస్తుంది, వాళ్ళందరూ యోగులు, లేక భక్తులు అని. యోగి కాని కవి వాస్తవంగా లేనేలేడు".

**వ్యాసుడెవరు ?**

“సముద్రంలో కలిసిపోయిన వాడ్నయినా పట్టుకోవచ్చు గాని కాలంలో కలిసిపోయిన వాడ్ని పట్టుకోవటం మహాకష్టం. వాల్మీకి, వ్యాసులు అలాంటి వారు” అంటారు శేషేంద్ర వ్యాసుడు అనే వ్యాసంలో. వ్యాసుడెవరు అన్న ప్రశ్నకు జవాబు అంత సులభం కాదు. ఎందుకంటే, ఏ వ్యాసుడు అన్న ప్రశ్న కూడా దానితోనే ఉత్పన్నమౌతుంది. జయం వ్రాసిన వ్యాసుడా? భారతం వ్రాసిన వ్యాసుడా? వేద విభజన చేసిన వ్యాసుడా? బ్రహ్మ సూత్రాలు వ్రాసిన వ్యాసుడా? పురాణాలు వ్రాసిన వ్యాసుడా? పతంజలి యోగసూత్రాలకు భాష్యం వ్రాసిన వ్యాసుడా? బృహస్పతి, నారద, కాత్యాయనాది స్మృతికర్తల్లో ఒకడై స్మృతి వ్రాసిన వ్యాసుడా?

మహాభారత, బ్రహ్మసూత్ర, అష్టాదశ పురాణాలు వ్రాసిన వ్యాసుడు ఒక్కడే అని సంప్రదాయం. ఈ విషయమే వివాద గ్రస్థం. అయినప్పటికీ వ్యాసుడు ఒక్కడే అన్న విశ్వాసం దేశంలో బలంగానే వున్నది. వ్యాసుడు భారతీయ సాహిత్యానికి చేసిన ప్రధానం ఏమిటని మరో ప్రశ్న. ఈ ప్రశ్నకు కూడా జవాబు క్లిష్టతరమైనదే! కవిగా, కావ్య నిర్మాతగా మహాకవి వాల్మీకిని మించిన వారు బహుశా లేరనే ఎక్కువ మంది కావ్య మీమాంసకుల అభిప్రాయము. అయితే, వాల్మీకిని అడుగడుగునా అనుసరించిన ప్రథమ కవి వ్యాసుడేనని శర్మగారి అభిప్రాయం. దీనికి ఆధారంగా *మహాభారతాన్నే* ఉల్లేఖిస్తారు శేషేంద్ర.

ఈ వ్యాసంలో అనేక విషయాలను (చాలా వరకు వ్యాస సంబంధిత మైనవి) విస్తృతంగా చర్చించారు శేషేంద్రశర్మ. వ్యాసుడ్ని గురించి అనేక రకాల ఆలోచనలు వెదజల్లారు. కచ్చితమైన నిష్కర్ష తెలియపరచలేదు. వ్యాసుడు వ్యక్తియా? వ్యవస్థా పరంపరా అనే సంశయాన్ని అలాగే వదిలేశారు. ముగింపుగా “పురాణాల విషయం వచ్చేసరికి ప్రపంచం అంతా చర్చా పరిధిలోకి వస్తుంది. కనుక వేదాల పూర్వం నుంచి సర్వత్రా, వ్యాపించి ఉన్న పురాణాలను క్రోడీకరించి అక్షరబద్ధం చేసి అష్టాదశ పురాణాలుగా విభజించి మనదేశానికి అనుగ్రహించిన ఆ వ్యాస మహర్షి ఎవరో ఆ వ్యాస సాంప్రదాయానికి నా నమస్కారము” అంటారు శేషేంద్రశర్మ! వివాద గ్రస్థమైన విషయానికి గల అనేక పార్శ్వాలను చూపెట్టారు శర్మ పాఠకులకు ఈ వ్యాసం ద్వారా.

**తులనాత్మక సాహిత్యము :**

**కాలరేఖ** వ్యాస సంపుటిలోని ప్రముఖ వ్యాసాలలో పేర్కొనదగినది తులనాత్మక సాహిత్యమనే వ్యాసం. తులనాత్మక సాహిత్యమంటే కంపారెటివ్ లిటరేచర్ (comparative literature) అంటే ఒకటి కంటే ఎక్కువ భాషల సాహిత్యాన్ని కలిపి పోలుస్తూ పరిశీలించే సాహిత్య విమర్శాప్రక్రియ. తులనాత్మక సాహిత్యానికి స్వతంత్ర రచనలే సామాగ్రి. ఆ రచనలు సహజ జాతములై ఉండాలి. అప్పుడే అవి తులనాత్మక సాహిత్యానికి లాభదాయకమౌతాయి. తులనాత్మక సాహిత్యంలో ప్రధానతః సిద్ధమయ్యే సత్య మేమిటంటే మనుష్యులు ఈ భూగోళంపై ఎక్కడ ఉన్నాసరే వాళ్ళ భావాత్మక సంఘటనలు సుఖ దుఃఖాలు సామాజిక స్థితి గతులు, చరిత్ర, ఇతిహాస పురాణావళీ ఇత్యాది మానవీయతా జన్య జీవన చిత్రాలు సందర్భాలు ఎన్ని భేదాలున్నప్పటికీ సాధారణతః సమానంగా ఉంటాయి. ఈ విషయాన్ని గ్రీకు, సంస్కృత, ఫ్రెంచి, ఆంగ్ల సాహిత్యాల నుండి అనేక ఉదాహరణలిస్తూ దృఢపరిచారు శేషేంద్రశర్మ.

అన్య భాషా సాహిత్యాధ్యాయనం చేత మన భాషలో సాహిత్యకారుల స్థాయి ఏమిటో మనకు తెలుస్తుంది. మన అల్పిష్టి కవిని చూచి వీడే మహానుభావుడనే మూర్ఖత్వానికి లొంగే ఆవశ్యకత ఉండదు. అంతేకాదు, విజ్ఞులకు తెలుస్తుంది ఏ ఒక్క భాషాసాహిత్యమూ సమగ్రం కాదని. ఆ ప్రజల సాంప్రదాయ, సంస్కృతి, చరిత్ర, అనుభూతి ఇత్యాదుల్లో ప్రవేశించే వైకల్యాల మూలంగా అసమగ్రత సంభవించుట సహజం. ఒక్కో భాషలో, ఒక్కో సాహిత్య ప్రక్రియ ఉజ్వలంగా ఉంటుంది. జీవనానుభూతులు సహితం ఒక్కో సాహిత్యంలో ఒక్కో విధంగా సంపూర్ణతను పొందుతాయి. ఈ విషయంలో తులనాత్మక సాహిత్య వేత్త హెన్రీ జిఫ్ఫర్డ్ ఏమంటారో గమనించండి “Is any one literature enough to the end of providing in itself a true education? We are bound to admit that some parts of European experience hardly entered into English literature. Certain kinds of writing were better alone elsewhere”. కనుక, “బహు భాషా సాహిత్యాల అధ్యయనం ఆధునిక మానవుడికి అనివార్య కర్తవ్యం” అంటారు శేషేంద్రశర్మ.

తులనాత్మక సాహిత్యం పాశ్చాత్యదేశాల్లో పరిశీలన శాస్త్ర రూపంలో ఇటీవలనే ప్రారంభమయింది. కాని భారత దేశంలో తులనాత్మక సాహిత్యం ప్రాచీన కావ్య శాస్త్రంలో

ఒక భాగంగా ఉండేదని అందులోను ప్రథమ భాగంగా పరిగణించబడేదనీ, దండి, వామన, రాజశేఖరాదుల గ్రంథాలు చదివితే తెలుస్తుందంటారు శర్మ. దీనికి కారణం సంస్కృత సాహిత్యమే ఒకే ఒక భాషకు సంబంధించిన సాహిత్యం కాదు. మన దేశంలో ఉన్న అనేక భాషల మిశ్రమ ప్రయోగం జరిగిన ఒక విచిత్ర సాహిత్యం సంస్కృత సాహిత్యం అంటారు శర్మ. అంతేకాదు, దండి ప్రథమ పరిచ్ఛేదంలో, మాగధ్యాది ఏడు పాకృత భాషలు అపభ్రంశ, పైశాచిక భాషలు అన్నింటినీ కలిపి, సర్గబంధ ఆఖ్యాయిక కథ నాటకాదుల కావ్య విభజన చేసిన తరువాత అంటాడు "తదేత ద్వాఙ్మయం భూయః సంస్కృతం ప్రాకృతం తథా! అపభ్రంశ మిశ్రం చేత్యాహురా ర్యాశ్చతుర్విధం" అని కనక, సంస్కృత సాహిత్యం అనగా దేశంలో ఉన్న అన్ని భాషల మిశ్రమ సాహిత్యం అని ఆనాటి భావన! "ఈ విధంగా నానా భాషా సాహిత్య సమైక్య దృష్టి ఈ దేశంలో మూలతంగా ఉండటం చేతనే అన్ని భాషల సాహిత్యాల అన్యోన్య పరిశీలన సహజంగానే సంభవించింది" అంటారు శేషేంద్రశర్మ.

మనదేశపు ఒకనాటి వలస రాజ్య స్థితి మూలంగా మనకు సంక్రమించిన సాహిత్య సంస్కృతిచేత మనం ఆంగ్ల భాష గవాక్షం ద్వారా ఆధునిక సాహిత్యాన్ని మూలంగా చూడటంలో ఒక సౌలభ్యం ఉంది. అది ఇలాంటి సందర్భాలలో లాభదాయకం. ప్రపంచ భాషల్లోని (గణనీయమైన) సాహిత్యం ఆంగ్ల భాషలోనికి అనువదించ బడుతుంది కనుక ఆంగ్ల విద్య మనకు లాభసాటి.

మరొక ముఖ్య విషయ మేమిటనగా, ఆధునిక ప్రపంచానికి తులనాత్మక సాహిత్యం అనివార్యం. హింసా పీడితమైన వర్తమాన ప్రపంచానికి తులనాత్మక సాహిత్యం ఒక విధమైన మతం. ఆధునిక మానవుడు అన్ని మతాలు విడిచి, ఈ సాహిత్య మతాన్ని స్వీకరించి ప్రజల్లో విశ్వవిద్యాలయాల్లో ప్రచారం చేయాలి. ఒక విధమైన నూతన అంతర్జాతీయ సాహిత్య చైతన్యాన్ని ఉత్పన్నం చేయాలి అని అంటారు శేషేంద్రశర్మ. అంతేకాదు, నానా భాషల్లో ఖైదీలుగా పడివున్న సాహిత్యాల్ని ఆ భాషా జైళ్ళు బద్దలు కొట్టి విడుదల చేయ్యాలి. దానికి ముఖ్యమార్గం అనువాదం, అని వక్కాణిస్తారు శర్మ. ఈ ప్రక్రియ ఐరోపాలో భారీ ఏత్తున జరుగుతున్న విషయమని విశదపరిచారు శేషేంద్ర. ఐరోపా ఒక ఐక్య బౌద్ధిక సమితిగా మారుటకు అదే ముఖ్య కారణమంటారు వారు. నేషనల్ బుక్ ట్రస్టు వంటి సంస్థలు ఈ విషయంలో ఉల్లేఖనీయమైన సేవ చేయుచున్నారని శర్మ నమ్మకం.

అనువాద ప్రక్రియ మీద ఈనాడు ఇండియాలో ఉన్న అపనమ్మకం అత్యంత గర్హనీయమంటారు శేషేంద్ర. సాహిత్యం ఎక్కడ ఉన్నా అది మనదే! సాహిత్యము ఏకము, అవిభాజ్యము. కళ విశ్వజనీనము, సృజనాత్మక కళ అయిన సాహిత్యం ఏభాషలోకైనా ప్రవేశించగలదు. ఆ భాష ప్రజల సంపదగా ప్రతిష్ఠ కాగలదని గట్టిగా వాదిస్తారు శేషేంద్రశర్మ ఈ వ్యాసం ద్వారా! అలాగే ప్రాచీన గ్రీకు, భారతీయ నాటకాల తులనాత్మక పరిశీలన వివరాలను విశ్లేషించారు శర్మ మరో వ్యాసంలో. పాఠకులందరు చదువవదగిన వ్యాసం ఇది.

*కాలరేఖ* సంపుటిలో సంకలితమైన మరో ముఖ్య రచన *ఇద్దరు ఋషులు ఒక కవి* అన్న వ్యాసం. ఇందు ఉల్లేఖించ బడిన ఇద్దరు ఋషులు - ఒకరు వాల్మీకి మహర్షి, రెండవ వారు వ్యాస భగవానులు. *రామాయణం*లో కనిపించే భారతీయ సంస్కృతిని విస్తృత పరుస్తూ వ్యాస మహర్షి వాల్మీకి అడుగు జాడల్లో పయనిస్తూ, కావ్య తంత్రాన్ని, కావ్య వస్తువును, నిర్మాణ సామాగ్రిని, భాషను తన కావ్య సృజనా ప్రక్రియకు వాడుకొన్నారు అనే భావన వ్యక్త పరిచారు శర్మ. అదే విధంగా వ్యాస మహర్షిని అనుసరించాడు మహాకవి కాళిదాసు. ఈ విషయాన్ని స్పష్టీకరించారు వారు.

వాల్మీకి వ్యాస మహర్షులు దేశానికి వారసత్వంగా ఇచ్చి పోయిన సాహిత్య సంస్కృతికి కాళిదాసు చివరి కాపలాదారు, అంటారు శేషేంద్రశర్మ. కాళిదాసు తదనంతరం, ప్రవాహమాన భాషగా ఉన్న సంస్కృతం జడత్వం పొందుట, ఆ భాషలో కృత్రిమత్వం, నిరర్థకత, పాండిత్య ప్రకర్ష ప్రవేశించడం కారణాన, సంస్కృత సాహిత్య వాహిని ఒక పిల్ల కాలువగా మారి, చివరకు బిందు బిందువుగా కారే బలహీన ధారగా మిగిలి పోయింది. అని ఆందోళన వ్యక్త పరుస్తారు శర్మ.

*ఉత్తర రామచరితము, మృచ్ఛకటికము, కర్పూర మంజరి,* లాంటి కాళిదాసానంతర కాలపు కృతులను నిర్లక్ష్యం చేయలేము కాని, ఆ కాలపు దోషాలు ఆ కావ్యాలలో లేవని చెప్పలేము. ఒక విధంగా చెప్పాలంటే, కాళిదాసు తర్వాత మరి అలాంటి కవులు జన్మించ లేదంటే, అది అతిశయోక్తి

మాత్రం కాదు. కాళిదాసుపై ప్రసిద్ధ వ్యక్తులు చాలామంది కృషి చేసి, అనేక విశేషాలు వెల్లడించారు. అయినప్పటికీ వారి దృష్టికందని విశేషాలు వెల్లడించారు శేషేంద్రశర్మ.

**ముఖ్య విశేషాలు :**

శేషేంద్రశర్మ ఉద్దేశ్యంలో కాళిదాసు మూలస్థానాలు ప్రత్యక్షం కాకపోతే, కాళిదాసీయ కళ, దాని పాత్ర ఔచిత్యం అర్థం కాదు. అలాంటి సమగ్ర అవగాహన ఒక క్లిష్ట సాహస యాత్ర! అది నిర్వహించడానికి వాల్మీకి పాత్రను సరైన దృక్కోణం నుంచి అర్థం చేసుకోవాలి.

వాల్మీకి ఇతిహాసం స్వయం కల్పిత బాధ్యతల మూలంగా అంతకు ముందు కాలంలో లేని అభివ్యక్తులని సృష్టించి దానితో శ్రోతలని ఆశ్చర్య పూర్వక ఆహ్లాదంతో ముంచి వేసింది. ప్రకృతి, నదీ నదాల వర్ణనలు, అభివ్యక్తులు అందరి కవుల చేత ఆయా సందర్భాలలో వాడుకోబడ్డాయి.

వ్యాస మహర్షి కథన కళా విధానంలో వాల్మీకిని అనుసరించారు. వాల్మీకిని అనుసరించిన మొట్ట మొదటి కవి వ్యాసుడే! తరువాతనే కాళిదాసు ఆయన అడుగుజాడల్ని అనుసరించి వాల్మీకి వారసత్వాన్ని నిష్ఠతో నిర్వహించాడు. వాల్మీకి ఉపదేశించిన ముఖ్యమైన మానవ విలువలలో రాజు, ఋషి మూలతః సమానులు అనేది, ఒకటి. అంటే, ప్రభుత్వానికి బుద్ధి జీవులకు మధ్య ఉండవలసిన సంబంధం. ఈ మానవీయ విలువల్ని వ్యాసుడు, కాళిదాసు సందర్భం వచ్చినప్పుడల్లా సమగ్రంగా పాటించారు. ఉదాహరణకి రామాయణంలో రాజు ఋషి ముందు వినమ్రుడుగా ఉంటాడు. ఋషి కూడా రాజుకు తన కంటే ఉన్నత స్థానమిస్తాడు. ఈ విషయాన్ని దృఢ పరచడానికి శేషేంద్రశర్మ రామాయణం నుండి అనేక సందర్భాలు సూచిస్తారు. అలాగే వ్యాసుడిని గురించి కూడా అనేక సందర్భాలు వివరిస్తారు. అదే విధంగా కాళిదాసు విషయంలో అనేక ఉదాహరణలు పొందు పరచారు శర్మ. కాళిదాస కృతి *మేఘదూతం* భారతీయ సాహిత్యంలో ఒక బ్రహ్మాండమైన మలుపుగా అభివర్ణించారు వారు. *మేఘదూతం* మూలంగా భారతీయ సాహిత్యంలో ఒక గొప్ప యుగ కర్తృక సంఘటన జరిగింది అంటారు శేషేంద్ర. ఈ వ్యాసం ద్వారా భారతీయ కావ్యశాస్త్రం మీద *మేఘదూతం* చూపిన ప్రభావాన్ని విశదీకరించ ప్రయత్నించారు శర్మ. ఈ విషయమై మర్మజ్ఞులైన కావ్య వేత్తలు పరిశీలిస్తారని ఆశిద్దాం!

శేషేంద్రశర్మ కాలరేఖ వ్యాస సంపుటిలో పొందు పరచిన వ్యాసములన్నియు వివరింపదగినవే! దేనికది నూతన ఆలోచనలు పాఠకునిలో ప్రేరేపిస్తుంది. సరికొత్త వ్యాఖ్యా విధానాన్ని సృజిస్తుంది. ఉదాహరణకు 'శాకుంతల నాందీ శ్లోకము దేవీస్తోత్రమే' అన్న దాన్ని గురించిన వ్యాఖ్యను పరిశీలిద్దాం. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన *అభిజ్ఞాన శాకుంతల*మునగల నాందీ శ్లోకమును ఇంత వరకు కేవలము ఈశ్వర స్తోత్రముగానే భావించు చున్నారు. దానిలో మంత్ర శాస్త్రార్థ ప్రతీతి గలదన్న సత్యాన్ని శేషేంద్ర వెలికి తెచ్చారు.

**యా సృష్టి స్స్రష్టురాద్యా, వహతి విధిహుతం యా హవిర్యా చహోత్రీ,**
**యే ద్వే కాలం విధత్తః శ్రుతి విషయగణా యా స్థితా వ్యాప్య విశ్వం,**
**యా మాహుః సర్వభూతప్రకృతి రితి, యయా ప్రాణినః పాణవంతః,**
**ప్రత్యాక్షాభిః ప్రపన్నస్తనుభి రవతు వ స్తా భి రష్టాభి రీశః.**

ఈ శ్లోకానికి మామూలుగా చెప్పబడుతున్న అర్థం – అష్ట తనువుల చేత ప్రసన్నుడై ఈశుడు మిమ్ములను రక్షించుగాక. శాకుంతల శ్లోకము ఒక కవియొక్క సాధారణమగు ఒక ఊహపై గాక శాస్త్ర సిద్ధాంతము పై నాధారపడియున్నది. అది తెలిసినచో ఈ శ్లోక మెట్లుద్భవించినదో తెలియగలదు. 1) పంచ భూతా దృష్టతన్వాకమగు సృష్టి, సమాహారమున శక్తియే అనియును, 2) శక్తి శివుని తనువనియును, 3) శివ శక్తులు అభిన్నములు లింగ రహితములనియును, 4) అట్టి శక్తి అభేదము చేత అష్టమూర్తి మత్వాది సర్వ శివ లక్షణములు కలిగి యున్నదనియును నిగమాగములు సిద్ధాంతము చేసినవి.

నిగమాగములకు పరమార్థమైయున్న ఈశాస్త్ర విషయమునే మన శ్లోకము చెప్పుచున్నది. అందును ప్రథమాంశమైన శక్తి యొక్క సర్వకర్తృత్వమును ప్రతిపాదించుటయే దేవీ ఉపాసకుడగు కాళిదాసుని యొక్క ఆశయము. అందుచేత ఈ విషయము జగత్ప్రసిద్ధమగు నాటకముయొక్క నాందీ శ్లోకమునకు వస్తువుగా గైకొనెను. ఈ శ్లోకములో శాస్త్రవేత్తయగు మహాకవి కాళిదాసు మూడు విషయాలను ప్రతిపాదించాడు: 1) పరాశక్తి సర్వకర్త్రి : అందుచేత శ్లోకమంతయు శక్తి పరముగా అన్వయమగును. అప్పుడు ఆది పూర్వక విశేషములన్నియు శాస్త్రోక్త వివిధ శక్తి లక్షణములను ధ్వనింపజేయును. ఈశః శబ్దము ప్రతిబింబ మాత్ర తత్వము చేత శక్తినే ప్రతిపాదించునట్టి శాస్త్రము ఇందు నిక్షిప్తమైనది. 2) పరాశక్తి శివుని తనువు

అని : ఈ పక్షమున యాదిపూర్వవిశేషణములు అష్ట మూర్తులను వ్యష్టిగా ప్రతిపాదించి, ఆది సర్వనామముల చేతను తను శబ్దము చేతను సమిష్టిగా శక్తిని ధ్వనింపజేసి అట్టి శక్తి చేత ప్రసన్నుడైన శివుడు అని అన్వయము నిచ్చును. అనగా అట్టి తనువు లేనిచో శివుడు కార్య సమర్థుడు గాడనియు, 3) శివశక్తులు అభిన్నములనియును, కనుక అష్టమూర్తియగు శివుడు మిమ్ములను రక్షించుగాక అను సామాన్యార్థమునకు అన్వయమగును.

ఇలాంటి శ్లోకమున శబ్దములు యాదృచ్ఛికముగా ఆశు కవిత్వమల్లే దొర్లినవికావు. భావము ఏదో ఒక 'మానుషానంద' దృష్టితో గైకొన్నది కాదు, భావము బ్రహ్మానంద బంధురము, భాషాశ్రౌత లక్షణసంపన్నము. దీనిని మహాకవి కాళిదాసు పరమార్థ స్పృహతో శబ్ద సామాగ్రిని, భావప్రపాదానా పద్ధతిని, భాషా మర్యాదను శాస్త్ర సాంప్రదాయం నుండి గైకొని ఈ విధంగా రూపొందించాడు.

సంస్కృత సాహిత్యంలో అత్యంత ఖ్యాతి నార్జించిన పుస్తకం మయూరిని సూర్యశతకము. ఈ పుస్తకము అనేకమంది విద్వాంసుల దృష్టి నాకర్షించింది. సూర్యశత కానికి వ్యాఖ్యానాలు హెచ్చు సంఖ్యలోనే ఉన్నాయి. ఈ శతకానికి తెలుగు సేతలు దాదాపు ఎనిమిది వరకు ఉన్నాయి. వానిలో మహాకవి దాసు శ్రీరాములు అనువాదం ప్రసిద్ధి గాంచింది.

కవి సార్వభౌమ శ్రీనాథ మహాకవి, జగన్నాథ పండిత రాయల వంటి వారిని యెంతో ఆకర్షించిన గ్రంథం సూర్యశతకము. దీనిలో కొన్ని పద్యాలు పింగళి లక్ష్మీకాంతం వంటి విద్వాంసులు తెలుగు చేశారు. ఈ పుస్తకం శేషేంద్రశర్మ లాంటి విద్వత్కవులను ఆకర్షించుటలో ఆశ్చర్య మేమిలేదు! "వేదాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు అనే గనుల్నుంచి త్రవ్వితీసిన మణులతో చెక్కిన మహత్తర శిల్పం సూర్యశతకం" అంటారు శేషేంద్రశర్మ. సూర్యశతకములోని విశేషాలను కొన్ని ఎత్తిచూపించారు పాఠకులకు. 'సూర్యశతకము – ఒక అధ్యయనము' అనువ్యాసం ద్వారా. ఈ శతకంలో అక్కడక్కడా దర్శనమిచ్చే కాళిదాస మహాకవి ప్రభావాన్ని మనకు ఎత్తి చూపారు శేషేంద్ర.

విప్లవ కవిత్వము – సాహిత్య విమర్శ అనే వ్యాసంలో వ్యక్త పరచిన అభిప్రాయాలలోని సారాంశాన్ని పాఠకులీ విధంగా గ్రహింపవచ్చు. సాహిత్య విమర్శ కేవలం సాహిత్యాన్ని గురించి మాత్రమే కాని సాహిత్య కర్తను గూర్చి కాదు. విమర్శించే కావ్యంలో విమర్శకుడు మూడు విషయాలు పరిశీలించాలి. అవి : భాషా, అలంకారము, వస్తువు. వస్తువు అంటే కవి చెప్పదలచినది. కవి చెప్పే విషయమేదైతే ఉందో, దేన్ని వస్తువంటున్నామో అదే అలంకారంగా మారుతుంది. దీనినే కావ్య మర్మ మంటారు. వస్తువు కావ్యానికి రంగు నిస్తుంది. విప్లవాత్మక వస్తువు తీసుకుంటే విప్లవ కావ్యం రూపొందుతుంది. కవికి కావ్యానికి చెందిన విశేషణాల్ని తగిలించడం శాస్త్రీయం కాదు. విప్లవ కవిత్వం వ్రాయటానికి షరతులు పాలించాల్సిన అవసరం లేదు. కవిత్వమనేది రెండు విధాలుగా ఉత్పన్నమౌతుంది – స్వానుభూతిచేత, సహానుభూతిచేత. ఒక్కోసారి సహానుభూతే, అనుభూతి కంటే తీవ్రంగా సిద్ధిస్తుంది. నిత్య జీవనంలో అన్యాయం మీద చేసే తిరుగుబాట్లే అసలు విప్లవం! అన్యాయాన్ని, అసమానతను ఎదుర్కొనే చైతన్యం వలన పుట్టిన కవితయే నిజమైన విప్లవ కవిత్వం. సాహిత్య విమర్శకుడి పాత్ర స్వప్రయోజనా పేక్ష విసర్జించి విప్లవ కావ్యాన్ని నిర్ద్వంద్వంగా ప్రోత్సహించడం. సాహిత్య విలువలమీదా, సాహిత్య సూత్రాలమీద ఆధార పడి విమర్శ వ్రాయాలంటారు శేషేంద్రశర్మ.

గ్రీకు, భారతీయ నాటకాలలోని సామ్య వైషమ్యాలని తెలిపే వ్యాసం, గజల్ కవిత్వాన్ని గురించిన విశ్లేషణాత్మక వ్యాసాలు శేషేంద్రశర్మ పాండిత్య విస్తృతికి నిదర్శనలుగా పేర్కొనవచ్చును. తెలుగు కవుల గూర్చి వారు వ్యక్త పరచిన విశేషాలు పాఠకులు తెలుసుకొనదగినవి. తెలుగు కవులలో తిరుపతి వేంకటకవులు, గురజాడ అప్పారావు, పానుగంటి లక్ష్మీనరసింహారావు, చిలకమర్తి లక్ష్మీనరసింహారావు, ధర్మవరం రామకృష్ణమాచార్యులు, రాయప్రోలు సుబ్బారావు గార్లను గురించి విశ్లేషణాత్మక వ్యాసాలు వ్రాశారు.

ఈ వ్యాసాల్లో గమనించదగ్గ విశేషమేమిటంటే రాయప్రోలు సుబ్బారావు తప్ప, మిగిలిన కవులు తమతమ నాటకముల ద్వారా, ఉద్యోగ విజయాల ద్వారా తిరుపతి వెంకటకవులు, పాదుకా పట్టాభిషేకం, గయోపాఖ్యానాల ద్వారా పానుగంటి, చిలకమర్తి వారు, అనేక నాటకాల ద్వారా ధర్మవరం రామకృష్ణాచార్యులు, కన్యాశుల్కం ద్వారా గురజాడ అప్పారావు, ఆంధ్రదేశమంతటా మారుమూల గ్రామాలలో సహితం పేరు ప్రఖ్యాతులు గడించారు. తిరుపతి

వేంకటకవులు తమ అష్టావధాన, శతావధానముల ద్వారా రాజాస్థానములలో సహితం అత్యంత ప్రఖ్యాతి గడించారు. వారిని గూర్చి "సాహిత్య రాజసూయంచేసిన దుర్ధర్ష ప్రతిభా దురంధరులు... వారి అపూర్వ కవితా శక్తి ముందు ఎవరూ నిలవలేక పోయారు. వారి *పాండవ ఉద్యోగ విజయాల్లోని* పద్యాలు ఒకటి రెండన్నా కంఠతా రాని తెలుగు వాడు లేడంటే అది అతిశయోక్తి కాదు" అంటారు శర్మ.

రాయప్రోలు సుబ్బారావు కవిత్వంలో ఒక నూతన పద్ధతిని ప్రవేశ పెట్టారు. దానినే ఆ రోజుల్లో భావ కవిత్వంగా పేర్కొన్నారు. శేషేంద్రశర్మ దృష్టిలో రాయప్రోలు వారి కవిత్వంలో కీలకం వక్రోక్తి. వాచ్యార్థం ఏక్కడా కనిపించదు. రాయప్రోలు వక్రోక్తి ఆత్మ కళ. ఒక కృత్రిమ కల్పన కాదు. 'అమృతాం ఆత్మనః కళాం' అన్న భవభూతి మాటకు రాయప్రోలు వారు రక్తమాంసాకృతి. రాయప్రోలు కవిత్వాన్ని గూర్చి ఒక్క మాటలో చెప్పాలంటే – ఆయన పద్యాలే మంత్రాలుగా జపించుకొంటూ వాటి మధ్య మాధురిలో మునిగిపోయి, మళ్ళీ పునర్జన్మ లేనట్లుగా మనిషి తరించి పోవచ్చు" అంటారు శేషేంద్ర.

**ముగింపు :**

శేషేంద్రశర్మ బహుముఖ ప్రజ్ఞాశాలి. ఈ వ్యాసంలో చర్చించిన విషయాలన్నీ ఆ విషయన్ని దృఢ పరుస్తాయి. శర్మ ప్రతిభా విశేషాలు చర్చించేటప్పుడు మనం వారిని గూర్చిన కొన్ని అంశాలను విశేషంగా పేర్కొనక తప్పదు. శేషేంద్రశర్మకి సంస్కృత భాషా సాహిత్యాలలో గల పాండిత్యం అసాధారణం. ముఖ్యంగా వారు మంత్ర, తంత్ర శాస్త్రాలలో ఆర్జించిన జ్ఞానం అనితర సాధ్యమంటే, అది సత్య విదూరము కాదు. సమకాలీన ప్రపంచ సాహిత్య రీతులను గూర్చి శర్మగారి అవగాహన అత్యంత విస్తృతమైనది. తెలుగు భాషా సాహిత్యాల పైనేగాక శర్మ ఆంగ్లభాషా సాహిత్యాదులలో, హిందీ, ఉర్దూ భాషా సాహిత్యాలలో ఆర్జించిన జ్ఞానం శ్లాఘనీయం. శర్మ కవిత్వ తత్వం పేర్కొనదగినది. కవిత్వానికి వస్తు స్వరూపాన్ని బట్టి రూపం, రూపాన్ని అనుసరించి స్వభావం ఉంటుందని వారి నమ్మకం. అదే కవిత్వమని శేషేంద్ర ప్రకటించారు. అయితే శర్మ మనిషి తత్వాన్ని కవిత్వతత్వంగా మలచిన మహాకవి. దేశ పౌరుని ఆత్మ కథే ఆ దేశ చరిత్ర అవుతుందని నిరూపించడానికే వారు *ఆధునిక మహాభారతం* వ్రాశారు. శర్మ శబ్దశక్తి తెలిసిన అలంకారికుడు. అందుకే "నేను శబ్దాల అణువులతో పద్యాలు చేస్తా, ఇసుక రేణువులతో చేసిన గ్లాసుల్లా మధుర ధ్వనులు పలికిస్తా" నంటారు శేషేంద్ర. రచనలో రస నిష్పన్నతిలో ప్రగతిని సాధించారు. శబ్దసౌందర్యముతో పాటు వాగర్థాలకు సమన్వయాన్ని సాధించారు. శబ్దశక్తిని పూర్తిగా గ్రహించిన వారగుటచే శర్మ కవితా ప్రక్రియలన్నిటినీ పద్యాలుగానే పేర్కొన్నారు. శేషేంద్రశర్మలో మనం ఒక విధమైన దార్శనికత్వం పసిగట్టవచ్చు. ఆయనకు Modernity మీద ఒక గొప్ప విజన్ ఉంది. ఆయన రచించిన *ఆధునిక మహాభారతం* ఈ విషయాన్ని రూఢి చేస్తుంది. ఉపదేశాల వలన, ప్రబోధాల వల్ల సాహిత్యానికి ఎలాంటి మేలు జరుగదు అని ఆయన గట్టి నమ్మకం. అందుకే శర్మ నూతన కవితా ప్రక్రియా ప్రయోగానికి పూనుకొన్నారు. వచన కవితా వాహికని ఉపయోగించి కావ్యాన్ని సృజించారు. *ఆధునిక మహాభారత* మనే కావ్యేతిహాసం మనలని మరోశకం ముందుకు నడిపించింది.

వారి రచనలు – *స్వర్ణహంస, సాహిత్య కౌముది, షోడశి, కవిసేన మేనిఫెస్టో, కాలరేఖ* విమర్శా సాహిత్యంలో కొత్త పంథాలను సృజించాయి. శేషేంద్రశర్మ సాహిత్య మీమాంస శక్తిని, పాండిత్య లోతుపాతులను పుట్టపర్తి నారాయణాచార్య, విశ్వనాథ సత్యనారాయణ లాంటి ఉద్ధండులతో పాటు అంవత్స సోమసుందర్ లాంటి ఆధునికులు ప్రశంసించారు. శేషేంద్రశర్మని 21వ శతాబ్దిలోని గొప్ప సాహిత్య వేత్తగా చిత్రించుట సమంజసమని ఈ వ్యాస రచయిత అభిప్రాయము.

ఈ వివరణాత్మక వ్యాసం తయారు చేయుటలో శర్మ రచనలే కాక, అనేకమంది ఇతర రచయితల రచనలు చదువుటయేగాక, ఆయా రచయితల భావ సంపదను స్వేచ్ఛగా ఉపయోగించు కొన్నాను. ఆయా రచయిత లందరికీ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు ఇందుమూలంగా తెలియజేయడమైనది. ఈ వ్యాసం పాఠకుల అభిమానాన్ని చూరగొంటుందని ఆశిస్తాను. ®

ప్రొఫెసర్ రావినూతల సత్యనారాయణ
ఫోన్ : 9618524702

# మన బరంపురం

- *కణుగుల వేంకటరావు*

**బ**రంపురం చెవికింపైన పేరు... ఈ పట్టణం ఇప్పుడు ఒడిశా రాష్ట్రంలో ఉంది కానీ అప్పుడది మద్రాసు రాష్ట్రంలోని గంజాం జిల్లాకు చెందినది. శ్రీకాకుళం, పలాస, ఇచ్ఛాపురం, పర్లాఖిమిడి ఈప్రాంతాలన్నీ అప్పుడు గంజాం జిల్లాలోనివే. బరంపురం అచ్చమైన తెలుగుపట్టణం.

"ఈ బరంపురం షహరుతో ఓఢ్రదేశస్తుల ప్రచారం నిలిచిపోయింది." "బరంపురం బస్తీవూరు ఈ ఊరు ఒక పటాలం దండుకూడ ఉండబట్టి బహుబస్తీ అయివున్నది" ఈ ఊళ్లో వర్తకులు చాలామంది వున్నారు. పట్టుబట్టలు నేసి అమ్ముతారు. ఇండ్లు నిండా విశాలముగా వూరితో సుందరంగా అంతస్తులు, అంతస్తులుగా నేస్తారు." ఇదీ ఏనుగుల వీరాస్వామయ్య తమ *కాశీయాత్రా చరిత్ర*లో బరంపురం గురించి చెప్పినది. కాశీనుండి తిరిగి వస్తూ బరంపురంలో 1831 జూలై 1, 2, 3, తారీఖులలో బసచేశారు.

ఈ ఊళ్ళో అప్పుడు సర్వతోముఖ యజ్ఞం జరిగిందనీ, గోదావరి తీరాన్నుంచి వందమంది బ్రాహ్మణులు ఋత్వికులుగా వచ్చారనీ, వారితో అధర్వణవేదం గురించి చర్చించానని కూడా తమ యాత్రా చరిత్రలో రాసుకున్నారు.

బొబ్బిలి సంస్థానం ఆస్థాన కవులైన మండపాక పార్వతీశ్వర శాస్త్రి వారి జమీందారు గారితో కలిసి చేసిన భారతదేశ యాత్రను గ్రంథస్తం చేశారు. ఆ యాత్రా చరిత్రలో వారు బరంపురాన్ని గొప్పగా వర్ణించారు. వీరాస్వామయ్య యాత్రాచరిత్ర వెలువడిన అర్ధశతాబ్దానికి ఈ యాత్రా చరిత్ర వెలువడింది.

రాంభొట్ల జగన్నాథ శాస్త్రి విశాఖ జిల్లా చోడవరంలో న్యాయవాదులు. వీరు తమ స్వీయ చరిత్రను రాసుకున్నారు. అందులో బరంపురం ప్రశస్తి వుంది. వీరు కూడా తమ చిన్నతనంలో అంటే 19వ శతాబ్దం ఉత్తరార్థంలో కాశీయాత్ర చేసి తిరిగి వస్తూ బరంపురంలో ఆగారు. ప్రసిద్ధ పంతులు నడిమింటి సంగమేశ్వర శాస్త్రి అల్లుడు చెరుకూరి రెడ్డి శాస్త్రి బరంపురంలో న్యాయవాదిగా ఉంటూ నిత్యం అతిథి, అభ్యాగతులను ఆదరించేవారనీ, వారు గొప్ప వదాన్యులనీ వారు బరంపురంలో అందరి మన్ననలనూ పొందారనీ జగన్నాథ శాస్త్రిగారు వారిని ప్రశంసించారు.

హరికథా పితామహులు, ఆదిభట్ల నారాయణదాసు ఆత్మకథ *నా యెఱుక*లో బరంపురం ప్రశస్తి పుష్కలంగా ఉంది. వారు చాలా సార్లు బరంపురం వచ్చారు తన చిన్నతనంలో తన తల్లిదండ్రుల వెంట కాలినడకను తన వూరి నుండి బయలుదేరి పూరీ యాత్ర చేసినపుడు వారు బరంపురంలోని తమ తొలి అనుభవాన్ని ఈ విధంగా వర్ణించారు.

"బరంపురం నందువలె నతిథి సత్కారమింకొకచోట జరుగుట నేను చూడలేదు. అంత సౌకర్యమయిన భోజన మింకొక యెడ దొరకదు. అచటి గృహస్థులందరూ అన్నదాతలే. ప్రతిగృహమునందొకరో, యిద్దరో, ముగ్గురో, నలుగురో యతిథులుండెడివారు. ఆయూర దిగుమర్తివారి యింట విడిసిన నాయన్నదాత మాకు షడ్రసోపేతముగా భోజనము పెట్టినారు."

మరొకసారి బరంపురం వచ్చినపుడు జయంతి కామేశం పంతులు యింట రెండుపూటలునూ షడ్రసోపేతముగా భోజనం చేయుచూ వందలకొలది బ్రాహ్మణులతో కలిసి నెలపదేను దినములు హాయిగా నుండిరి. వారు "దానకర్ణులు, చేతికెముకలేదు. ప్రాఫిషియంట్ వకీలు. వేలకొలది లక్షల కొలది మృష్టాన్నములు పెట్టించుచు, దోసిళ్ళతో రూపాయలు సంభావనలిచ్చుచూ ఒక వైష్ణవ విద్వాంసుడు పెండ్లి చేసుకొనుట కొరకు నలువది వేలుగల గోనెసంచిలో దోసిలిపట్టి రూపాయలు తీస్తూ రెండు, మూడు వేలు ముట్టజెప్పినారని వర్ణించారు. చెన్నపట్నం నుండి బరంపురం వరకు పదిహేను బసయిండ్లు, వందల కొలది భోజనములు, ఎందరో జీతగాండ్రు, సవారీ మోయువాండ్రు, ఇద్దరు

వంటవాళ్ళిద్దరు మంగళ్ళు" ఇలా సాగుతుంది వారు కామేశం పంతులు వదాన్యతను వివరించిన తీరు.

హరికథాగానములో ప్రావీణ్యము సంపాదించిన తరువాత మరొకసారి నారాయణదాసు బరంపురం వచ్చినపుడు కామేశంపంతులు, దాసు హరికథాగానానికి ముగ్ధులై నాలుగు మాసములకుపైగా వారిని వెంటబెట్టుకొని అనేక వూళ్ళలో హరికథలు ఏర్పాటు చేయించి, పర్లాకిమిడిలో వారి చేతికి సింహతలాటాలు బంగారు మురుగులు చేయించి బాగా సత్కరించి పంపించారు. అప్పుడు కామేశం పంతులు ఆర్థికంగా ఇబ్బంది పడుతున్నారు.

కామేశం పంతులు గురించి మరిన్ని విషయాలు ఉప్పల లక్ష్మణరావు తమ స్వీయ చరిత్ర *బతుకు పుస్తకం*లో వివరించారు. ఈ స్వీయ చరిత్ర 1983లో అచ్చయింది. లక్ష్మణరావు సాహిత్యవేత్తగానే కాక అనేక ఇతర విషయాలలో ప్రసిద్ధులు.

"జయంతి కామేశం పంతులు వకీలుగానే కాక చాలా ప్రఖ్యాత పురుషుడు, భోజన ప్రియుడు, సుష్టుగా భోజనముచేసి ఒక గెలకు గెల అరటిపండ్లుతిని బ్రేవుమని త్రేన్చేవారట".

ఒకనాడు ఈయన శ్రీకాకుళంలో పనివుండి వెళ్ళి ఆ పని చూసుకొని సవారీమీద తిరిగి బరంపురం వస్తుంటే దారిలో దాహంవేస్తే ఎక్కడా నీటిచుక్క దొరక్క గొంతుక ఆర్చుకుపోయిందట. అటునుంచి ఎవరో సవారీ మీద వస్తుంటే వారిని మంచినీళ్ళడిగారట. వారు "కంచెంబుడు మంచినీళ్ళు యిస్తే గడగడా త్రాగేసి ఆ కంచెంబుడు నిండా రూపాయలు పోసి ఇస్తే అవతలి వారు విస్తుపోయారట "అయ్యా! నా దగ్గర ఇంతే వుంది, నాకు ప్రాణదానం చేశారు, దయచేసి వుంచుకోండి" అని చెప్పి సవారీమీద చక్కా పోయారట. ఇటువంటి కబుర్లు వీరి గురించి యెన్నో ఈనాటికీ చెప్పుకుంటారని లక్ష్మణరావు వారి *బతుకు పుస్తకం*లో రాశారట.


బెరహంపూర్

బరంపురం ప్రసక్తి వస్తే తప్పక చెప్పుకోవలసిన వ్యక్తి రామలింగం మాష్టారు. వారి గురించి ఉప్పల వారేం చెప్పారో చూడండి:

"మాకు గణితం ఉన్నవ వరహా వెంకటబుచ్చి రామలింగం చెప్పేవారు. ఆయన ఆదర్శపురుషుడు. ఆ సంవత్సరం ఎందుచేతనో ఇంటర్మీడియట్‌లో ఇంగ్లీషు కోర్సు పూర్తికాలేదు. అందుకని వాళ్ళకోసం యంగ్‌మెన్స్ లైబ్రరీహాల్లో "త్రీ జార్జెస్" అనే శీర్షికతో మూడు సాయంకాలాలు ఉపన్యసించారు. విద్యార్థులు కోర్సు పూర్తయిందని సంతోషించారు. ఏ పాఠ్య విషయం మీదనైనా ఉపన్యసించే విషయ పరిజ్ఞానం వారి కుండేది. కాలేజీలో గేమ్సు సూపరింటెండెంట్ అనే ఉద్యోగం లేకపోయినా ఆ పని రామలింగం మాష్టారు తన నెత్తిన వేసుకొని "గేమ్స్ కోచ్"గా పని చేశారు. కాలేజీ అయిపోయిన తరువాత టెన్నిస్ కోర్టు దగ్గర కూచొని, ఆటెలా ఆడుతున్నారో కనిపెట్టి తరువాత ఆటగాళ్ళతో ఆట గురించి చర్చించేవారు. అది అయిన తరువాత బారకాసుకు వెళ్ళి అక్కడ ఫుట్‌బాల్ ఆట పర్యవేక్షించి, తప్పులను విమర్శించేవారు. ఆట అయిన తరువాత బాపురం కుర్రాళ్ళయినా సరే అందరూ ఆయనతో కలిసి మాట్లాడుకుంటూ వారి వెంట వారి యింటికి వరకూ వెళ్ళేవారు. ఆయనకు ప్రతి కుర్రవాడి గురించీ తెలుసును. కుర్రవాళ్ళ తల్లిదండ్రుల యిళ్ళకువెళ్ళి కుర్రవాడు ఎలా చదువుతున్నాడో చెప్పి కష్టసుఖాలు భోగట్టా చేసేవారు. ఊరిలో ఏ మంచి తలపెట్టినా ఆయన సాయం ఉండేది. *వేగుచుక్క గ్రంథమాల* ప్రచురణలో ఆయన పుస్తకాలు రచించి క్రియాశీలంగా సాయపడ్డారు.

తరువాత ఆయన మునిసిపల్ ఛైర్మన్ అయ్యారు. ఎక్కడేనా రోడ్డు మరమత్తు అవుతుంటే కూలీల కంటె ముందుగానే ఆయన అక్కడకు వెళ్ళి తలపైన తడిగావంచాతో అక్కడ వుండి పని సరిగా జరుగుతున్నదీ లేనిదీ స్వయంగా పర్యవేక్షించేవారు. వారు సత్యాగ్రహంలో జైలుకు కూడా వెళ్ళారు. బి.ఎన్.ఆర్. యూనియన్‌కు వైస్ ప్రెసిడెంటుగా, ప్రెసిడెంటుగా వుండేవారు.

ప్రత్యేక ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటు సందర్భంలో లండనులోని జాయింటు పార్లమెంటరీ కమిటీ ముందు తెలుగు ప్రాంతాలను ఆ నూతన రాష్ట్రంలో కలుపకూడదని తమ వాదనలు వినిపించడానికి వెళ్ళిన తెలుగు ప్రతినిధి వర్గంలో రామలింగం కూడా ఉన్నారు.

బరంపురానికి చెందిన ఇంకొక ఆదర్శ పురుషుడు దిగుమర్తి వేంకటరామయ్య. నారాయణదాసు తన చిన్న తనంలో పూరీయాత్రకు వెళ్తూ బరంపురంలో వీరి యింట్లోనే ఆతిథ్యం పొందారు. వీరు ఉప్పల లక్ష్మణరావు మాతామహులు. తన తాత గురించి లక్ష్మణరావు తమ *స్వీయ చరిత్ర*లో చెప్పిన కొన్ని విషయాలు :

వారు చాలా బీదకుటుంబంలో పుట్టారు. తన కుటుంబాన్నీ, అన్నదమ్ముల కుటుంబాన్నీ పోషించవలసి వచ్చెను. భీమునిపట్నంలో చిన్న మేష్టరు ఉద్యోగం సంపాదించి కుటుంబాన్ని పోషిస్తున్నారు. అప్పటికే ఆయన మెట్రిక్యులేషన్ పరీక్ష పాసైయున్నారు. ప్రయివేటుగా ఎఫ్. ఎ. పరీక్షకు కట్టారు. దీపం కోసం అయ్యే ఆముదపు ఖర్చు ఆదాకోసం మునిసిపల్ లాంతరు స్తంభం వెలుగులో చదువుకొని ఆ పరీక్షల్లో మొదటివానిగా ఉత్తీర్ణులయ్యారు. అప్పుడు స్కూళ్ళ ఇన్‌స్పెక్టరు మేగ్డనాల్డు దొర భీమునిపట్నం వచ్చి ఒక బంగారు పతకం బహూకరించి, వారిని టెక్కలిలో స్కూళ్ళ ఇన్‌స్పెక్టరుగా నియమించారు. ఆ విధంగా టెక్కలి వచ్చి ప్రయివేటుగా ఫస్టుగ్రేడు ప్లీడరీ పాసై బరంపురంలో స్థిరపడ్డారు. ఆయన సత్యసంధతకు, నిర్భీతికి మెచ్చి ప్రభుత్వం వారిని గవర్నమెంట్ ప్లీడర్ అండ్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమిస్తే ఆ పదవిలో వారు 30 ఏళ్ళు ఉన్నారు. ఎటువంటి పోలీసు కేసయినా సరే సాక్ష్యాధారాలు లేకపోతే ఈ కేసులో బలం లేదనీ అందుకు కేసును ఉపసంహరించు కొనుటకు అనుమతినివ్వమని జడ్జీగారిని కోరేవారు. కేసును ఉపసంహరించుకుందుకు పోలీసువారు ఎంతమాత్రం ఇష్టం లేక పోయినాసరే వారి మాటలక్ష్యం చేయకుండా కేసును ఉపసంహరించుకునేవారు.

వెంకట రామయ్య ఆస్తికులు, రామభక్తులు. మీకెప్పుడైనా దేవుడు కనబడ్డాడా అని వారి మనుమడు ఒకసారి అడిగితే, "నేనెప్పుడూ దేవుణ్ణి చూడలేదురా, దేవుడంటూ ఉన్నాడో లేదో నేను చెప్పలేను".

"జీవితంలో, ఈ సంసారంలో కష్టాలు, బాధలూ అనుభవించవలసివస్తే మన కష్టాలను మనతోపాటు పంచుకునే వాడొకడున్నాడు కదా, అతని మీద కొంత భారం వెయ్యవచ్చును కదా అని అనుకుంటే మనసుకొంత తేలిక పడుతుంది. కొంత ఉపశమనము, ఊరటా కలుగుతుంది అదే నేను చెప్పగలను" అని అన్నారు.

ఎందుకు తొందరగా ప్రాక్టీసుమానేసారని అడిగితే వారిచ్చిన సమాధానమిది:

"నేను నా చిన్నతనంలో బీదతనం చేత చాలా కష్టాలు అనుభవించాను. తరువాత ఈ ఊళ్ళో ప్రాక్టీసు పెట్టి స్థిరపడ్డాక ఒక నిశ్చయానికొచ్చాను. నేనూ నా పిల్లలూ పేదరికం అనుభవించకూడదు వారు సౌఖ్యంగానే బతకాలి. నేను లక్షరూపాయల ఆస్తి సంపాదించగానే ప్రాక్టీసు మానేసి విశ్రాంతి తీసుకో నిశ్చయించాను. నేను అనుకున్నట్లుగా ఆస్తి సంపాదించగానే ప్రాక్టీసుమానేశాను".

అదీ వారి సత్యసంధత. అన్నివిధాలా ఆయన ఆదర్శప్రాయుడు. ఆయనకే కొంత మనోధైర్యం వుండి వుంటే గొప్ప సంఘ సంస్కర్త అయివుండేవాడని లక్ష్మణరావు తమ *స్వీయచరిత్ర*లో రాశారు.

దిగుమర్తి వేంకట రామయ్య కుమారుడు 'బాబు' మంచి మానవతాశీలుడు. కొందరు యువకుల్ని ఒక బృందంగా చేర్చి ప్రతి ఇంటికీ ఒక బుట్ట యిచ్చి అందులో రోజూ ఒక పిడికెడు బియ్యం వెయ్యమని చెప్పి అలా పోగయిన బియ్యాన్ని వారానికొకసారి జమచేసి వికలాంగులకు అన్నదానం చేసే ఏర్పాటు చేశారు. ఛారిటీ ఫండ్ అసోసియేషన్ అని ఆ సంస్థపేరు. ఊరిలో నున్న దొరలను కలుపుకొని అందరినుంచి నెలనెలా చందాలు వసూలు చేసేవారు. ఇది నాలుగైదు యేళ్ళు సాగింది. యంగ్‌మెన్స్ లైబ్రరీ అండ్ అసోసియేషన్ అను పేరిట 1909లో ఒక గ్రంథాలయం 'బాబు' ఆధ్వర్యంలోనే ఏర్పడింది. 'బాబు' అకాలమరణం పొందగా వారి జ్ఞాపకార్థం వారి తండ్రి గ్రంథాలయానికి ఒక భవనం కట్టించారు. అది యిప్పుడు మున్సిపల్ గ్రంథాలయంగా మారింది.

రాజకీయాల్లోనూ బరంపురం ముందంజలోనే వుంది. గాంధీగారు తలపెట్టిన అన్నికార్యక్రమాల్లోనూ బరంపురం ప్రజలు పెద్ద ఎత్తున పాల్గొనేవారు. ఉప్పుసత్యాగ్రహం చేసి ఆడవాళ్ళుకూడ జైలుకు వెళ్ళారు. 1937లో జరిగిన అసెంబ్లీ

ఎన్నికలలో బొబ్బిలి నియోజకవర్గం నుంచి బొబ్బిలిరాజాతో పోటీచేసి మంచి మెజారిటీతో గెలుపొందినవారు బరంపురానికి చెందిన గిరిగారే. అప్పుడు రైల్వే సమ్మె జరుగున్నందున, రైల్వేయూనియన్‌కు గిరిగారు అధ్యక్షులైనందున మద్రాసులోనే ఉండిపోయి కేవలం మూడు రోజులు ముందు వచ్చి తన నియోజక వర్గంలో ప్రచారం చేశారు. నెహ్రూగారు కూడా ఆ ఎన్నికల్లో గిరిగారి తరపున ప్రచారం చేశారు.

సంఘ సంస్కరణల విషయానికొస్తే 1910లోనే వర్ణాంతర సహపంక్తి భోజనం నిర్వహించింది బరంపురంలోనే. ఆడపిల్లలు 5వ తరగతి దాటి చదువుకుందుకు వీలులేకపోతే వారు 12 సం॥లు వచ్చేవరకు హైస్కూలులో మగపిల్లలతోపాటు చదువుకోవడానికి వీలు కల్పించారు. విదేశాలకు వెళ్ళి వచ్చిన బ్రాహ్మణులను వెలివెయ్యాలని, వారు ప్రాయశ్చిత్తం చేయించుకోవాలని గట్టిగా అడిగేవారు బరంపురంలో ఆనాడే ఎవరూలేరు.

ఇక సాహిత్య విషయానికి వస్తే 1872 నుండి బందరులో వెలువడుతున్న *పురుషార్థ ప్రదాయిని* అను మాసపత్రికలో బరంపురానికి చెందిన వేలూరి అప్పల నరసింహరాజు రచనలు ప్రచురించబడేవి. 1909 సం॥లో *ఆంధ్ర భాషాభివర్ధిని* సమాజం ఏర్పడింది. ఆ కాలంలోనే. *వేగుచుక్క గ్రంథమాల* కూడా ఏర్పడి ఎన్నో మంచి పుస్తకాలు తెలుగులో అచ్చువేసింది. *వాడే వీడు, నేనే, కాలూరాయి* అనే అపరాధ పరిశోధక నవలలను మొట్టమొదటిసారిగా తెలుగులో ప్రచురించింది వేగుచుక్క గ్రంథమాలవారే. వాటి రచయిత ఆ గ్రంథమాల స్థాపకులలో ఒకరైన దేవరాజు వేంకట కృష్ణారావు బరంపురంవాసి.



బ్రహ్మపురంలోని తారాతరిని ఆలయం

1933లో "అభినవాంధ్ర కవిపండిత సభ" "నభూతో నభవిష్యతి'' అన్నరీతిలో బరంపురంలో మూడు రోజులపాటు ఘనంగా జరిగింది. ఆ సభకు అధ్యక్షులు చిలుకూరి నారాయణరావు. ప్రారంభోపన్యాసం చేసినవారు గిడుగు వేంకటరామమూర్తిగారు. దేశం నలుమూలల నుండి ఎందరో కవులు, పండితులు వచ్చి ఆ సభను జయప్రదం చేశారు. అంతకు ముందటేడాదే బరంపురం వచ్చిన పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి ఆ సభా నిర్వహణలో కీలక పాత్ర వహించారు. ఈ విధంగా బరంపురం అన్ని రంగాలలోనూ ముందంజలోనే ఉంది. మనం మన బరంపురం ఈ నానుడి వ్యక్తుల మధ్యగల అభిమానానికి, స్నేహానికి చిహ్నం. ఈ నానుడి ఎలా ప్రచారం పొందింది? కేవలం పదాల మధ్యగల లయవల్లనా? ఇద్దరు బరంపురం వ్యక్తులు ఇతర చోట్ల కలుసుకుంటే ఆ విధంగా పలుకరించుకొనేవాళ్ళా? లేక ఇతరులు బరంపురం వారిని మచ్చిక చేసుకునేందుకు అలా పలుకరించేవారా? ఇవేవీ ఆ నానుడికి అంత ప్రచారాన్ని తేగల కారణాలని నేననుకోను.

దిగుమర్తివారి పూర్వీకులు గుంటూరు జిల్లా నైజాము సరిహద్దుకు సమీపంగా ఉన్న దిగుమర్రు గ్రామానికి చెందినవారు. మల్లెమడుగువారు ఖమ్మం జిల్లాలోని మణుగూరు తాలూకాలోని మల్లెమడుగు గ్రామం నుండి విశాఖ వచ్చి అక్కడ నుండి బరంపురం చేరుకున్నారు. బరంపురం రేవు గోపాలపురం లోని వరహాగిరి రవివారు రాజోలు దగ్గరి పెంటపాడు గ్రామం నుండి వలస వచ్చి స్థిరపడ్డారు. ఉన్నవవారు, పంచాగ్నులవారు కూడా గుంటూరు ప్రాంతం నుండి వచ్చి బరంపురంలో స్థిరపడినవారే. ఇలా ఎన్నో కుటుంబాలు పొట్టచేతపట్టుకొని బరంపురం వస్తే ఆవూరు ఆ కుటుంబాలను అక్కున చేర్చుకుని ఆప్యాయంగా పలుకరించి వాటిని తనవిగా చేసుకున్నది గనుకనే "మనం మన బరంపురం" అనే నానుడి ప్రజల నోట నిలిచిందని నా ఊహ. అలాంటి తెలుగువారి అభిమానపురం ఆంధ్రదేశంలో లేకపోవడమే మన దురదృష్టం. ©

**కణుగుల వేంకటరావు, శ్రీకాకుళం**

## సవర రీడర్లకు
# వంద సంవత్సరాలు

- అజాద్ సవర

మనిషికి మాటలాడడం అలవడ్డాక కథలు చెప్పే నేర్పూ అలవడింది. కథలు వినాలనే ఆసక్తి మానవుడికి స్వభావ సిద్ధం. సాధారణంగా పనిపాట్లు పూర్తయ్యాక ఆరుబయట వెన్నెల్లో పెద్దలూ పిన్నలూ కూర్చొని ముచ్చటలాడుకొనే సమయాల్లోనూ, మంట దగ్గర చలికాచుకొంటున్నప్పుడూ కొద్దిసేపు ఉల్లాసం కోసం కథలు చెప్పుకోవడం తరతరాలుగా సాగుతోంది. ఇవన్నీ నోటి ద్వారా పాకుతుంటాయి. గనుక కథారూపాల్లో ఏది ముందు పుట్టిందో ఏది తరువాత పెరిగిందో చెప్పే వీలుండదు. పెద్దల వద్ద విన్న విషయాలు పిల్లలకు చెప్పడంద్వారా ఇతిహాసాలు భావితరాలవారికి అందించబడతాయి. ఇవి వచన రూపంలో వుండొచ్చు, ఛందోబద్ధంగా వుండొచ్చు. ఛందస్సులో వుంటే రూపంలో మార్పులేకుండా తరువాత తరాలకి చేరుతుంది. వచనంలో ఐతే భాషలోను విషయంలోను మార్పుకు ఎక్కువ అవకాశం వుంటుంది.

ఆదిమ సమాజాలలో ఆహారం సమృద్ధిగా దొరికనప్పుడు అందరూ పంచుకొని తిని, ఆనందంతో గెంతులు వేసి పాటలు పాడుకొనే వారు. ఆవేశం అవధులు దాటితే కవిత్వం పుట్టుకొస్తుంది. లయానుబద్ధంగా సాగే ఈ ప్రవాహం తోటివారికి అనుకరణీయమౌతుంది. ఇవి భావితరాల వారికి అనుశ్రుతంగా చేరతాయి. దీనిని మౌఖిక సాహిత్యం అంటాం. ఈ పాటలను కూర్చిన కవులెవరో తెలియదు. వారి కాలం తెలియదు. ఒక నిర్ణీత కాలానికీ ఒక యుగానికీ చెందిన రచయితలు జానపద సాహిత్యానికి వుండరు. "సవరలలో పాటపాడని వాళ్ళూ, నాట్యము చేయనివాళ్ళూ, మగవాడు కానీ ఆడది కానీ, ఎవరూ వుండరు. విడిగా ఒక్కణ్ణి పాడమంటే పాడకపోయినా, కొంతమంది కలిసి ఆడుతూగాని, పాడుతూగాని ఉన్నప్పుడు, వాళ్ళతోకూడ ప్రతివాడూ ఆడుతాడు, పాడుతాడు. పక్షికి కూత ఏలాగు ఒంటిని పుట్టినదో, ఆలాగునే సవర్లకు ఆడడమూ, పాడడమూ. కవిత్వము అందరికీవచ్చు. అందరూ కల్పించి పాట పాడగలరు. కొందరికన్న మరికొందరికి ఎక్కువ ప్రజ్ఞ ఉంటుంది. కర్రలు కొట్టుకొంటూ ఉన్నప్పుడుగాని, పోడు దున్నుతూ ఉన్నప్పుడుగాని, కొండమీద దంగడా దంగిడీలు (అనగా పెళ్ళికాని పడుచువాడు, పడుచుదీ) ఒకరికొకరు కనబడి, ఒకరికొకరు పలకరించుకొని కులాసాగా మాట్లాడుతూ ఉన్నప్పుడు వలపు పుట్టినట్లాయినా, వాళ్ళమాటలు పాటలుగాను, వాళ్ళ చేష్టలు, నాట్యమూ, అభినయముగానూ మారుతవి అని విన్నాను. ఇటువంటి పాటలు అప్పటికప్పుడు కల్పించినవిగాని, ముందుగా నేర్చుకొని వల్లించినవికావు." అంటూ రామమూర్తి సవర పాటలు ప్రిఫేస్‌లో రాశారు.

వేలకొలది సంవత్సరాలుగా అనుశ్రుతంగా వస్తున్న సవర సాహిత్యాన్ని సంకలనంచేసి గ్రంథస్థం చేసిన మహానుభావుడు గిడుగు రామమూర్తి. రామమూర్తి కంటే ముందు సవరభాషలో లేఖనం లేదు. వాక్ వ్యవహారంలో వున్న సవరభాషకి లిఖితరూపాన్నిచ్చిన మొదటివ్యక్తి గిడుగు రామమూర్తి. పందొమ్మిదవశతాబ్దపు చివరి దశకంలోనే రామమూర్తి సవరభాషలోని మౌఖిక సాహిత్యాన్ని సంకలించి గ్రంథస్థం చేశారు. ఈ గేయ కథాసంకలనాలు సుమారు ఇరవై సంవత్సరాల తరువాత ప్రచురింపబడ్డాయి. రామమూర్తి సవరభాష రాయడానికి తెలుగులిపిని వాడుకొన్నారు. గిడుగు రామమూర్తి సవరభాషలో రచించిన పుస్తకాలను అప్పటి మద్రాస్ ప్రభుత్వం 1912-13 సంవత్సరాలలో ప్రచురించింది. రామమూర్తి సేకరించి ప్రచురించిన వాటిలో నాలుగు కథల పుస్తకాలు (సవర రీడర్ పార్టు1, పార్టు2, పార్టు3, పార్టు4) సవర పాటలు అనే పాటల పుస్తకం వున్నాయి. రామమూర్తి రచించిన సవర-తెలుగు, తెలుగు-సవర నిఘంటువులుగూడ అప్పుడే ప్రచురింపబడ్డాయి.

సవర సాహిత్య చరిత్ర గిడుగు రామమూర్తి తోనే ప్రారంభించాలి. 'ప్రాఙ్నన్నయ' యుగంలాగ 'ప్రాఙ్గిడుగు' యుగం అని సాహిత్య చరిత్రరాయడానికి గిడుగు రామమూర్తి సేకరించిన సవర జానపద కథలు పాటలు ఆధారం. గిడుగు రామమూర్తి సవరభాషకు ఆది కవే కాదు, ఆది సంకలన కర్త గూడ. 32 పాటు వున్న "సవర సాంగ్స్" పుస్తకంలో రామమూర్తిగారు 2 పాటలు సొంతంగా రాశారు. మిగిలినవి సేకరించినవి. వీటిలో 9 పిల్లల పాటలు, 7 పెళ్ళిపాటలు, 6 సరసపు పాటలు, 8 పూజపాటలు (మంత్రాలు) వున్నాయి. రామమూర్తి రాసిన పాటలలో ఒకటి సవర జానపద కథను ఆధారంగా చేసుకొని కూర్చిన 345 పాదాలున్న పెద్ద పాట. రెండవది పర్యావరణ పరిరక్షణకు సంబంధించినపాట. దీనిలో 120 పాదాలున్నాయి. దీనిలోనుండి కొన్ని పాదాలు...

**చెట్లు మాట్లాడుకొంటున్నాయి॥**
**ఏడుస్తూ రోదిస్తూ॥...**
**మనిషి వస్తున్నాడు॥**
**గొడ్డలి తెస్తున్నాడు॥...**
**మనల్ని నరుకుతాడు, మనల్ని చీల్చుతాడు॥...**
**ఓ మనిషీ మంచి మనిషీ॥**
**వద్దు వద్దు చీల్చవద్దు నేస్తం॥**
**ఇంతకాలం ఇన్నేళ్ళూ॥ ...**
**కాయలు ఇచ్చాం పళ్ళు ఇచ్చాం...**
**మా కొమ్మల్లో మా రెమ్మల్లో...**
**జంతువులు పక్షులు పిల్లా పాపల్తో ఉన్నాయి॥...**
**మమ్మల్ని నరకకు, మమ్మల్ని చీల్చకు॥**
**మమ్మల్ని నాశనం చేస్తే ...॥...**
**మీ చుట్టాల పిల్లా పాపలు॥**
**మీ మనమలు, మీ మునిమనమలు॥...**
**తిండిలో, కూడులో॥**
**మమ్మల్ని నంచుకోలేరు, కలుపుకోలేరు...**

*(సవర పాటలు, అనువాదం - అల్లంసెట్టి చంద్రశేఖర రావు)*

సవర రీడర్లకు (పార్ట్2, పార్ట్3) రామమూర్తిగారు ముందు మాటలు రాయలేదు. సవర రీడర్ పార్ట్1 కి రాశారో లేదో తెలీదు. (సవర రీడర్ పార్ట్1, పార్ట్4 ల కోసం ఏళ్ళ తరబడి ప్రయత్నం చేస్తూనే ఉన్నాను) సవర పాటలకు మాత్రం రాసిన ముందు మాటలలో సవరల నుండి వారి పాటలను సేకరించడానికి తాను ఎంత శ్రమపడవలసివచ్చిందో, ఎవరెవరినుండి ఏయే పాటలు తాను సేకరించారో వివరించారు. తెలుగు లిపిని రాయడం చదవడం తెలిసిన సవరలు చదువుకోవడం కోసం రామమూర్తిగారు సవర రీడర్లు, సవర పాటలు రాశారు.

సవరభాషలో తాను రాసిన సవర రీడర్ పుస్తకాలకు రామమూర్తిగారే అనువాదాలు కూడ చేశారు. అవి *ట్రాన్స్‌లేషన్ ఆఫ్ ది సవర రీడర్ పార్టు1, పార్టు2, పార్టు3, పార్టు4* అన్న పేర్లతో 1912-13 లోనే ప్రచురింపబడ్డాయి. సవర పాటలు కూడ అనువదించి ఉండవచ్చు. (నేను చూడలేదు). సవర రీడర్ల తెలుగు అనువాదములలోని వాక్య నిర్మాణము చాల వరకు సవర వాక్యనిర్మాణమును పోలివుంటుంది. సవర రీడర్ల అనువాదముల ప్రయోజనాన్ని ఒకటవ పుస్తకంలోని "మొట్ట-మొదట ఒక చిన్న మనవి"లో రామమూర్తిగారు ఈ విధంగా రాశారు "సవర భాషలో కొద్దిపాటి జ్ఞానం కలిగిన తెలుగువారు తెలుగు అనువాద పుస్తకాలు దగ్గర పెట్టుకొని సవర రీడర్లు చదివి అర్థం చేసుకొనే వీలుంది.

రీడర్ల అనువాదములు ముఖ్యముగా సవర స్కూలు మాస్టర్లు, స్కూలు పిల్లలు, కానిస్టేబుళ్ళు, కచేరీ గుమస్తాలు మొదలయిన వారికోసము గనుక స్పష్టముగా తెలియదానికి వాడుకలో ఉన్న తెలుగునే వ్రాసినాను. 'వాడుకలో ఉన్న తెలుగు' అనగా 'పండితులు గ్రంథములలో సాధారణముగా వాడేది' అని కాదు నా తాత్పర్యము. పండితులవలె నాగరికులుగా ఉన్న తెలుగు వారందరూ... లోక వ్యవహారములో నిత్యమూ నోటను మాటలాడుతూ ఉత్తరములలో వ్రాస్తూ ఉన్న వ్యావహారిక భాష. ఇది మాల మాదిగలు మాట్లాడే గ్రామ్యభాషకాదే. మాటలు వేసి, ఆడంబరముగా వ్రాసి, నా పాండిత్యము ఏమీ లాభము లేదు. నేను ఎవరికోసము ఈ పుస్తకములు వ్రాసినానో వారికి తెలియక, నా శ్రమ అంతా ఎందుకూ పనికిరాకుండా పోతుంది... ఈ అనువాదములు వాడుక భాషలో ఉన్న కారణంచేత తెలుగు పిల్లలుగూడ చదివి అర్థం చేసుకోగలరు... సవర భాషలో ఇదివరకు ఎవరూ పుస్తకములు వ్రాయలేదు... ఈ భాష నా మాతృభాష కాదు. అందుచేత నేను వ్రాసిన వాటిలో తప్పులు ఉంటే ఉండును... రాళ్ళు-రప్పలు తీసి, తుప్పలు-డొంకలు కొట్టి

చాలా శ్రమపడి నాటుతోవ చేసినాను. ఇక రహదారి ఏర్పడవలెను... కిరాతులయిన సవరలను నాగరికులుగా చేయగోరే పుణ్యాత్ములు ఆ పనికి ప్రయత్నింతురు గాక!..."

రామమూర్తిగారు అనువదించిన సవర రీడర్లు ఒక్కొక్క దానికి ప్రత్యేకంగా ముందు మాటలు రాశారు. మొదటి పుస్తకంలోని కథలన్నీ ఇంగ్లీషులో ఉన్న ఈసపు కథలను పట్టి రామమూర్తిగారు సవరభాషలో రాసినవి. ఆ కథలను సవరవాళ్ళకు వినిపించి భాషను సరిచూసుకొన్నారు. ఇందులో నలభైరెండు కథలున్నాయి.

రెండవ పుస్తకాన్ని 'కలక్షన్స్ ఫ్రమ్ సవర ఫోక్‌లోర్' అన్నారు. ఇందులో సవర వాళ్లు రామమూర్తి ఎదుట చెప్పిన ఏడు కథలున్నాయి. ఇంచుమించు వారిమాటలలోనే కథలు రాశారు. "సవరలు పచ్చిబూతులు కథలలో అప్పుడప్పుడు చెప్తుతారు. అటువంటి సంగతులు వదలి-పెట్టినాను" అన్నారు గిడుగువారు. ఇందులోని మొదటి కథ నక్క కథ. ఈ కథలోని చివరిముక్కలు పంచతంత్రములోని జంబూక వృత్తాంతమును పోలివుంటాయి. కాని ఈ నక్క కథ చాల పెద్దది. ఇది తెలివైనది. అరణ్య జీవనంతోపాటు గ్రామీణ జీవనం గూడ దీనికి తెలుసు. కోళ్ళు దొంగిలించడంలో నేర్పరి. పట్టుబడితే చాకచక్యంగా తప్పించుకొనే తెలివితేటలు గలది. ఐనా అతి సంచయేచ్ఛ కారణంగా వింటినారిని కొరికి మృత్యువును కౌగలించుకొంది.

మూడవ పుస్తకంలో పదహారు కథలున్నాయి. ఇందులోని ఏడవ కథ తప్ప మిగిలినవన్నీ సవరలు చెప్పిన కథలే. ఒక ఇంగ్లీషు కథను ఆధారం చేసుకొని రామమూర్తిగారు ఈ ఏడవ కథను సవరభాషలో రాశారు. మూడవ రీడరుకు ఒక ప్రత్యేకత వుంది. కథలలో సవరల ఆచార వ్యవహారాలు, సంస్కృతికి సంబంధించిన విషయాలున్నాయి. కథలతోపాటు చారిత్రకాంశాలుగల కథనాలున్నాయి. దీనిలోని పదమూడవ కథ తాత్రాజు పితూరి. శ్రీకాకుళం (పాత గంజాం) జిల్లా వాసులు విప్లవ వీరుడు తాత్రాజును మరచిపోయినా ఇప్పటికీ గ్రామాలలో పండుగలు చేసుకొనే రోజుల్లో తాత్రాజు వేషం కట్టేవాళ్లున్నారు. తాత్రాజు ఉగ్రరూపం చూసి పిల్లలు జడుసుకొంటారు. అతనిని తాళ్లతో బంధించి నలుగురు సైనికులు ఆ తాళ్ల చివరలు పట్టుకొని అతని వెనక వుండేవారు. చేతిలో కత్తిపట్టుకొని ముందుకు దూసుకు వస్తుంటే అతనిని ఆపడం ఆ నలుగురికీ సాధ్యమయ్యేది కాదు. తాత్రాజు పాలకొండ మన్యానికి చెందినవాడంటారు. ఈ విప్లవ వీరుణ్ణి శ్రీకాకుళంలో ఉరితీశారు. "13వ, 14వ కథలలో సవర ప్రదేశములో జరిగిన పితూరీలు వర్ణించడమైనది. ఇవి వివరముగా గవర్నమెంటు రిపోర్టులలో ఉన్నవి. ఆ రిపోర్టులలో ఉన్న వర్ణనకున్ను సవరలు చెప్పుకొనే దానికిన్ని చాలా భేదము ఉన్నది. ఈ పుస్తకములో వ్రాసినది సవరలు చెప్పుకొనే వృత్తాంతము. ఇదే వాస్తవము అని మాత్రము తలచకూడదు. తాత్రాజు పితూరీ 1854-58 లోనున్ను, పుత్తాసింగ్ పితూరీ 1864 లోనున్ను జరిగినవి. సవరలు పితూరీ చేయడానికి కారణము ఇతరుల దౌర్జన్యమేగాని వాళ్ల దుస్స్వభావము కాదు. ఇతరులు తమకు ద్రోహము చేసినప్పుడు వాళ్లు ఊరుకోలేదు. సవరలు ఎక్కడా బిచ్చమెత్తరు. కష్టపడి పనిచేసి పొట్ట పోషించుకొంటారు. సాధారణముగా అబద్ధమాడరు. అప్పు పుచ్చుకొని ఎగవేయరు. ఈ విషయములన్నీ 2,3,4 వ పుస్తకములలోని కథలలో సూచనగా ఉన్నవి" అంటారు రామమూర్తిగారు.

నాలుగవ వాచకములోని పాఠాలన్నీ సంభాషణ రూపంలో ఉన్నాయి. మొత్తం 30 సంభాషణలున్నాయి. ఇంటిలో భార్యాభర్తలు సరదాగా మాట్లాడుకోవడము, వాళ్ళు దెబ్బలాడుకోవడము, వేటగురించిన మాటలు, పొలము గురించి సంభాషణ, ఆవేశమునకు వచ్చిన పేరంటాలి మాటలు, మేజిస్ట్రేటు సవరల మధ్య సంభాషణ, రోగి వైద్యుడి మధ్య సంభాషణ, చోరీ కేసు, ఖూనీ కేసువంటి కేసులలో మేజిస్ట్రేటు, సవరవాళ్ల మధ్య జరిగిన సంభాషణలు ఈ పుస్తకంలో ఉన్నాయి. "ఈ పాఠాలలో సవరవాళ్ల లోకవ్యవహారము గురించిన భోగట్టా చాల ఉన్నది. ఇంటివద్దను, పొలములోను, కొండమీదను, సంతలోను, మాటామంతీ, ఆడుకోవడము, జగడమాడడము, నెమ్మదిగా పనీపాటూ చేసుకోవడము, కల్లుతాగడము, పూజలు చేయించడము, సోదె చూడడము, చేపలు పట్టడము, వేటాడడము, ఈ విధముగా వాళ్ల బతుకు ఏలాగు ఉంటుందో కనపర్చడమయినది." అంటారు రామమూర్తి నాలుగవ పుస్తకం 'ఇంట్రడక్షన్'లో. రామమూర్తిగారు సవర కథలను సవరలు మాట్లాడుకొనే భాషలోనే రాశారు. తెలుగు అనువాదముగూడ వాడుక భాషలోనే ఉంది. తాను వ్యావహారిక భాషలో రాయవలసిన అవసరం గురించి

రామమూర్తి ఇలా అన్నారు. "లోకవ్యవహారములో ఉన్నట్లే, సవర వాక్యాలు వ్రాయక తప్పదుగదా, వాళ్లభాషకు వాడుకే ప్రమాణము. "శబ్దసిద్ధి లోకంబువలనందెలియును." సవర వాక్యాల అర్థము స్పష్టముగా చెప్పవలెనంటే, తెలుగు వాక్యాలు కూడా లోకవ్యవహారము అనుసరించే వ్రాయడము మంచిది కదూ."

తెలుగు ట్రాన్స్‌లేషన్ ఆఫ్ ది సవర రీడర్ -పార్ట్ నుండి గ్రహించిన క్రింది కథను చదవండి. ఈ అనువాదం సవర వాక్యాలకు సరైన అనువాదం. రామమూర్తి తెలుగు రచనను ఈ కథలో చూడవచ్చు.

**దెబ్బలాడే కోడిపుంజులూ దేగ**

రెండు కోడిపుంజులు పేడకుప్ప కోసము చాలా దెబ్బలాడినవి. చివరకు ఒకటి గెలిచినది, ఒకటి ఓడిపోయినది. ఓడిపోయిన కోడి సిగ్గు చేత ఇంటిలో చొచ్చి, దాగున్నది. (మొదటి కోడి) అయితే సంతోషముచేత వెన్ను ఎక్కి "గెలిచినాను" అని గట్టిగా కూసినది. "కొక్రో కో!"

ఈ కూత విని, ఒక దేగ అక్కడకు వచ్చి, ఆ కోడిపుంజును పట్టుకొని పోయినది (1వ పుస్తకంలోని 5వ కథ) ®

**డాక్టర్ అల్లంసెట్టి చంద్రశేఖర రావు**
ఫోను : 9949605141







# అనేకాంత వాదం

- డా॥ ప్రేమ సుమన్ జైన్

అనువాదం : డాక్టర్ జె. లక్ష్మిరెడ్డి

మహావీరుడు 2500 సంవత్సరాలకు పూర్వం భారత దేశంలో మానవతాజ్యోతి వెలిగించిన మహనీయుడు. జగత్తులోని సమస్త ప్రాణుల హితం కోసం ఆ మహాపురుషుడు అహింస, అపరిగ్రహం, అనేకాంతవాదం. మొదలైన కళ్యాణకారకమైన సిద్ధాంతాలను ప్రతిపాదించాడు. ఈ రోజు ప్రపంచమంతా భగవాన్ మహావీరుణ్ణి ఆయన ప్రతి పాదించిన ఈ లోకోపకారకమైన ఉపదేశాల కారణంగానే స్మరించుకొంటూ ఉంది.

మహావీరుని కాలంలోని చింతనా స్రవంతి పలు పాయలుగా విభాజితమై ఉండేది. వైదిక సంప్రదాయానికి చెందిన చింతనాపరులు, శ్రమణ సంప్రదాయానికి చెందిన ఆరేడుగురు దార్శనికులు ఆ రోజుల్లో ఉండేవారు. ఆ చింతకులంతా సత్యాన్ని పూర్తిగా తెలుసుకున్నామని తమ తమ దృష్టితో వాదించేవారు, ప్రకటించుకొనేవారు. ప్రతి ఒక్కరి వాదనలో, సత్యాన్ని నేనే తెలుసుకున్నాను, ఇతరులెవ్వరు తెలుసుకోలేరు అనే పట్టుదల ఉండేది.

ఇదంతా చూసి, విని, మహావీరుడు సత్యం నాకు మాత్రమే తెలుసునని ఇంతమంది ఎలా ప్రకటించుకోగలరు? సత్య స్వరూపం ఎప్పుడైనా ఒకటిగానే ఉండగలుగుతుందా అని ఆశ్చర్యపోయాడు. అలాంటి పరిస్థితిలో ఆయన తన సాధన ద్వారా, తన అనుభవం ఆధారంగా ఇలా అన్నాడు – "సత్యం వ్యక్తి చూస్తున్నంత దానికే, తెలుసుకున్నంత దానికే పరిమితం కాదు. ఆ విధంగా వారు పొందేది కేవలం వస్తువుకున్న ఒక ధర్మం, లేక ఒక గుణం యొక్క జ్ఞానం మాత్రమే. ప్రతి పదార్థానికి అనంత ధర్మాలు, గుణాలు, ఉంటాయి. కానీ, వాడుకలో కేవలం దాని ఒక స్వరూపమే మన ఎదుటకు వస్తుంది. దాన్నే మనం తెలుసుకో గలుగుతాం. ఆ వస్తువుకున్న మిగతా ధర్మాలు మరుగున పడిపోతాయి. ఈ విధంగా ఏ విషయాన్ని గురించి చెప్పిందైనా మనం చెప్పే మాట సాపేక్ష సత్య రూపంలోనే ఉండగలుగుతుంది. "ఈ వ్యాఖ్యాన పద్ధతినే స్యాత్‌వాదం లేక అనేకాంతవాదం" అని అంటారు. తర్వాత జైనా చార్యులు మహావీరుడు చెప్పిన ఈ మాటనే మరింత విపులీకరించారు.

అనేకాంతవాదం మహావీరుని జీవితంలో మొదటి నుంచే పొడసూపుతూ వచ్చింది. దానికి సంబంధించిన ఒక ప్రసిద్ధ కథ ఉంది.

ఒక రోజు వర్ధమానుని కొందరు బాల స్నేహితులు ఆయన్ను వెదుకుతూ తల్లి త్రిశల వద్దకు వచ్చారు. త్రిశల వారితో వర్ధమానుడు మేడ పైన ఉన్నాడని చెప్పింది. పిల్లలు మేడలోని అన్నిటికంటే పై అంతస్తులోకి వెళ్ళారు. అక్కడ ఆయన తండ్రి సిద్ధార్థుడే ఉన్నాడు. వర్ధమానుడు లేడు. పిల్లలు తండ్రి సిద్ధార్థుణ్ణి అడిగినప్పుడు ఆయన వర్ధమానుడు క్రింద ఉన్నాడని చెప్పాడు. పిల్లలు క్రింది అంతస్తులోకి పరుగు తీశారు. వారికి క్రింది ఒక అంతస్తులో కిటికీ దగ్గర నిలుచొని ఉన్న వర్ధమానుడు కనిపించాడు. పిల్లలు తమ అసంతృప్తి ప్రకటిస్తూ వర్ధమానునితో ఇలా అన్నారు. "ఈ రోజు మీ అమ్మ, నాన్న ఇద్దరు అబద్ధం చెప్పారు. ఒకరు వర్ధమానుడు పైన ఉన్నాడని చెప్పారు, మరొకరు వర్ధమానుడు క్రింద ఉన్నాడని చెప్పారు. నీవేమో మధ్య అంతస్తులో నిల్చొని ఉన్నావు. క్రిందా లేవు, పైనా లేవు."

వర్ధమానుడు తన తోటి పిల్లలతో ఇలా అన్నాడు. "మీరు భ్రమ పడుతున్నారు. అమ్మ, నాన్న ఇద్దరూ సత్యమే చెప్పారు. మీరు అర్థం చేసుకోవడంలోనే పొరపాటు జరిగింది. అమ్మ క్రింది అంతస్తులో నిల్చొని ఉంది. అందువల్ల నేను ఆమె కంటే పైనున్నాను. నాన్న అన్నిటికంటే పై అంతస్తులో ఉన్నారు. అందువల్ల నేను ఆయన కంటే క్రింద ఉన్నాను. వస్తువుల అన్ని స్థితుల గురించి ఇదే విధంగా ఆలోచిస్తే మనం సత్యందాకా చేరగలుగుతాం, భ్రమలో పడిపోము". వర్ధమానుని ఈ వ్యాఖ్యానం విని పిల్లలు ఆశ్చర్య పోయారు. అప్పుడు మహావీరుడు వెలువరించింది అనేకాంతవాదాన్నే.

మహావీరుడు అనేకాంతవాద స్వరూపాన్ని, ప్రాధాన్యాన్ని స్పష్టంగా వివరించాడు. అనేకాంతవాదం మూలంలో ఉన్నది సత్యాన్వేషణ. వ్యక్తి తన పరిమిత జ్ఞానం ద్వారా పరమాత్మణ్ణిగానీ, జగత్తునుగానీ, తెలుసు కోవడాన్నటుంచి, తన పరిమిత జ్ఞానంతో ఒక మామూలు కుండను కూడా సంపూర్ణంగా తెలుసుకోలేడని మహావీరుడు తన అనుభవంద్వారా అర్థం చేసుకున్నాడు. రూప, రస, గంధ, స్పర్శాది గుణాలున్న ఆ కుండకు చిన్న–పెద్ద, నలుపు–తెలుపు, బరువు–తేలిక, ఉత్పత్తి–వినాశం మొదలైన అనంతమైన ధర్మాలున్నాయి. కానీ, ఒక వ్యక్తి దాని స్వరూపాన్ని గురించి చెప్పినప్పుడు ఒక పర్యాయంలో దాని ఒక గుణాన్ని మాత్రమే చెప్పగలుగుతాడు. ఈ మాట

ప్రపంచంలోని అన్ని వస్తువులకు వర్తిస్తుంది. ప్రతి రోజు మనం బంగారు ఆభరణాలు చూస్తూ ఉంటాం. కర్రతో చేసిన బల్లను చూస్తూ ఉంటాం. కొంత కాలం తర్వాత వాటి విరిగిపోయిన లేక బాగు చేసిన రూపాలను కూడా చూస్తూ ఉంటాం. కానీ, బంగారు, కర్రమాత్రం అవే ఉంటాయి. నేటి మెషీన్ల యుగంలో ఏ ధాతువు తయారీ కార్ఖానాలోకి వెళ్ళి నిలబడినా మనం మొదట ఒక ధాతువు ముక్క మెషీన్లో ప్రవేశించడం, చివరకు రాగి, తగరం, మొదలైన వాటి వస్తువుల రూపంలో అది బయటికి రావడం చూస్తాం. వస్తువుకున్న ఈ స్వరూపం కారణంగానే మహావీరుడు ప్రతి వస్తువుకు ఉత్పత్తి, వినాశం, స్థిరత్వం ఈ మూడు దశలు ఉన్నాయని అన్నాడు.

పదార్థాల ఈ స్వరూపాన్ని దృష్టిలో ఉంచుకొని ఆయన జడము, చేతనము మొదలైన ఆరు విధాల పదార్థాలను వ్యాఖ్యానించాడు. మతి, ధృతి, కేవల జ్ఞానం మొదలైన ఐదు విధాల జ్ఞానాల స్వరూపాలను కూడా వివరించాడు. కేవలజ్ఞానం ద్వారానే మనం సత్యాన్ని పూర్తిగా తెలుసుకో గలుగుతాము. కేవల జ్ఞానంకాక సామాన్య జ్ఞానం మాత్రమే పొంది ఉన్నప్పుడు మనం వస్తువును పూర్తిగా తెలుసుకున్నామని చెప్పలేము. తెలుసుకున్నా కూడా దాన్ని అన్ని విధాలా వ్యక్తీకరించలేము. ఈ కారణంగా సాపేక్ష కథనం తప్పనిసరి అవుతుంది. సత్యాన్వేషణలో ఇది ఒక కాలిబాట లాంటిది.

అనేకాంత దర్శనం సత్యం పట్ల మహావీరుని నిబద్ధతను తెలుపుతుంది. అది ఆయన పొందిన సంపూర్ణమైన, యథార్థమైన జ్ఞానం యొక్క అవగాహన కలిగిస్తుంది. అనేకాంతవాదం మహావీరుని అహింసకు ప్రతిబింబం. సత్యాన్ని ఉద్ఘాటించడం సరిగా ఉండాలి. దాన్ని చెప్పడంలో ఎవరితోను విరోధం కలగకూడదు అనేదాన్ని సాధించడమే జీవితంలో ఆయన చేసిన సాధన. ఇది సంభవమయ్యేది – ఏదైనా ఒక వస్తువు స్వరూపాన్ని చెప్పేటప్పుడు మనం దాని ఇతర పార్శ్వాలను కూడా దృష్టిలో పెట్టుకున్నప్పుడు మాత్రమే. మన మాటను మనం ప్రమాణ పూర్వకంగా చెప్పినప్పుడు మాత్రమే 'స్యాత్' అనే పదాన్ని ప్రయోగించడం ద్వారానే ఇది సంభవమవుతుంది. ఇక్కడ 'స్యాత్' అంటే అర్థం – సాపేక్షంగా చూసినప్పుడు ఈ వస్తువు ఇలా ఉంది అని. దీన్ని ఒక ఉదాహరణ ఆధారంగా అర్థం చేసుకోవచ్చు.

రాజేశ్ అనే వ్యక్తి తన తండ్రి వైపు నుంచి చూస్తే పుత్రుడు, అతని కుమారుని వైపు నుంచి చూస్తే తండ్రి. ఇలాగే అతడు భర్త, బావ, మేనమామ, మేనల్లుడు కూడా. ఇలాంటప్పుడు ఎవరైనా అతన్ని కేవలం పుత్రుడుగానే భావించి అతనికున్న ఇతర సంబంధాలు తప్పని భావిస్తే అతడు రాజేశ్ అనే వ్యక్తిని సరిగా అర్థం చేసుకున్నవాడు కాక, మొండిగా వాదించేవాడే అవుతాడు. అజ్ఞాని అవుతాడు. మహావీరుడు ఇలాంటి పెడవాదాన్ని చింతన పరమైన హింసగా భావించే వాడు. అజ్ఞానం ద్వారా అహింస ఫలించదు. అందువల్ల ఆయన స్యాత్ వాద పద్ధతి ద్వారా ముందు చింతనాత్మక ఉదారతను సంపాదించుకోమని అన్నాడు. "కేవలం మన మాట చెప్పడమే చాలదు. ఇతరులకు కూడా తమ దృక్కోణాన్ని ముందుంచే అవకాశం ఇవ్వు. సత్యదర్శనం కలిగేది అప్పుడే. అప్పుడే ఆచరణ సంబంధమైన అహింస సార్థకమవుతుంది" అని ఆయన అన్నాడు.

సత్యాన్ని వేర్వేరు కోణాలనుంచి తెలుసుకోవడం, వివరించడం దర్శనశాస్త్రంలో కొత్త ఏమీకాదు. కానీ మహావీరుడు స్యాత్ వాదాన్ని లేక అనేకాంతవాదాన్ని ఉద్ఘాటించి సత్యాన్ని యథార్థ జీవితానికి అన్వయించగలిగే స్థాయికి దించుకొచ్చే పనిచేశాడు. ఇదే ఆయన విశిష్టత. ప్రతి వస్తువుకు కనీసం రెండు పార్శ్వాలుంటాయని మనకందరికి తెలుసు. ఏ వస్తువు కూడా పూర్తిగా మంచిదిగానూ ఉండదు, పూర్తిగా చెడ్డదిగానూ ఉండదు.

**'దృష్టం కిమపి లోకేస్మిన్ న నిర్దోషం న నిర్గుణమ్'**

(దోషంకానిది గానీ, గుణరహితమైంది గానీ లోకంలో ఏదీ కనిపించడంలేదు)

వేపాకు సామాన్య వ్యక్తికి చేదుగా ఉంటుంది. అదే వేపాకు రోగికి ఔషధం కూడా అవుతుంది. అందువల్ల వేపాకు గురించి ఎవరైనా ఒక అభిప్రాయం ఏర్పరచుకొని దాని మరో గుణాన్ని నిరాకరిస్తే అది అర్థంలేని మాటే.

అతి సాధారణమైన వేపాకుకు సంబంధించిన పరిస్థితే ఇలా ఉంటే ప్రపంచంలోని అనంతమైన పదార్థాలను వాటి అనంతమైన ధర్మాలను తెలుసుకొని వాటిని గురించి ఇదే సత్యం అని చెప్పడం సాధ్యం కాదు. మహావీరుడు దీన్ని లోతుగా అర్థం చేసుకున్నాడు. అందువల్ల ఆయన మానవుని వరకే పరిమితమై ఉండిపోలేదు. సర్వప్రాణుల స్పందనలకు కూడా సాపేక్ష దృష్టితో స్థానం కల్పించాడు. **మానవునిలాగే ప్రతి అల్పప్రాణికి జీవించే హక్కు ఉంది. తనకున్న సాధనాల ద్వారా తనను వ్యక్తీకరించుకునే స్వేచ్ఛ ఉంది అనేది అనేకాంత వాదానికి ఫలశృతి.**

మహావీరుడు అనేకాంతవాదం ద్వారా, మానవుని సర్వతోముఖ వికాసానికి అంతరాయం కలిగించే తప్పుడు ఆలోచనా ధోరణులను తొలగించాలనుకున్నాడు. ఆయన కాలంలో జగత్తు శాశ్వతమనో లేక క్షణికమనో నిర్ద్వంద్వంగా ఈ వాదానికి తిరుగులేదు అనే విధంగా చెప్పడం జరుగుతూ

ఉండేది. దీనివల్ల వాస్తవ జగత్తు స్వరూపం ఖండితమై పోయేది. మానవుని పురుషార్థం నియతివాదం ఎదుట నిస్తేజమై పోయేది. అందువల్ల మహావీరుడు ఆత్మ, పరమాత్మ, జగత్తు ఈ మూడింటి స్వరూపాల యథార్థాన్ని ముందుంచి వ్యక్తి తన దారి తానే ఎన్నుకొనే అవకాశం కలిగించాడు. మహావీరుని ఈ వరం అపూర్వమైంది.

అనేకాంత వాదాన్ని గురించి మహావీరుడు చెప్పిన మాట ఆయన జీవితం ద్వారా కూడా వెల్లడైంది. తన జీవితంలో ఆయన ఎవరికీ అడ్డంకి కాలేదు. ప్రపంచంలో ఉంటూ ఇతరులెవ్వరి హితాలతో విరోధం లేకుండా జీవించడం చాలా తక్కువ మందికే సాధ్యం. మహావీరుని అభిప్రాయం ప్రకారం ఇలాంటి విరోధం అసంపూర్ణ జ్ఞానం నుంచి పుట్టిన అహంకారం వల్ల కలుగుతుంది. ఏమరుపాటు వల్ల, అవివేకం వల్ల కలుగుతుంది. అందువల్ల ఏమరుపాటు లేకుండా వివేక పూరితమైన ఆచరణ చేసినప్పుడే జీవితంలో అనేకాంత స్ఫూర్తి రాగలుగుతుంది. అనేకాంత దృష్టి ద్వారానే సత్య సాక్షాత్కారం సంభవమవుతుంది.

మహావీరుడు ప్రతిపాదించిన అనేకాంతవాదంలో వస్తువు అనంతమైన ధర్మాలు కలిగి ఉంటుంది కాబట్టి అది నిరూపించరానిదిగా ఉంటుందని చెప్పడం జరిగింది. వేదాంత దర్శనంలో సత్యం అనిర్వచనీయమైందని చెప్పబడింది. బౌద్ధ దర్శనంలో అది శూన్య వాదమని చెప్పడం జరిగింది. ఇతర భారతీయ దార్శనికులే కాక ప్రసిద్ధ వైజ్ఞానికుడు ఐన్‌స్టీన్, దార్శనికుడు బెర్ట్రాండ్ రస్సెల్ చెప్పిన సాపేక్షవాద సిద్ధాంతాలు కూడా మహావీరుని అనేకాంత వాదానికి పోలి ఉన్నాయి. వస్తువు ప్రతికణాన్ని తెలుసుకున్న తర్వాతనే దాని స్వరూపాన్ని గురించి ఏమైనా చెప్పు అని మహావీరుడన్నాడు. జ్ఞాన సాధనకు సంబంధించిన ఈ ప్రక్రియ నేటి విజ్ఞానంలో కూడా ఉంది. అంటే అనేకాంత వాద చింతన సంశయవాదం కాదని, దీని ద్వారా అసత్యపూరితమైన నమ్మకాలను తిరస్కరించడం, వస్తువు యొక్క యథార్థ పార్శ్వాలను స్వీకరించడం జరుగుతుందని భావించాలి. చింతనా రంగంలో దీనివల్ల పెంపొందే సహనశీలతగానీ, అన్నింటికీ 'సరే' అంటూ తల ఊపే ప్రవృత్తిగానీ కాక, మిథ్యా అహంకారాన్ని విసర్జించే ప్రక్రియే అని తెలుసుకోవాలి.

దర్శనశాస్త్ర రంగంలో, చింతనారంగంలో అనేకాంత వాదం ఎంత అవసరమో, సామాన్య దైనందిన వ్యవహార జీవితంలో కూడా అంతే అవసరం. నిజానికి ఈ ఆలోచనా ధోరణివల్ల, మంచి చెడులను గుర్తించే ఇంగిత జ్ఞానం జాగృతమవుతుంది. ఏకాంతవాదం కలహానికి, విభేదాలకు దారి తీస్తే, అనేకాంతరవాదం మైత్రిని, భావైక్యతను సాధిస్తుందని మన అనుభవం చెబుతూంది. దీన్ని మరో విధంగా కూడా అర్థం చేసుకోవచ్చు. ఏ విధంగా సరైన మార్గంలో పయనించడానికి కొన్ని అంతర్జాతీయ రవాణా సంకేతాల ఏర్పాటు వల్ల, వాటిని అనుసరించి ప్రయాణం చేసి యాత్రికులు సురక్షితంగా తమ గమ్యం చేరుకుంటారో, అదే విధంగా ఆరోగ్యకరమైన చింతనాపథంలో పయనించడానికి మహావీరుడు అనేకాంతవాదం ద్వారా 'సప్తభంగీ' అనే ఏడు సంకేతాలను రూపొందించాడు. వీటిని అనుసరించినప్పుడు బౌద్ధికమైన ఎలాంటి ప్రమాదం, దుస్సంఘటన జరుగుతుందనే అనుమానం ఉండదు. అందువల్ల అనేకాంతవాదం బౌద్ధిక పీడనను నివారిస్తుందని చెప్పవచ్చు.

మహావీరుని అనేకాంతవాద సారాంశం. మన మన రంగాల్లో మనం ఇతరులకు కూడా చోటు ఉంచాలని, ఇతరులను ఆహ్వానించడానికి మన తలుపులు తెరిచి ఉండాలని.

సాధారణంగా చిన్నప్పటి నుంచి మనం కాగితం పైన మార్జిను వదలిపెట్టి రాస్తూ వస్తున్నాము. దాని ప్రయోజనం మనం రాసిన దాంట్లో అవసరమైనప్పుడు మార్పులు చేర్పులు చేయగలిగే వీలు ఉండాలని, మనం రాసే దాంట్లో అసంపూర్ణత ఉంటే అది తర్వాత పూర్ణత పొందాలని. మహావీరుని అనేకాంతవాదం జీవితంలోని ప్రత్యేకరంగంలో మనం అలాంటి మార్జిను వదలాలనే సందేశం ఇస్తుంది. మనం జ్ఞానం సంపాదించినా, ధనం సంపాదించినా, కీర్తి -ప్రతిష్ఠలు సంపాదించినా, ప్రతి విషయంలో సాపేక్షత అవసరం. విషయాలను తగిన ప్రమాణంలో ఉంచడానికి సంబంధించిన వివేకం కలిగి ఉండడమే. మహావీరుని అనేకాంత వాదాన్ని అర్థం చేసుకోవడమవుతుంది. అదే మన ఆచరణకు కీలకం. అనేకాంతవాదం మన చింతనను దోషరహితంగా ఉంచుతుంది. నిర్మలమైన ఆలోచనవల్ల దోషరహితమైన భాషను ప్రయోగించడం జరుగుతుంది. సాపేక్షమైన భాష మనిషి వర్తనలో అహింసను వెలువరిస్తుంది. అహింసా ప్రవృత్తివల్ల అనవసరమైన సంగ్రహంగానీ, ఇతరుల ఒత్తిడిగానీ, ఉండదు. జీవితం అపరిగ్రాహిగా మారుతుంది. ఈ విధంగా ఆత్మశోధనకు మూలమంత్రం- మహావీరుని అనేకాంతవాదం. జైనాచార్యులు ఇలా అన్నారు: ఏది లేకుండా ఈ లోకంలో ఏ వ్యవహారం కూడా సంభవం కాదో, ప్రపంచంలోని ఆ ఏకైక గురువు అనేకాంతవాదానికి నమస్కారం. ⓜ

హిందీ మూలానికి తెలుగు అనువాదం : డాక్టర్ జె. లక్ష్మిరెడ్డి, ఫోన్ : 9533581630

# అట్టమీద బొమ్మలు

సహజమైన విశిష్ట శైలికి, సౌందర్యసిద్ధాంతానికి ప్రసిద్ధి గాంచిన విలియమ్ అడాల్ఫ్ బొగురు ఫ్రెంచి జాతీయుడు. నవంబరు 30, 1825లో జన్మించి ఆగష్టు 19, 1905న ఇహలోకంలో తన చిత్రకళా ప్రస్తావనను ముగించాడు. చిన్న పిల్లలను, స్త్రీలను అందంగా చిత్రించడంలో అతనంతటివాడు లేరు. గ్రీకు, రోమన్ ఇతిహాసాలలోని గాథలకు అతను తన చిత్రాల ద్వారా అద్భుతమైన అభివ్యక్తిని వక్త పరచారు.


బంగరు వాకిలి

తండ్రి వైన్, ఆలివ్ ఆయిల్‌ను తయారు చేసి అమ్ముకునే వ్యాపారస్థుడు. తండ్రి దారిలోనే కొడుకు ప్రయాణించవలసి ఉంది. అయితే రోమన్ కాథలిక్ ప్రీస్ట్‌గా పనిచేస్తున్న మేనమామ కలగజేసుకోవటంతో చిన్నతనంలోనే బైబిల్ కథలను, పురాణ వీరగాథలను చదివి పులకించిపోయాడు బొగురూ. ఆ పునాదే అతన్ని చిత్రకళకు దగ్గర చేసింది. Ecole - Des - Beaux - Arts (Brodeaux) లో చదువుతున్నపుడు చిత్రకళలో మొదటి బహుమతి చేజిక్కించుకున్నాడు. చిత్రకళలో మరింత రాణింపు పొందటంకోసం పారిస్ వెళ్ళి శవాలను కోసి మానవ శరీర నిర్మాణ రహస్యాలను ఆకళింపుచేసుకున్నాడు. మ్యూజియమ్‌లకు వెళ్ళి ఆనాటి వేషధారణలను, అప్పటి శిరస్త్రాణాలు పరిశీలించాడు.


అడాల్ఫ్ బొగురు

ముఖచిత్రంలోని అమ్మాయి ఒక గొర్రెల కాపరి. బాల్యం చివరికొచ్చింది. వసంతపు చిరుగాలి తాకిడిలో చేరువవుతున్న తొలి యౌవన దశ. అది బంగారు వాకిలి కాక మరేమిటి?

ఆ తరువాత పేరుగాంచిన Francois Edouant pict లో శాస్త్రీయంగా చిత్రకళను నేర్చుకున్నాడు. అత్యంత ప్రతిష్ఠాత్మకమైన అనేక బహుమతులను గెలుచుకున్నాడు. 20వ శతాబ్దపు మొదటి దశకంలో చిత్రకళ పెనుమార్పులకు లోనవుతూ ఉండేది. కానీ బొగురు సంప్రదాయాన్ని, శాస్త్రీయతను ఎప్పుడూ విడనాడలేదు. అతను ఇంప్రషనిజానికి తీవ్ర వ్యతిరేకి.


బొగురు లోగిలి

1877లో భార్యాబిడ్డలు మరణించారు. వయసు మళ్ళినా తిరిగి తన సహ చిత్రకారిణి అయిన ఎలిజెబెత్ జెన్ అనే ఆమెను వివాహం చేసుకున్నాడు. విచిత్రంగా ఆమె అనుకూలవతి కావడమే కాదు బొగురూ ధోరణిలో చిత్రాలు వేసి అతనికి నిజమైన వారసురాలిగా చరిత్రలో నమోదయింది. ఆమె వేసిన చిత్రం (మూడవ అట్ట) ఈ విషయాన్ని స్పష్టంగా మన ముందుంచుతుంది.

ప్రపంచ వ్యాప్తంగా అతని చిత్రాలు ఆదరించబడ్డాయి. అనేక లలితకళాశాలలకు అతను విజిటింగ్ ప్రొఫెసర్‌గా పనిచేసి వేలాదిమంది చిత్రకారులకు మార్గదర్శకుడయ్యాడు. బెల్జియం, నెదర్లాండ్స్, స్పెయిన్, అమెరికా దేశాలలోని దేశప్రముఖులు, కళాభిమానులు అతని చిత్రాలను ఎంత వెలకైనా కొనడానికి వెనుకాడలేదు.


బొగురు భార్య జెన్

బొగురు జీవన చరమాంకంలో చిత్రకళ అనేక నవ్యపోకడలను సంతరించుకుంది. ప్రజలు ఇంప్రషనిజం శైలిలో ఉన్న చిత్రాలపై ఆకర్షితులయ్యారు. అలానే 1910 ప్రాంతంలో వచ్చిన అవ్యక్త ఘనవాద చిత్రాల వెల్లువలో బొగురూ చిత్రాలు కప్పడిపోయాయి. దీనికి తోడుగా ఆనాడు ఉత్తమోత్తమ చిత్రకారునిగా, చిత్రకళా విమర్శకునిగా పేరుగాంచిన ఎడ్గర్‌డిగాస్ బొగురు చిత్రాలపై చేసిన వాఖ్యానాలను 'అతని సౌందర్య దృష్టి అతిగా అనిపిస్తుంది. ఉపరితలం కృతకంగా ఉంటుంది.' (అవి తిట్లా? పొగడ్తలా?) ప్రజలు విమర్శలుగా తీసుకోవడంతో ఆతని చిత్రాలపై నిరాదరణ, నీలినీడలు కమ్ముకున్నాయి. దీనికారణంగా అతను వేసిన 822 చిత్రాలలో కొన్ని కనుమరుగయ్యాయి. వాటిని కనుగొనడానికి ఇప్పుడు ముమ్మరంగా ప్రయత్నాలు సాగుతున్నాయి. కానీ ఆశ్చర్యంగా 1980వ సం॥లో బొగురూ చిత్రాల విశిష్టత తిరిగి గుర్తించబడింది. 80 సం॥లు గడిచిన తరువాత అతని చిత్రకళా సౌందర్యం గుర్తించబడటం, ఆవిష్కరించబడటం చిత్రకళలో ఒక గొప్ప వింత. 2000 సం॥లో క్రిస్టీ ఆర్ట్ గ్యాలరీలో అతను వేసిన ఒక చిత్రం అనూహ్యంగా 35 లక్షల డాలర్లకు అమ్ముడు పోయింది. 2005లో అతని చిత్రాలు తిరిగి ప్రదర్శనకు నోచుకున్నాయి. జనం తండోప తండాలుగా ప్రపంచ వ్యాప్తంగా వచ్చి అతని చిత్రాలను చూసి ఆనందిస్తున్నారు. ✿


అమ్మ చెక్కిలి



'నేనే' దావులూరి

**రెండవ అట్ట :** ఒక్కో రాష్ట్రం నుండి ఒకరుగా ఎన్నుకోబడి, అమెరికాలోని 50 సంయుక్త రాష్ట్రాల నుండి వచ్చిన లేప్రాయపు ముగ్ధ మనోహరిణులంతా కాన్సాస్ పట్టణంలో చేరారు. ఇప్పుడు వీరిలో అత్యంత ప్రతిభావంతమైన సౌందర్యవతిని ఎన్నుకోవలసి ఉంటుంది. ఆ సౌందర్యం భౌతికమే కాదు, భావన పరమయింది కూడా. నీవా? నేనా? అన్నట్టుగా సాగిన ఆ పోటీలో 'నీనా దావులూరి' అనే భారతదేశ సంతతికి చెందిన అమెరికా అమ్మాయి ఎన్నిక కాబడింది.

ఇంతకీ నీనా ఎవరు? - ఎవరేమిటి? మన తెలుగువారి అందమైన ఆడబడుచు. సుమారు అర్ధశతాబ్దం క్రితం విద్యాబోధనలో మౌలిక మార్పుల ఆవశ్యకతను గుర్తించి మాంటిస్సోరి విద్యావిధానాన్ని కృష్ణాజిల్లా విజయవాడలో ప్రారంభించిన మాంటిస్సోరి కోటేశ్వరమ్మ గారి మనుమరాలు. ఈ మధ్యనే కోటేశ్వరమ్మగారు తమ అనుభవాలను, ఈ విద్యావిధానాన్ని అంచెలంచెలుగా ప్రజల వద్దకు తీసుకువెళ్లిన ప్రయత్నంలో తాను ఎదుర్కొన్న సవాళ్లను, సాధించిన విజయాలను *మధురస్మృతుల* పేర పుస్తకంగా ప్రచురించారు. చామనఛాయ గల అమ్మాయి వెలవెలబోయే తెలుపుచర్మంపై ప్రకాశించిన ఈ విజయాన్ని జీర్ణించుకోలేని కొందరు తెల్ల జాత్యాహంకారులు ఆమెను ఆల్‌ఖైదా అంటూ ట్విట్టర్‌లు పెట్టారు. ఒక సిక్కుకు, ముసల్మానుల మధ్యనున్న అంతర భేదాలను గుర్తించడానికి కూడా బద్ధకించే సగటు అమెరికన్ పౌరుడు అంతకంటే ఏమి అర్థంచేసుకుంటాడు? నీనా సౌందర్యం వీటన్నిటికీ అతీతమైంది!

---

మిస్ అమెరికా **నీనా దావులూరి** అమ్మమ్మ **డాక్టర్ వి. కోటేశ్వరమ్మ** గారి మాటల్లో......

**అ**మెరికా అధ్యక్షుడు ఒబామా దావులూరి నీనాతో "నన్ను కలవడానికి వచ్చిన అందాల సుందరులలో మూడు అంగుళాల కన్న ఎత్తైన హీల్స్ ధరించకుండా మామూలు బూట్లలో వచ్చిన మిస్ అమెరికా నీవే" అని అభినందించారు. (You are the only person who came with normal shoes without heels).

నా వారసులు డాక్టర్లు, డాక్టరేట్‌లు పొందాలని నేను అనుకున్నాను. మా మనవరాలు అందాల సుందరిగా ఎంపిక కావడంలో జడ్జిల ప్రశ్నలకు జవాబులు చెప్పిన తీరు, డాన్స్ చేసిన తీరు నీనాను విజేతగా చేశాయి.

నీనా 12వ తరగతి చదువుతున్నపుడు Michigan లో 'Queen of the School' గాను, తర్వాత 'Sweet Sixteen of America' గాను ఎంపికయి 21,000 డాలర్లు పారితోషికం గెలుచుకుంది. విద్యార్థినులలో అన్ని అంశాల్లో ప్రతిభకు అక్కడ పోటీలు నిర్వహిస్తారు. చివరి అవకాశంగా మిస్ అమెరికా పోటీల్లో పాల్గొని విజేత కావడం ఎంతో సంతోషంగా వుంది. మిస్ న్యూయార్క్‌గా గెలిచి మిస్ అమెరికా అయింది.

ఈ ఏడాది మొత్తం నీనా "I wish to contribute to diversity of education of Americans with Cultural competence" అనే అంశం గురించి అమెరికాలో వివిధ రాష్ట్రాలలో పర్యటించి ప్రసంగిస్తుంది. ప్రకృతిసిద్ధమయిన అందానికి మానసిక సౌందర్యానికి ప్రాధాన్యతనిచ్చే నీనాకి చిన్నప్పట్నుంచి నృత్యం అంటే ప్రాణం. అదే నీనా విజేత కావడానికి తోడ్పడింది అనుకుంటున్నాను.

- ఎమ్. కృష్ణకుమారి, (ఆకాశవాణి) తో డా. కోటేశ్వరమ్మ


కోటేశ్వరమ్మ



మెస్రోప్ మెష్తోట్స్ (ఆర్మీనియా)

ఒకప్పటి సోవియట్ సమాఖ్య -

# స్వతంత్ర దేశాల కవిత్వం

- ముకుంద రామారావు

**1991**లో విచ్ఛిన్నమయిన సోవియట్ సమాఖ్య (U.S.S.R) లోని 15 స్వతంత్ర దేశాలు ఇవి - ఉజ్బెకిస్తాన్, కజఖిస్తాన్, కిర్గిజిస్తాన్, తుర్క్మెనిస్తాన్, తజికిస్తాన్, అజెర్బైజాన్, ఆర్మేనియ, బెలారస్, ఎస్టోనియ, జార్జియా, లట్వియ, లిథువేనియ, మోల్దోవ, యుక్రేనియన్, రష్యా. వీటిల్లో రష్యా గురించి ముందు, తర్వాత మొదటి అయిదు దేశాలు ఉజ్బెకిస్తాన్, కజఖిస్తాన్, కిర్గిజిస్తాన్, తుర్క్మెనిస్తాన్, తజికిస్తాన్‌తో బాటు మరో మధ్య ఆసియా దేశం మంగోలియా కవిత్వ చరిత్ర గురించి కూడా తెలుసుకున్నాం. మిగిలిన మరో 9 దేశాలు-అజెర్బైజాన్, ఆర్మీనియా, బెలారస్, ఎస్టోనియ, జార్జియా, లట్వియ, లిథువేనియ, మోల్దోవ, యుక్రేనియన్‌ల కవిత్వ చరిత్ర ఈ వ్యాసంలో తెలుసుకుందాం.

**అజెర్బైజాన్ :** తూర్పున కేస్పియన్ సముద్రం, పశ్చిమాన ఆర్మేనియ, ఉత్తరాన రష్యా, దక్షిణాన ఇరాన్, వాయవ్యాన జోర్జియా సరిహద్దులుగా ఉన్న దేశం. ఇటీవల జరిపిన తవ్వకాలలో దొరికిన ఆధారాలతో 17-18 లక్షల సంవత్సరాల (ప్రాచీనశిలాయుగము) క్రితమే ఆదిమజాతి ఇక్కడ నివసించిన దాఖలాలున్నట్టు బయటపడింది. ప్రాచీన కాలంలో ఈ ప్రాంతాన్ని అగ్నినేలగా పిలిచేవారు. అగ్ని ఆరాధన ఇక్కడ ఇప్పటికీ చేస్తారు. ఇక్కడి యానర్దగ్ ప్రాంతంలో మండుతున్న మట్టి కనిపిస్తుంది. 16వ శతాబ్దంలో, షా ఇస్మాయిల్ ఖటాయ్ (1502-24), చింతకుడు కవి, అజెర్బైజాన్ ప్రసిద్ధ రాజ్యాంగవేత్త సఫావీ సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఆయన కాలంలో అజెర్బైజాన్ గొప్ప శక్తివంతమైన దేశంగా గుర్తింపు పొందింది. ఇరాన్ రష్యా యుద్ధం మూలంగా 1828లో తుర్క్ మంచే ఒప్పందం ప్రకారం అజెర్బైజాన్ దక్షిణ భాగం ఇరాన్, ఉత్తర భాగం రష్యా పంచుకున్నారు. 1918లో ముస్లిం ప్రపంచంలో మొట్టమొదటి ప్రజాస్వామిక గణతంత్ర దేశంగా ప్రకటించుకుంది. కానీ 1918-1920 మధ్య, దాన్ని సోవియట్ సమాఖ్య ఆక్రమించుకుంది. అది 1991 వరకూ కొనసాగి అదే సంవత్సరం తిరిగి స్వాతంత్ర్యం పొందింది. అయినా 1991లో సోవియట్ పతనం తరువాత రష్యా సైన్యం సహాయంతో ఆర్మేనియ దాడిచేసి, 20శాతం అజెర్బైజాన్ భూభాగాన్ని ఆక్రమించుకుంది. ఆ యుద్ధంలో నలభయి వేలకు పైగా మరణించి ఉంటారని, పది లక్షలకు పైగా కాందిశీకులయారని అంచనా. కొండలు, నదులు ఎక్కువగా ఉన్న దేశం. ఎవరో అన్నట్టు పైనుంచి ఆ దేశాన్ని చూస్తే ప్రవహిస్తున్న నదులతో నీలపు సాలెపురుగు పాకుతున్నట్టుంటుందట. చిన్నవి పెద్దవి కలిసి 8400 వరకూ నదులు ఆ దేశంలో ఉండటం విశేషం. సహజంగానే అనేక ప్రకృతి వనరులకు చమురు నిల్వలకు అది ప్రసిద్ధి. 1901 నాటికే రష్యన్ సామ్రాజ్యానికంతటికీ, ప్రపంచ చమురు ఉత్పత్తిలో సగానికి పైగా ఉత్పత్తి చేయగలిగే సామర్థ్యాన్ని పొందింది. నఫ్తలన్ పేరుతో అక్కడ దొరికే నూనెకు అనేక ఔషధ గుణాలుండటంతో కీలు, ఎముకలు, చర్మవ్యాధి సంబంధిత పొలుసురోగము, కీళ్ళనొప్పి, కీళ్ళవాతం మొదలైనవాటికి అద్భుతంగా పనిచేస్తుందని నమ్ముతారు. 8వ శతాబ్దంలో అరబ్బీ ఖలీఫా ఆక్రమణ తరువాత అక్కడ ఇస్లాం ముఖ్యమైన మతమయింది. తూర్పు యూరప్, పశ్చిమ ఆసియా కూడలిలో ఉన్న దేశం కావడంతో, అజెర్బైజాన్ సంస్కృతి మీద ఈ రెండు ఖండాల వివిధ సామాజిక రాజకీయ ఒత్తిడుల ప్రభావం కనిపిస్తుంది.

96 శాతం ప్రజలు మాట్లాడే అజెర్బైజానీ లేదా అజెరి వారి అధికారిక భాష. ఈ భాష అజర్బాయిజన్‌లోనే

కాకుండా పశ్చిమోత్తర ఇరాన్ లోను, తూర్పు టర్కీలోనూ వాడుకలో ఉంది. తుర్కీ భాషా కుటుంబంలోని ఓఘుజ్ శాఖకు చెందినది కావడంతో ఓఘుజ్ మాండలికం ఉన్న అనేక దేశాల్లో ఈ భాష అర్థమవుతుంది.

అజెర్బైజాన్ జానపద సాహిత్యంలో విశిష్టమైన పురా వైభవం వారి కితాబీ దాదా గోర్గుడ్ - దాదా గోర్గుడ్ పుస్తకం. అన్ని దేశాల్లానే అజెర్బైజాన్‌కి అమోఘమైన జానపద సంపద మెండుగా ఉంది. 7-8 శతాబ్దాల మధ్య అక్కడ అరబ్బీలోనే కవిత్వం రాసేవారు. ఆబూ మొహమ్మెద్ ఇబ్న్ బషర్, మూసా సహోవత్, ఇస్మాయిల్ ఇబ్న్ యాసర్ లాంటివారు అరబ్బీలోనే రాసారు. కానీ 11వ శతాబ్దం నుండి గత్రన్ తబ్రిజి (1012-1088) దరీ (ఫారసీ) లో కవిత్వం రాయడం మొదలెట్టారు. 12వ శతాబ్దానికి ప్రపంచ ప్రఖ్యాతి చెందిన నిజామీ గంజవి (1141-1209), లాంటి కవులు ప్రపంచన్నంతా ఆకట్టుకోగలిగారు. నిజామీ గంజవి అజెర్బైజాన్ లోని గంజాలో జన్మించి, అక్కడే మరణించారు. వీరిని గురించి ఫారసీ కవిత్వంలో ఇంతకుముందే తెలుసుకున్నాము. వారి రాజధాని బాకులోని నిజామీ సంగ్రహాలయంలో అజెర్బైజన్ సాహిత్య సంపద భద్రపర్చబడి ఉంది.

అప్పటి పాలకుల ఆదరణతో అబుల్-ఉలా గంజవి (1096-1159), మెహ్సెతి గంజవి (1089-1183), ఫలాకీ షిర్వాని (1126-1160), ముజిరద్దిన్ బైలగన్ (?-1190) లాంటి ఎందరో కవుల కవిత్వం బయటకొచ్చింది. 13వ శతాబ్దం నుండి అరబ్బీ, ఫారసీ బదులు వారిదైన తుర్కీ భాషలో రాయడం మొదలైంది. అప్పటినుండి వారి సాహిత్యానికి మధ్యయుగంగా భావిస్తారు. గీత రచయితలైన ఇజ్జెద్దిన్ హసనొగ్లు, షైఖ్ సఫీద్దిన్ ఆర్దెబిల్లి పొరుగు దేశాల్లో అప్పడొస్తున్న సూఫీ కవిత్వాన్నికాదని అప్పటి జీవన వాస్తవాలపట్ల శ్రద్ధ చూపించారు. అది రాబోయే కవిత్వాలకు మార్గదర్శనం చేసింది. హూమం తబ్రిజి (1201-1314), 13-14 శతాబ్దాల గొప్ప వారధి కవి.

షైఖ్ మహ్మూద్ షబుస్తరి (1287-1320) అప్పటి పేరుపొందిన సూఫీ కవుల్లో ఒకరు. ఫారసీలో రాసిన వారి రహస్య గులాబీ తోట కావ్యం సూఫీ కవిత్వంలో ప్రముఖమైంది. 14-15 శతాబ్దాలలో తుర్కీ ఆదిమవాసుల కూటములు రాజ్యమేలుతున్నప్పుడు అజెర్బైజాన్ నుంచి అందరికీ తెలిసిన సాహిత్యం వెలువడింది. 15వ శతాబ్దంలో ఖురాన్ ఆధారంగా కవిత్వం అక్కడి తుర్కీ భాషలో వచ్చింది. ఫారసీలోనే రాసిన ఇతర ముఖ్య కవుల్లో నస్రెద్దిన్ తుసి (1201-1274), మరగలి ఓవ్హది (1274-1338), ఆరిఫ్ అర్దబిలి (1311 -) మొదలైన వారు. కానీ వారంతా నిజామీ ప్రభావంతో కవిత్వం రాసారు. 14వ శతాబ్దపు రాజు బుర్హనెద్దిన్ గజి (1314-1398) కవిత్వం, మొట్టమొదటి ప్రపంచ తుర్కీ కవిత్వానికి నమూనాలాంటిదని విమర్శకులు భావిస్తారు. సయ్యద్ ఇమదెద్దిన్ నసిమి (1369-1417) మొదటిసారి కవిత్వంలో మానవత్వవాదాన్ని ప్రవేశపెట్టిన ప్రముఖ కవి. 15వ శతాబ్దంలో కవులు హబిబీ, షాహీ, సురురీ, వారి పూర్వ కవులు నిజామీ, ఫుజూలీ కవిత్వ సంప్రదాయాల్ని పోషించడంలో చాలా ఉన్నతమైన పాత్ర పోషించారు. 16వ శతాబ్దంలో అక్కడి కవిత్వం వారిదైన ఆషిక్ కవిత్వంతో అభివృద్ధి చెందింది. పైగా అజరీ భాష అరబ్బీ, ఫారసీలకు కూడా దగ్గర కావడంతో అనేక ప్రాంతాలకు అది విస్తరించింది. 17-18 శతాబ్దాల్లో మొల్ల విదాది వెలి (1707-1808), మరీ ముఖ్యంగా మొల్ల పనా వగిఫ్ (1717-1797) ప్రజల దగ్గరకు కవిత్వాన్ని తీసుకుపోయారు.

19వ శతాబ్దం నుండి సోవియట్ పతనం వరకూ యుద్ధాలు, అనేక ఒత్తిడులు మూలంగా కవిత్వం తగ్గి, వారి బాధల్ని ఆక్రోషాల్ని వచనంలో రాయడం ఎక్కువైంది, అదీ ఒక్కో మారు మారుపేర్లతో. సోవియట్ పతనానంతరం, ఇస్లాం కేంద్రీకరణ ఎక్కువై పొరుగు దేశమైన ఇరాన్ అక్కడి సాహిత్యాన్ని ప్రభావితం చేసింది. ఫలితంగా ఫారసీ, అరబ్బీ సాహిత్యాలకు దగ్గరయింది.

19వ శతాబ్దంలో ఫుజూలీ కవిత్వాన్ని మరింత ముందుకు తీసుకు పోయిన కవుల్లో ప్రముఖులు - సయ్యద్ అబుల్ఖాస్ నబతి (1812-1873), హైరన్ ఖనుం (1786-1838), సయ్యద్ ఆజిం షిర్వానీ (1835-1888), ఖుర్షుద్బాను నతావన్ (1830-1897), ఫత్మా ఖనుం కమినా (1840-1888), అబ్బాస్గులు అగా అక్ ఖనోవ్ (1794-


నిజామీ

1847), మిర్జా షఫి వజెహ్ (1792-1852), ఇస్మాయిల్ బే గుత్కస్లీ (1801-1861) మొదలైనవారు. 20వ శతాబ్దపు కవుల్లో అహ్మద్ జావద్ (1892-1937), మికైల్ ముష్ఫిక్ (1908-1938), సులేమాన్ రుస్తం (1906-1989), ఆలగ వహీద్ (1895-1965), రసూల్ రజ (1910-1981) ముఖ్యమైన భూమిక పోషించారు. అలాగే ఆలీ కరీం (1931-1969), ఖలిల్ ఖుజ (1932-1994), జబిర్ నొవ్రుజ్ (1933-2002), ఫిక్రెత్ సదిక్ (1930), మమ్మద్ ఆరాజ్ ( 1933-2004), ఫమిల్ మెహ్దీ (1934-2002), తోఫిక్ బర్యం (1934-1991), ఇల్యాస్ తాఫ్దిక్ (1934), ఫిక్రెత్ గోజా (1935), మూసా యాగుబ్ (1937), మమ్మెద్ ఇస్మాయిల్ (1939), సమదోఘ్లు (1939) , ఆరిఫ్ అబ్దుల్లజేద్ (1940-2002), ఆలెక్బర్ సలహ్జేద్ (1941), ఇసా ఇస్మాయిల్జేద్ (1941), చింగిజ్ ఆలిఒగ్లు (1944), నుస్రత్ కసమన్లి (1946-2001), రమీజ్ రోషన్ (1946), సబిర్ రుస్తంఖన్లీ (1946), హంలెత్ ఇసఖన్లి ( 1948), వగిఫ్ బయత్లీ ఓనెర్ (1949), జెలింఖాన్ యాకుబ్ (1950) మొదలైన ఎందరో కవులు ఈ దశకంలో ఆధునిక కవిత్వంలో తమదైన పాత్ర పోషించారు. ఈ మొత్తం కవిత్వాన్ని రెండు విభాగాలుగా చూడవచ్చు. 1. ప్రేమ కవిత్వం 2. సాంఘీక రాజకీయ కవిత్వం.

**కితాబీ దాదా గోర్గుడ్ - దాదా గోర్గుడ్ పుస్తకం :** ఇది పూర్తి కథా కావ్యం. భారతీయ మహాభారతం లాంటిది. ఇది ఏ శతాబ్దానికి చెందినదన్న దానిమీద అనేక వివాదాలున్నాయి. ప్రాచీన పౌరాణిక ప్రపంచ దృష్టిలో ఇతిహాసగీతము దాదా గోర్గుడ్ క్రీ.పూ. 11వ శతాబ్దంలో రాయబద్దదని, కానీ వైజ్ఞానికంగా 16వ శతాబ్ది రాతప్రతి దొరికిందని చెబుతారు. అయినా ఇది తుర్కులకు సంబంధించిన గాథలని మాత్రం అంగీకారం ఉంది.



కితాబీ డాదా గోర్గుడ్

**కోరొగ్లు :** కావ్య కథలోని నాయకుడుగా ప్రస్తుతించే కోరొగ్లు, అది రాసిన కవి పేరే అని ఇటీవల నిర్ధారణ చేసారు. సైనికుడుగా ఇరాన్ యుద్ధంలో పాల్గొన్నారని, అప్పటి ఒట్టొమాన్ రాజు ఓస్మాన్ పాషా (1585) మరణం తరువాత ఆసువుగా చెప్పిన కావ్య కథనే, కోరొగ్లుగా ఆ తరువాత ప్రసిద్ధి చెందింది. 11వ శతాబ్దపు ఈ టర్కిష్ వీర గాథ ఆషిక్లుగా పిలవబడే గాయకుల ద్వారా ప్రచారమవుతూ 18వ శతాబ్దానికి రాత రూపంలో వచ్చింది. ఖొరొగ్లులోని అనేక కవితలు రాతప్రతిలో ఇప్పటికీ అజెర్బైజాన్ విజ్ఞాన పరిషత్తులో భద్రపరచబడి ఉన్నాయి.

**మొహమ్మెద్ ఫుజూలీ ( 1483-556) :** అరబ్బీ, ఫారసీ, అజెర్బైజాన్‌లో కూడా కవిత్వం రాసారు. ఇప్పటి ఇరాక్‌లో జన్మించి, మరణించినా మూడు భాషల్లోనూ రాసిన కవిత్వాల మూలంగా వీరిని వారి వారి కవిగానే పరిగణిస్తారు.

**షా ఇస్మాయిల్ ఖతై (1487-1524) :** సఫావిడ్ల సామ్రాజ్య స్థాపకుడు, ఖతై కలం పేరుతో అజెర్బైజాన్‌లో కవిత్వం రాసినవారు. వీరి కవిత్వం మెరుగుపెట్టిన పదాలతో జానపద కవిత్వంలా మనోహరంగా ఉంటుంది.

**అబ్దుల్లా షైగ్ (1881-1959) :** గజల్ల అనువాదంతో మొదలై 1906 నుండి సాంప్రదాయకమైన కవిత్వం రాసారు. అప్పటి యుద్ధ వాతావరణంతో విసిగిపోయి తమ పిల్లలైనా అలా కాకూడదన్న భావంతో వారికోసమే ఎక్కువగా కవిత్వం రాసారు. ఇతర ప్రక్రియలైన నవల, నాటకాల్లో కూడా వారి ధ్యాస అంతా పిల్లల మీదే.

**ముందుకే :**

గతాన్ని మరచిపోబిడ్డా / దాన్నింక ఎప్పుడూ ముట్టుకోవద్దు
గతకాలపు బరువైన పరదాల్ని లేపకు / గతం ఎప్పుడూ
ఒక మహాసర్పమో, పామో , ఒక్కో నిచ్చెన మీద నిద్రోతున్న
వేల నిచ్చెనల బావి. / ఆ బావిని తెరవొద్దు బిడ్డా
ఎప్పుడూ తెరవొద్దు / గతం సంగీతాన్ని వాయించి
ఆత్మల్ని ఇంకా బాధించకు / వారిని ఆ చీకటి సమాధిలోనే కుళ్ళనీ
నీ పసి జీవితాన్ని విషపూరితం కానివ్వొద్దు బిడ్డా
ముందుకు నడు, వెనక్కి తిరిగి చూడొద్దు / దాని అవసరమే లేదు!
భవిష్యత్తే ఎప్పుడూ ఆలోచించు / నీ దృష్టి దానిమీదే కేంద్రీకరించు
నీ నొసలుకింద ఉన్న / ఆ కాంతివంతమైన కళ్ళున్నది
నీ ముందున్నది చూసేందుకే అన్నది మరచిపోకు
అది దారిని గమనించడానికే / ముందుకే చూస్తూ సరైన దారిని ఎన్నుకుని
నడు, నడు, ఆగిపోవద్దు / భయంకరమైన తుఫాన్ల గతానికి దూరంగా
నడు, నడు చురుకుగా దృఢమైన అడుగులతో...
ఆగిపోవద్దు, నడుస్తూనే ఉండు!
నన్ను నమ్ము, స్వర్గం లాంటి ప్రపంచం ముందుంది
సూర్యోదయమవుతుంది / రేపు ఆనందం వెల్లివిరుస్తుంది

**ఫిక్రెత్ గొజ (1935-) :** మాస్కోలో చదువుకున్నారు. అజెర్బైజాన్ రచయితల సమాఖ్యకు వివిధ పదవుల్లో పనిచేసారు. గోబస్తాన్ సాహిత్య పత్రికకు సంపాదకుడుగా ఉన్నారు. ధ్వని ప్రధానమైన కవిత్వాన్ని ఎక్కువగా రాసారు.

**చదరంగం :**

ఈ ప్రపంచపు రాజులందరిలో / ఇద్దరు రాజులు మాత్రమే మిగిలారు
ఒకరు తెలుపు, మరొకరు నలుపు
అతి దుష్టులైన ఆ ఇద్దరూ ఎందుకూ పనికిరానివారే
చదరంగపుబల్ల మీద మిగిలారు
ఇద్దరూ దయనీయ స్థితిలోనే ఉన్నారు
రాజు - వారి పేర్లు / కానీ రాజు దుస్తుల్లో వారు కేవలం బొమ్మలు
మీరేది చేయమంటే వారదే చేస్తారు / ఇద్దరికీ వారి వెనక వారి వారి
మంత్రులు, ఏనుగులు, గుర్రాలు, సైనికులు ఉంటారు
వారి వారి రైతుల్ని, నిర్మాణ నిపుణుల్ని, పాటల రచయితల్ని
ఇద్దరూ మరచిపోయారు / మరణించిన సైనికులకు తెలియనే తెలియదు
ఏ రాజు, వారి మరణానికి దోషులో / వారి బుర్రలకు తట్టనే తట్టదు
ఒక ఆటగాడైన / వారి రాజుల అధికారి రెండు వేళ్ల మధ్యే
వాళ్లంతా ఉన్నారని

**ఆర్మీనియా :** పశ్చిమ ఆసియా, తూర్పు యూరప్ కూడలిలో ఆర్మీనియా ఉంది. ఎక్కువగా కొండ ప్రాంతం. పశ్చిమాన టర్కీ ఉత్తరాన జార్జియా, తూర్పున అజెర్బైజాన్, దక్షిణాన ఇరాన్, అజెర్బైజాన్లు సరిహద్దులుగా ఉన్నాయి. క్రీ.పూ. 6వ శతాబ్దం నుండీ ఆర్మేనియాకు చారిత్రక ఆధారాలున్నట్టు చెబుతారు. ఆక్రమణదారులకు, పోరాడే సామ్రాజ్యాలకు ఆర్మేనియా మొదటినుండీ ఒక యుద్ధభూమి. అనేక నాగరికతల, సంస్కారాల వంతెన. గత 2700 సంవత్సరాలవరకూ, ఫారసీ సామ్రాజ్య అలెగ్జాండర్, రోమన్ సామ్రాజ్యపు బైజంటియం, అరబ్బులు, సెల్జుగ్లు, మంగోలులు, తార్తార్లు, ఒట్టోమాన్ సామ్రాజ్యం, ఫారసీ సఫావిడ్లు, రష్యన్ సామ్రాజ్యం అధీనంలోను ఆర్మీనియామగ్గింది.


నహపెట్ కుచెక్

క్రైస్తవ మతాన్ని హత్తుకున్నందుకు గుర్తుగా 1700 వార్షికోత్సవం 2001లో జరుపుకున్నారు. 1507-1829ల మధ్య, చారిత్రక ఆర్మేనియా ఒట్టొమన్, ఫారసీ రాజ్యాలుగా విభజించబడింది. 1829 తరువాత రష్యా కూడా ఒక భాగాన్ని ఆక్రమించడంతో మూడు రాజ్యాలైంది. 18వ శతాబ్దం నుండీ ఈ మూడు రాజ్యాల మధ్య, ఆర్థిక, సామాజిక, రాజకీయ, సాంస్కృతిక స్వేచ్ఛ సంస్కరణలకోసం, ఆర్మేనియన్ల గొడవ మొదలైంది. 1905లో రష్యన్ విప్లవం, 1908లో యువతురుష్కుల తిరుగుబాటు వారి ఆశలని మరింత సజీవం చేసింది. కానీ మొదటి ప్రపంచ యుద్ధంలో రష్యా ఒట్టొమాన్ రాజ్యాల మధ్య యుద్ధం, దాదాపు పద్దెనిమిది లక్షల ఆర్మేనియన్లను దేశం నుండి వెళ్లగొట్టింది. వారిలో ఎక్కువ భాగం కరువు, రోగాల బారినపడి మరణించారు.

20వ శతాబ్దం 1930 ప్రాంతంలో దాని ఫలితంగానే జాతి విధ్వంసం (Genocide) పదం వాడుకలోకొచ్చింది. 1920 నాటికి ఆర్మీనియా సోవియట్ సమాఖ్యలో భాగమయింది. కానీ రెండవ ప్రపంచ యుద్ధంలో స్టాలిన్ హయాంలో అనేకమంది దేశబహిష్కృతులయ్యారు. టర్కీ, ఇరాన్, జార్జియా, అజెర్బైజాన్‌లతో సరిహద్దు, మతపరమైన యుద్ధాల మూలంగా అనేక ఇబ్బందులు పడాల్సొచ్చింది. వీటన్నిటి మూలాన దేశంలో ఉన్నంత మంది ఆర్మేనియన్లు వివిధ దేశాల్లో, ముఖ్యంగా అమెరికాలోనూ వలస జీవితాల్ని గడుపుతున్నారు. 1991లో సోవియట్ సమాఖ్యనుండి విడిపోయి స్వతంత్ర రాజ్యమైనా ఈ పోరాటాలు తగ్గుముఖం పట్టలేదు. గోర్నో-కర్బా ప్రాంతంలో ఇప్పటికీ ఎప్పుడేమి జరుగుతుందో ఎవరికీ తెలియదు.

**ఆర్మీనియా సాహిత్యం :** ఆర్మీనియా అక్షరం కనుగొనక ముందు నుండీ మౌఖిక సాహిత్యం అక్కడుంది. క్రీ.శ. 5వ శతాబ్దంలో అప్పటి క్రైస్తవ మతగురువుల అత్యుత్సాహం మూలంగా అక్కడి సాహిత్యాన్ని కాదని గ్రీకు, సిరియాక్ భాషల ఆధ్యాత్మిక బైబిల్‌లాంటి గ్రంథాల్ని వ్యాప్తిచేయడంతో అక్కడి మౌఖిక సాహిత్యం ఎక్కడా నమోదుకాకుండా పోయింది. కానీ అవి సామన్య ప్రజలకు ఏవిధంగానూ అర్థం కాకపోవడంతో మెస్రోప్ మెష్తోట్స్ మరి కొందరి సహాయంతో 405 లో ఆర్మేనియన్ అక్షరాన్ని ప్రవేశపెట్టాడు. ఆ లిపినే నేటికీ ప్రపంచమంతటా ఉన్న ఆర్మేనియన్ లందరూ వాడుతున్నారు. ఆ లిపిలో గ్రీకు, సిరియాక్ల గ్రంథాల్ని ఆర్మేనియన్ భాషలో తర్జుమా చేసే పనికి కూడా పూనుకున్నాడు. 5వ శతాబ్దంలో జరిగిన ఈ అద్భుతమైన అనువాదాల మూలంగా ఆ శతాబ్దాన్ని ఆర్మేనియన్ సాహిత్యానికి స్వర్ణయుగంగా భావిస్తారు.

1375 లో తైమూర్ దండయాత్ర తరువాత సాహిత్య వాతావరణంలో చాన్నాళ్లు స్తబ్దత ఏర్పడింది.. 5వ శతాబ్దం తరువాత 10-11 శతాబ్దాల్లో ఆర్మేనియన్ సాహిత్యం స్వేచ్ఛయుత వాతావరణంలో అభివృద్ధి చెందింది. 10వ శతాబ్దంలోని సెయింట్ గ్రెగొరి నరేకట్జిని ఆర్మేనియన్ సాహిత్యంలో మొట్టమొదటి గొప్ప కవిగా కీర్తిస్తారు. వీరెక్కువగా ఆధ్యాత్మిక మార్మిక కవిత్వాన్ని రాసారు. 1100 తరువాత వచ్చిన రాజకీయ మార్పుల మూలాన పశ్చిమ సాహిత్యం కూడా ఎక్కువగానే దిగుమతి అయింది. కానీ 1375లో తైమూర్ దండయాత్ర తరువాత సాహిత్య వాతావరణం చాలావరకు తగ్గిపోయింది.

1666లో ఆర్మేనియాలో మొదటి బైబిల్ ముద్రిత మయింది. 13వ శతాబ్దం నుండి ఊహాత్మక సాహిత్యం మొదలైంది. 16వ శతాబ్దంలో అరుదైన కవిగా పేరుపొందిన నహపెట్ కుచెక్ శారీరక ప్రేమ మీద కావ్యం రాసారు. హొవ్నాతన్ నఖాష్ (1661-1722), సయత్ నోవాగా పేరు పొందిన 18వ శతాబ్దపు ఆరుథిన్ సయాడీన్ కూడా పేర్కొనదగ్గవారు. హొవన్నెస్ థుమనీన్ (7 ఫిబ్రవరి 1869 - 23 మార్చి 1923)ని, ఆర్మీనియా జాతీయకవిగా గుర్తించారు. వీరి ప్రసిద్ధ కావ్యం అనుష్ సంగీతనాటకంగా రూపొందించబడి, ఇప్పటికీ అనేక ప్రదర్శనలకు నోచుకుంటోంది. 19వ శతాబ్దంలో జాతి పునరుజ్జీవ నోద్యమంలోని భాగంగా, రెండు సాహిత్య భాషలు ఊపిరి పోసుకున్నాయి. ఒకటి తూర్పు ఆర్మేనియా భాష, రెండవది పశ్చిమ ఆర్మేనియా భాష. రెంటి మధ్య చెప్పుకోదగ్గ మార్పులేవీ లేకపోయినా, తూర్పు ఆర్మేనియన్ భాషనే ఇప్పటి ఆర్మేనియా వాడుకుంటోంది. తూర్పు ఆర్మేనియన్ కవుల్లో ఎక్కువగా భావగీతాలు రాసిన హోవానీస్ కుమానియన్ ప్రముఖుడు. రష్యాలో ఉండడాన్ని రష్యన్ భాష కూడా వాడుకలో ఉంది.

**సెయింట్ గ్రెగొరి నరేకట్జి (951-1009) :** కవి, సాధువు, మార్మిక తత్వవేత్త, వేదాంతి. 1673లో ప్రచురితమైన వీరి *ప్రలాపాల పుస్తకం* ఆర్మేనియా భాష అభివృద్ధికి దోహద పడింది. అనేక భాషల్లోకి అనువాదమయింది.

**క్రీస్తు బిడ్డ :**

**క్రీస్తు బిడ్డ - పెదాలు జంట ఆకుల్లాంటివి**
**అవి నవ్వినపుడు గులాబులు రాలుతాయి**
**ఏడ్చినపుడు కన్నీటి ముత్యాలు**
**క్రీస్తు బిడ్డ - కళ్లు సముద్రం అంత అగాధం**
**దానిమ్మపండు గింజల్లా అతని సొట్టలు**
**గుత్తులు గుత్తులుగా లిల్లీపూలు అతని దారంతా మొలుస్తాయి**

**నహపెట్ కుచెక్ (-1592) :** వీరి గురించి ఎక్కువగా ఏమీ తెలియదు, వీరి కాయిక శృంగార కవిత్వం మూలంగా వీరు ప్రేమ పిచ్చివాడుగా చూడబడ్డారు. అవి పాటల రూపంలో ఇప్పటికీ ప్రపంచాన్ని అలరిస్తున్నాయి.

**నేనంటాను, నీ మొహం పరమ సుఖమని.**
**ఆమె అంటుంది, దేవుడు నన్నలా తయారుచేసాడని**
**నేనడుగుతాను, నాకొక ముద్దివ్వమని**
**ఆమె అంటుంది, దానికి మూల్యం చెల్లించాలని**
**నేనంటాను, అదెంతో తప్పకుండా చెప్పమని**
**ఆమె అంటుంది, నీ ఆత్మని చెల్లించుకోమని ...**

**హొవ్నాతన్ నఖాష్ (1661-1722) :** కవి, చిత్రకారుడు. మధ్యయుగపు నైతికత బంధాలకు దూరంగా ఉండే కవిత్వం వీరిది.

**ప్రేమపాట :**

**రా, తోటలోకి పోయి గులాబుల మధ్య కూర్చుందాం**
**నీ ప్రౌఢమైన వక్షోజాల్ని నాకు తప్ప ఎవరికీ చూపించొద్దు ప్రియా**
**నీమీద ప్రేమ నన్ను నిజంగా ఉన్మత్తుణ్ని చేసింది**
**నక్షత్రాలంత కాంతివంతం నీ చర్మం**
**గుండ్రని చందమామ నీ మొహం**
**నీ నల్లని జుత్తు నీ మెడ నీ భుజాలమీద మెత్తగా పడుతోంది ...**

**హొవన్నెస్ థుమనీన్ (7 ఫిబ్రవరి 1869 - 23 మార్చి 1923) :** కవి, కథారచయిత, నవలాకారుడు. సామాన్య ప్రజల ఇతి వృత్తాలతో సరళంగా రాసే కవి కావడంతో జాతీయకవిగా గుర్తింపు పొందారు. కేన్సర్ మూలంగా చనిపోయారు.


హొవన్నెస్ థుమనీన్

**ఆర్మేనియా దుఃఖం :**

**తీరాలులేని సముద్రం ఆర్మేనియా దుఃఖం**
**అపారమైన నీటి అగాధం**
**ఈ భారీ నల్లటి ప్రపంచంమీద**
**నా ఆత్మ దుఃఖంతో ఈదుతుంది**
**కోపంతో ఒక్కోమారు యెగిసియెగిసి పడుతూ**
**నిర్మలమైన నీలం తీరంకోసం ఎదురుచూస్తుంది**
**లోతులకందని విశ్రాంతి కోసమని**
**అలసిపోతూ ఒక్కోమారు లోనికి మునిగిపోతుంది**
**కానీ సముద్రం అడుగుకి గాని**
**తీరానికి గాని చేరుకోలేకపోతుంది**

**ఆర్మేనియన్ దుఃఖంలో – నల్లని ప్రపంచంమీద**
**నా ఆత్మ జీవిస్తుంది, దుఃఖిస్తుంది ...**

**బెలారస్ :** తూర్పు యూరప్‌కు చెందినది. బెలారస్‌కి, 5 దేశాల (ఈశాన్యాన రష్యా, దక్షిణాన ఉక్రెయిన్, పశ్చిమాన పోలాండ్, వాయవ్యాన లిథువేనియ, లట్వియ) సరిహద్దులు వున్నాయి. ఈ సరిహద్దులు రెండవ ప్రపంచ యుద్ధకాలపు గందరగోళంలోనే నిర్ణయించబడ్డాయి. బెలారస్‌ని బెలోరష్యా లేదా తెల్లరష్యా అని కూడా పిలిచేవారు. రాతియుగం నుండి బెలారస్ అస్తిత్వం ఉందని చరిత్రకారుల నమ్మకం. తూర్పు నుండి వచ్చిన సాల్విక్ తెగలు ఈ దేశం పూర్వీకులని నిర్ధారించారు. రష్యా, ఉక్రెయిన్, బెలారస్–ఈ మూడు సాల్విక్ గణతంత్ర రాజ్యాల్లో బెలారస్ చిన్నది. 6వ శతాబ్దం మొదటినుండే ఆధునిక బెలారస్ ఏర్పడింది. 1772, 1793, 1795లో జరిగిన పోలాండ్ విభజన సమయంలో బెలారస్ రష్యన్ సామ్రాజ్యంలో చేర్చబడింది. 19వ శతాబ్దంలో బెలారస్ కోసం రష్యా పోలండ్ మధ్య ఆధిపత్యపోరు మొదలైంది. అదే సమయంలో జాతీయ జాగరూకత బెలారస్‌లో మొదలైంది. దానికి ముఖ్యంగా ఇద్దరు కవులు యాకూబ్ కొలాస్, యంక కుపాల ఎక్కువగా తోడ్పడ్డారు. రష్యన్ సామ్రాజ్యం పతనానంతరం 1918 లో బెలారస్ స్వతంత్ర దేశంగా ప్రకటించబడింది. కానీ 1920లో పోలండ్ రష్యా యుద్ధం మూలంగా పశ్చిమ బెలారస్ పోలాండ్, తూర్పు బెలారస్‌ని పోలాండ్, రష్యా ఆక్రమించు కున్నారు. అయితే రెండవ ప్రపంచ యుద్ధంలో పశ్చిమ బెలారస్‌ని పోలాండ్ నుండి రష్యా సాధించు కోగలిగింది. ఈ యుద్ధాల్లో బెలారస్ వాసులు అత్యధిక నష్టాల్ని చవిచూసారు. 1991లో సోవియట్ సమాఖ్య విచ్ఛిన్నం కావడంతో తిరిగి బెలారస్ స్వతంత్ర దేశంగా అవతరించింది. బెలారస్‌కి విలక్షణమైన జాతి, భాష ఉన్నా, వారు మునుపెన్నడూ ఐకమత్యాన్ని, రాజకీయ సర్వాధికారాన్ని రుచి చూడలేదు. ఇప్పుడున్న బెలారస్ అనేకమార్లు విభజించబడి అనేక దేశాల చేతులు మారడం మూలాన, బెలారస్ చరిత్రని దాని ఇరుగుపొరుగు దేశల చరిత్రతో వేరుగా చూడలేము. బెలారష్యన్, రష్యన్ కూడా అక్కడ అధికారిక భాషలు. స్లావిక్ భాషా కుటుంబానికి చెందినది. లిపి సిరిల్లిక్‌దే అయినా, రష్యన్ ఉక్రెయిన్ పదాలు ఎక్కువగా కనిపిస్తాయి. క్రైస్తవం, ఇస్లాం, యూదు మతాలున్నా, సగంకంటే ఎక్కువ జనాభా, నాస్తికులమనే చెప్పుకుంటారు.

బెలారస్ సాహిత్య మూలాలు 11వ శతాబ్దం నుండి కనిపిస్తాయి. 12వ శతాబ్దంలో సెయింట్ సిరిల్ ప్రబోధ శ్లోకాలు రాస్తారు. 17వ శతాబ్దంలో సైమన్ పొలొట్స్కీ (12 డిసెంబర్ 1629–25 ఆగష్టు 1680) కవిత్వంలో బరోక్ ఛందస్సులో కవిత్వ పద్ధతిని ప్రవేశపెట్టారు. ఆధునిక బెలారస్ సాహిత్యం, ప్రముఖ పోలిష్ కవి ఆడం మికివిజ్ కవిత్వ అనువాదంతో మొదలైంది. అందులో ప్రముఖ కవులు మాక్సిం బహ్దనొవిచ్ (9 డిసెంబర్ 1891–25 మే 1917), ఆలెస్ హరున్ (11 మార్చి 1887–28 జూలై 1920), వ్లాడిమిర్ జిల్కా, కజిమిర్ స్వాయక్, యంక కుపాల, యాకూబ్ కొలాస్ మొదలైనవారు. 1920 ప్రాంతంలో వ్లాడిమిర్ దుబొవ్కా, యజెప్ పుష్చ కూడా అద్భుతమైన కవిత్వం రాసారు. 1930 ప్రాంతంలో మాక్సిం టాంక్ కవిత్వం అందరి దృష్టినీ ఆకర్షించింది. 1940–50లలో పిమెన్ పంచంక, ఆర్కది కుల్యషోవ్, 20వ శతాబ్దం చివర్లో యవ్ హ్యానియ యనిష్ చిత్స్, ఆలెస్ రజనోవ్, స్వెట్లన అలెక్స్ విచ్ మొదలైన కవుల్ని ప్రముఖంగా చెప్పుకోవచ్చు. స్లావమిర్ ఆదమోవిచ్ రాసిన *అధ్యక్షుని చంపు* అన్న కవితతో 1996–97 మధ్య నిర్బంధించబడ్డారు.

**యాకూబ్ కొలాస్ (3 నవంబర్ 1882–13 ఆగష్టు1956):** రైతు కుటుంబం నుండి వచ్చిన కవి. అందుకే కొలాస్ అంటే విత్తనపు చెవి అని పేరుపెట్టుకోగలిగారు. ఎక్కడున్నా ప్రజల వాణిని, వారి భాషలోనే వినిపించే నైపుణ్యం మూలాన ప్రజాకవిగాను, జాతీయకవిగాను పేరుపొందారు. ఈ క్రింది కవిత ఉజ్బెకిస్తాన్‌లో ఉంటూ యుద్ధ సమయంలో రాసిన కవితలోని ఒక భాగం.


**యాకూబ్ కొలాస్**

**ఎవరికీలొంగని నా ప్రియమైన దేశమా**
**ఉరుము గర్జించినపుడు నా స్వరం విను**
**నీ చింతల్ని దుఃఖాల్ని నేను పంచుకుంటాను**
**బాల్యం నుండి నా ప్రారబ్దాన్ని నీతో కలుపుకున్నాను** *(నా దేశం నుండి)*

**యంక కుపాల (7 జూలై 1882 – 28 జూన్ 1942) :** జాతీయ కవి, నాటక కర్త, అనువాదకుడు, న్యాయ నిపుణుడు. 1500 వరకూ వీరి రచనలుంటాయని అంచనా. వీరి రచనలు, వాడిన వస్తువులు వగైరాలతో ఒక సంగ్రహాలయం నెలకొలిపారు.

స్వేచ్ఛగా గాలి ఉచితంగానే నిన్ను కీర్తిస్తోంది
ఆకుపచ్చ అడవి వాటిని తమలోకి తీసుకుంటోంది ప్రీతిగా
సూర్యుడు తన దీప్తితో ఎప్పుడో యశస్సును పొందే
విత్తనాల్ని మేల్కొలుపుతున్నాడు
నక్షత్రాలు క్రుంగిపోయిన సేనల్లో నమ్మకాన్ని నింపుతున్నాయి

(యువ బెలారస్ నుండి)

**ఎస్టోనియా :** యూరప్ ఈశాన్యాన ఎస్టోనియా ఉంది. బాల్టిక్ సముద్రంలోకి చొచ్చుకుపోయినట్టుండే ఈ దేశానికి ఉత్తరాన పశ్చిమాన ఈ సముద్రమే హద్దు. తూర్పున రష్యా, దక్షిణాన లట్వియా సరిహద్దు. 1500 ద్వీపాలు, ద్వీపికలు ఉన్న దేశం. ఎస్టోనియా చరిత్ర అంతా విదేశీయుల పాలనలోనే గడిచింది. వైకింగులు మొట్టమొదట ఈ దేశం మీద దండయాత్ర చేసారు. 9వ శతాబ్దం మధ్య భాగం నుండి వారి అధీనంలో ఉంది. 11-12 శతాబ్దాల్లో క్రైస్తవ మతంలోకి అందర్నీ మార్చాలన్న డెన్మార్క్, స్వీడెన్ల ప్రయత్నం విఫలమైంది. 1030-1192 మధ్య రష్యన్లు 13మార్లు దండయాత్రలు చేసినా ఆధిపత్యాన్ని సాధించలేకపోయారు. కొంత భాగం, కొంత కాలం డెన్మార్క్, జర్మనీ ఆధీనంలోను, ఆ తరువాత స్వీడన్ ఆధిపత్యంలోను కొనసాగింది. 1940లో సోవియట్ సమాఖ్యలో చేర్చుకోబడింది. 1991లో ఇతర బాల్టిక్ రాష్ట్రాలతోబాటు సోవియట్ నుండి వేరయి స్వతంత్ర రాజ్యమయింది. ఎస్టోనియా ఆధికారిక భాష. ఉరాలిక్ భాషా కుటుంబానికి చెందినది. 70శాతం ప్రజలు ఎస్టోనియన్ భాష మాట్లాడతారు. తతిమా శాతంలో నాలుగవవంతు రష్యన్ మాట్లాడతారు. నాస్తికవాదం ఎక్కువగా ఉన్న దేశం.

**ఎస్టోనియన్ సాహిత్యం :** వీటి మూలాలకోసం వెదకితే చాలా శతాబ్దాల (14 నుండి 17వ శతాబ్దం వరకు) పుష్కలమైన జానపద సాహిత్యం కనబడుతుంది, లేదా 19వ శతాబ్దం మొదట్లో తోకచుక్కలా బయటకొచ్చిన క్రిస్ట్ జన్ జాక్ పీటర్సన్ (1801-1822) మొట్టమొదటి గంభీరమైన కవి కనిపిస్తాడు. యూహాన్ లీవ్ (1864-1913), జన్ ఓక్స్ (1884-1918), గుస్తావ్ సూట్స్ (1883-1956), విల్లెం రిడాలా (1885-1942), ఎర్నెస్ట్ ఎన్నో (1875-1934), మేరీ అందర్ (1883-1980) మొదలైన కవులు ఆ కవిత్వాన్ని మరింత ముందుకు తీసుకుపోయారు. 1930 ప్రాంతంలో మరో ముగ్గురు కవులు బెట్టీ అల్వర్ (కవయిత్రి), ఉకూ మాసింగ్, బెర్నార్డ్ కాంగ్రో అద్భుతమైన కవిత్వం రాసారు. ఎస్టోనియ కవుల్లో వివిధ దేశాల కవిత్వ ప్రభావాలు ఎక్కువ. ముఖ్యంగా రష్యన్, ఫ్రెంచి, జర్మనీ కవిత్వ ఛాయల్ని చూడొచ్చు. 1960 ప్రాంతానికి పాశ్చాత్య రీతులను ఉపయోగించే యాంక్రాస్, ఎలెన్నిట్, ఏన్ కాలెప్, మాట్స్ ట్రాట్ లాంటి కొత్తకవులు రంగప్రవేశం చేశారు.

**మేరీ అందర్ (1883-1980) :** జర్మన్ పాఠశాలలో చదువుకుంది. గోథేని స్చిల్లర్‌ని బాగా చదివింది. మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు, యువ ఎస్టోనియా ఉద్యమంలో సభ్యురాలిగా, ఫ్రెంచి కవిత్వ పద్ధతులను అనుసరించి ఆధునిక కవిత్వ శైలిని ప్రవేశ పెట్టారు. 1944లో ఎస్టోనియాని సోవియట్ ఆక్రమించక ముందే, కవి భర్త ఆర్తుర్ అడ్సన్‌తో బాటు స్వీడన్లో తలదాచుకున్నారు. అక్కడే ఆమె మరణించారు. నోబెల్ బహుమతికి అర్హుల జాబితాలో అనేకమార్లు ఉన్నారు. ఏట్స్, రిల్కేలతో వీరి కవిత్వాన్ని పోలుస్తారు.


మేరీ అండర్

**ప్రశ్న :**

బలహీనమైన నులివెచ్చని అక్టోబరు సూర్యకాంతిలో
మాగి ప్రకాశిస్తున్న ఆ మృదుఫలాల్ని మేము చూసాము
వచ్చే చలికాలపు మేఘాల సూచనలేవీ లేకుండా
సరైన పూర్తి ఎదుగులతో ఎరుపుని రక్తంలా చూపిస్తున్నాయి

అంతలో గాలిదుమారం ఆ బరువైన గుత్తుల్ని తోసేసాయి
నేలరాలుతూ వాటిల్లో కొన్ని పగిలిపోయాయి
ఎండిన గడ్డిమీద, తొందరలోనే, కొమ్మలకింద
ఉదారంగు మృదుఫలాలతో బంగారాకులు చుట్టూ పరచుకున్నాయి

చేతిలో చేయివేసుకుని ఇద్దరం నడుచుకుంటూ మేము కొండ ఎక్కాం
నిలకడలేని పాడు గాలి తోసేస్తుంటే
ఆతురతలో ఉన్నట్టు కళల్లో కళ్లు పెట్టుకుని మేము అడిగాం
మా ప్రేమ తేమలో, ఆనందపు ఎరుపు ఇప్పట్లో పుష్పిస్తోంది
జీవితం గాలి దాన్ని ధ్వంసముచేసే తీసుకుపోతుందా
లేక సమాధి మట్టిమీద పడి అంతరిస్తుందా?

**బెట్టీ అల్వర్ (1906-1989) :** కవయిత్రి, కథకురాలు, అనువాదకు రాలు కూడా. పుష్కిన్ కవిత్వాన్ని అద్భుతంగా అనువాదం చేసిన పేరుంది. జానపద కవిత్వ శైలిలో రాసినా, వీరి కవిత్వంలో జీవితంపట్ల ఆనందం భావపూర్ణత మెండుగా కనిపిస్తుంది.


బెట్టీ అల్వర్

**ఒక దర్జీ అను చింత :**

రోడ్డుమీద నిన్న తుంపర వర్షంలో
తెరుచుకున్న కత్తెరతో దుఃఖం వచ్చింది

వాడు ఇష్టంలేని చొక్కాల్ని
పిల్లల మెడల చుట్టూ కప్పాడు
ఇతరుల జీవితాలమీద
నల్లటి గుర్తులు వేశాడు

ఎర్ర మొహాలచుట్టూ
దర్జీ అను దుఃఖం జుత్తులో
తెల్లని నారపోర దారంతో కలిసి
పాడుబడ్డ పట్టుబట్ట వేలాడనీ

**బెర్నార్డ్ కాంగ్రో (1910-1994) :** అద్భుతమైన కవి, నవలాకారుడు. మాతృదేశం విడిచి స్వీడన్లో తలదాచుకున్నా, మాతృదేశం పట్ల మమకారం పోనివాడు. సోవియట్ ఆక్రమణ సమయంలో ఎస్టోనియాలో వీరి పేరుని సైతం మరచిపోయేట్టు చేయగలిగారు. వీరి కవితలేని, ఎస్టోనియా కవిత్వ సంకలనాలు లేవు. వీరి పేరుమీద ఎస్టోనియా ప్రభుత్వం సాహిత్య బహుమతిని నెలకొల్పింది.


బెర్నార్డ్ కాంగ్రో

**నా మొహం :**

పొడిపొడిగా రాలే రాయిలా
ఇక్కడ అనేక లక్షల రోజులు రాల్చుకున్నాను
కానీ నేనేదో నరంలా రాయిలా
అంతులేని జాగరూకతలోనే నేనింకా ఉన్నాను

మైదానము, పశుగ్రాసం, గ్రామం
గాలికి ఊగుతున్న తోటలోని పాతచెట్టు -
ఇవన్నీ నేను - పొయ్యిమీది సన్నని మంటలా
నా ఆలోచనలు మండుతూనే ఉన్నాయి
నా గుండె వడగండ్ల వానకు తెరిచి ఉంది
నా చెంపలు వాన ప్రహారానికి -
అల్లకల్లోలమైన నీటితో నదులు పూర్తిగా
నా ఊపిరితిత్తుల్ని నొప్పితో ముంచాయి

నా అడవిని మెరుపు ధ్వంసం చేసింది
కరువు నా పుట్టిన ఊరిని కుంటిని చేసింది
వందల వేల రథాల యుద్ధం
నా మొహాన్ని దున్నేసాయి

ఇంత జరిగినా నేను బతికి నిలుచున్నాను
నా శ్వాస దయగల ఉత్తరపు మలయమారుతం
నా ఆలోచనలు ఉత్తరపు పూలు
ఎండిన ముండ్లపొదనుండైనా నవ్వుతాయి

**జార్జియా :** యూరప్ ఆసియాని కలిపే కీలకమైన ప్రాంతంలో జార్జియా ఉంది. ఉత్తరం ఈశాన్యాన రష్యా, తూర్పు ఆగ్నేయాన అజెర్బైజాన్, దక్షిణాన ఆర్మీనియా టర్కీ పశ్చిమాన నల్లసముద్రం హద్దులు. శతాబ్దాలుగా ఈ ప్రాంతం పెర్సియా, టర్కీ, రష్యాల మధ్య స్పర్ధలకు కారణమయింది. చివరకు 19వ శతాబ్దంలో రష్యా హస్తగతం చేసుకుంది. 1991లో సోవియట్ సమాఖ్య పతనం తరువాత స్వతంత్ర రాజ్యమైనా, ఈమారు రష్యా అమెరికాల మధ్య స్పర్ధగా మిగిలింది. ఈ ప్రాంతంగుండా పోతున్న చమురు మీద అమెరికాకు శ్రద్ధ, ఈ ప్రాంతం అమెరికామీద ఆధారపడటం రష్యాకు ఇష్టం లేక. 71శాతం ప్రజలు జార్జియన్ భాషనే వాడతారు. తరువాత ఎక్కువగా మాట్లాడే భాషల్లో అజెర్బైజాన్, ఆర్మేనియా, రష్యా మొదలైనవి. క్రైస్తవం ఎక్కువగా అనుసరించే మతం.


నికోలస్ బరతష్విలి

4వ శతాబ్దం నుండి జార్జియా సాహిత్య మూలాలు ఉన్నాయి. అప్పటినుండే అక్కడ క్రైస్తవం కూడా మొదలైంది. ఆ కారణంగా అక్కడ కవిత్వంలో క్రైస్తవ సంబంధితంగా తయారైంది. 12వ శతాబ్దపు షోటారుస్తవేలి రాసిన *పులితోలు కప్పుకున్న మానవుడు* అన్న కావ్యం ప్రముఖమైనది. 19వ శతాబ్దపు నికోలస్ బరతష్విలి (1817-1845), ఈలియా చవచవడ్జె (1837-1907), ఆకకి ట్సెరెతెలి (1840-1915), 20వ శతాబ్దపు వఝు ష్షవెల (1861-1915), టిత్సిన్ టబిడ్జె (1893 -1937), పఒలొ ఈష్విలి (1894-1937), గలక్షన్ టబిడ్జె (1891-1959), అన్నా కలందజె (1924-2008), 21వ శతాబ్దపు యువ కవులు దతొ బర్బకడ్జె, గిఒర్గి లొబ్జనిడ్జె మొదలైన కవులు జార్జియాలో ప్రసిద్ధులు.

**ఈలియా చవచవడ్జె (1837-1907):** కవి, రచయిత, ప్రచురణకర్త, న్యాయవాది, మనవతావాది, తత్వవేత్త, పాత్రికేయుడు. ఆధునిక జార్జియా సాహిత్యానికి మూలపురుషుడిగా భావిస్తారు. చారిత్రక వస్తువుని తీసుకుని జాతీయ భావాన్ని రగిల్చిన వారిలో ప్రముఖులు.

**శోకగీతి**

చలించే పూర్తి వెలుగుతో చంద్రుడు
నా మాతృదేశం మీద మెరుస్తున్నాడు

దూరంగా తెల్లటి రూపంలో కొండలు
విశాల నీలంలోకి తిరోగమిస్తున్నాయి

ఏడవకుండా అరవకుండా – గాఢమైన నిశ్శబ్దము:
బిడ్డకు తండ్రిలా, నా దేశం నాకు తక్కువే చెప్పింది
ఎప్పటికప్పుడు వేదనాభరిత నిట్టూర్పులు వింటూనే ఉన్నాను
జార్జియన్ మానవుడు నిద్రిస్తూ కలగంటున్నప్పుడు వెక్కివెక్కి ఏడ్పులు

నేను ఒంటరిగా నిల్చున్నాను, కొండల నీడలు
కునుకుతున్న నా పుట్టిన ప్రదేశాన్ని మళ్ళీ హత్తుకుంటున్నాయి
ఓ భగవంతుడా! నిద్ర, నిద్రే అన్ని వేళల్లో!
మేమెప్పుడు మేలుకొలుపుకు అర్హులవుతాము?

**గలక్షన్ టబిడ్జె (1891-1959) :** 20వ శతాబ్దం ప్రసిద్ధ కవి. తరువాతి తరాలవారిని అమితంగా ప్రభావితం చేసిన కవి. 1930 ప్రాంతంలో స్టాలిన్ మూలంగా తోటి రచయితల్ని, స్నేహితుల్ని, బంధువుల్ని కోల్పోవడంతో కృంగిపోయారు. వీరిని ఆ పరిస్థితుల్లో పిచ్చాసుపత్రిలో వేయగా అక్కడే ఆత్మహత్య చేసుకున్నారు.

**గాలి విసిరేస్తుంది :**

గాలి విసిరేస్తుంది, గాలి విసిరేస్తుంది, అవును అది విసిరేస్తుంది
ఆకుల్ని అవతలికి ఊదేస్తుంది
చెట్ల వరసలు, చెట్ల దండు తిరుగుతుంటాయి గుండ్రంగా
నాకు చెప్పు ఎక్కడ, నువ్వు ఎక్కడుండొచ్చు, నువ్వు ఎక్కడుండొచ్చు!
ఎలా మంచు కురుస్తుంది, ఎలా మంచు కురుస్తుంది ..
అదెలా కుమ్మరిస్తుంది
నిన్ను ఎన్నడూ కనుక్కోలేను.. ఎన్నడూ!
నీ రూపం నన్నెలా వెంటాడుతోంది –
ప్రతీ చోటా, ప్రతి నిమిషము, ప్రతీ క్షణం!
చాలాదూరంలో, అస్పష్టమైన ఆలోచనల మేఘాలు
గాలి విసిరేస్తోంది, గాలి విసిరేస్తోంది, అది విసిరేస్తోంది

**లట్వియ :** యూరప్‌కి ఈశాన్యాన బాల్టిక్ సముద్ర తీరంలో ఉన్న దేశం. ఉత్తరాన ఎస్టోనియ, దక్షిణాన లిథువేనియ, పశ్చిమాన బాల్టిక్ సముద్రం–రిగా అగాధం, తూర్పున రష్యా, ఆగ్నేయాన బెలారస్‌లు సరిహద్దులుగా ఉన్నాయి. అడవులు, కొండలు, సరస్సులతో కూడిన సారవంతమైన దేశం. బాల్టిక్ తెగలతో మొదలైన దేశం. 10-11 శతాబ్దానికి తూర్పు నుండి స్లావిక్కు, పశ్చిమం నుండి స్వీడిష్ల ఒత్తిడులు మొదలయ్యాయి. 13వ శతాబ్దంలో లివోనియ సోదరులు క్రైస్తవమత వ్యాప్తికోసం ఆక్రమించుకున్నారు. 1561 వరకూ అది లివోనియాలో భాగమయింది. జర్మనీ అప్పట్లో వారి భాష అయింది. 1562లో పోలాండ్ లట్వియాని ఆక్రమించుకొంది. 1629 నుండి 1721 వరకూ స్వీడన్, 1721 నుండి 1918 వరకూ రష్యా చేతుల్లోకి పోయింది. రష్యన్ విప్లవం మూలంగా, 1918లో లట్విన్ రిపబ్లిక్‌గా దాదాపు 20 ఏళ్లకు పైగా ఉంది. అక్కడ అంతర్గత అశాంతి మూలంగా 1939లో రష్యా తిరిగి ఆక్రమించుకుని, సోవియట్ సమాఖ్యలో చేర్చింది. 1941 నుండి 1944 వరకూ జర్మనీ సైన్యం ఆక్రమించింది. రెండవ ప్రపంచ యుద్ధంలో డెబ్బయి వేల యూదుల్లో 95 శాతం సంహరించబడ్డారు. 1944 లో తిరిగి రష్యా వశమయింది. 1991 లో సోవియట్ సమాఖ్యనుండి విముక్తిచెంది స్వతంత్ర రాజ్యమైంది.

అధికార భాషైన, లట్వియన్ భాష ఇండో యూరోపియన్ కుటుంబానికి చెందిన బాల్టిక్ భాష. లట్వియన్ భాష – లివ్, మధ్య, లాట్గాలియన్ పేరున మూడు విభిన్న మాండలికాలుగా ఉంది. సాహిత్యం లాట్వియన్ భాషలోనే కాక, జర్మనీ, రష్యన్, యుక్రేనియన్ ఇతర భాషల్లో కూడా వస్తోంది. 400 ఏళ్ల సాహిత్య చరిత్ర లట్వియాకి ఉంది. జానపద సాహిత్యం అంతకంటే ఎంతో ముందుంది. ఆధునిక సాహిత్యం 19వ శతాబ్దం రెండవ భాగం నుండే మొదలయింది. అనేక ఆక్రమణల ఫలితంగా సాహిత్యం పరిణామం చెందడానికి అనేక శతాబ్దాలు పట్టింది. జర్మన్ మతాధికారులే లిఖిత సాహిత్యాన్ని మొదలెట్టారు. కానీ లౌకిక సాహిత్యం 18వ శతాబ్దంలో గోథర్డ్ ఫ్రెడ్రిక్స్ స్టెండర్ (1714-1796), రచనలతో మొదలైంది. అయితే అక్కడి జానపద గీతాలనే తాను నీతికథలుగా మార్చాడు. అయితేనేం ఆ ప్రయత్నం మూలంగా 4లక్షల జానపద గీతాలు ప్రచురించబడ్డాయి. సుమారు 10 లక్షలు నమోదు చేయబడ్డాయి. గ్రంథస్థం కానివి ఇంకా ఎన్నో ఉన్నాయని అంటారు. నెరెడ్జిగైస్ ఇండ్రిఇస్ (1783-1828) రాసిన కవిత్వమే అప్పటి మొదటి లట్వియన్ కవిత్వ సంకలనం. 17వ శతాబ్దంలో ఫ్యూరెక్ సెరన్ అన్న కవి జానపద సాహిత్యాన్ని కాదని నూతన ఛందోరీతులను, అనుప్రాసలను ప్రవేశ పెట్టాడు. 19వ శతాబ్దం మధ్యభాగంలో జాతీయ చైతన్యం మొదలై సాహిత్య స్వాతంత్ర్యానికి నాంది అయింది. జూరిస్ ఆలునాన్స్ (1832-1864) రాసిన *చిన్న కవితలు* భావకవిత్వానికి ప్రేరణ అయింది. ఆండ్రేజ్ పంపర్స్ (1841-1901) రాసిన మహాకావ్యం *భల్లూక హంతకుడు* లో జానపద కవిత్వ ఛాయలు కనిపిస్తాయి. 1890-1900 కాలంలో నూతన కవిత్వ ఉద్యమం, వాస్తవికతా వాదాన్ని

బలపర్చింది. అప్పటి ప్రముఖ కవి జానిస్ రైనిస్ (1865-1929) ప్రతీక వాదాన్ని, అతని భార్య అప్పాజియా స్త్రీల హక్కులకోసం కవిత్వం రాసింది. జానిస్ పోరుక్స్ (1865-1929) నూతన కాల్పనిక వాదాన్ని ప్రవేశ పెట్టారు. 1905 ప్రాంతంలో భావకవితది పైచేయి కావడం మొదలైంది. కార్లిస్ స్కాల్ బే (1879-1945) ఈ ధోరణికి ఆద్యుడు. జానపద గీతాల వలన ప్రభావితులు కాని కవులు దాదాపు లేరనే చెప్పాలి. వాటిని దాటి వచ్చిన కవుల్లో ప్రముఖులు అలెక్సాండెర్స్ కాక్స్ (1901-1950), విజ్మాబెల్సెవికా (1931-2005), ఇమంట్స్ జ్యోడోవిస్ (1933 - 2013) మొదలైన కవులున్నారు.

**విజ్మాబెల్సెవికా (1931-2005) :** వచనం కవిత్వం రెండూ రాసారు. అనేక పురస్కారాలు పొందిన కవయిత్రి. నోబెల్ బహుమతి పొందాలన్న కల నిజం కాలేదుగానీ అందుకు అర్హురాలుగా అనేక సత్కారాలు పొందారు. 40 భాషల్లో వీరి కవిత్వం అనువాదమయింది. *సముద్రం కాలుతోంది* కవిత్వ సంకలనం వీరి అద్భుతమైన కవిత్వంగా గుర్తించారు.


జ్యోడోవిస్

**నాకు కావల్సినదేమిటో నీకు అర్థం కాదు :**

**కాస్సేపు రాయి దగ్గర కూర్చోడం బాగుంటుంది**
**రాయి నిశ్శబ్దంలో ఒంటరిగా / అదే సమయంలో జతగా**
**తరువాత రాయిమీద సంతాపాన్ని ఊహిస్తూ**
**నన్ను ప్రేమిస్తున్నావా అని నేనడిగినపుడు తిరస్కారం ఉండదు**
**చాచిన చేతులకు తోసివేతా ఉండదు / చల్లని సంజె చీకటిలోకి**
**నెమ్మదిగా పగలు జారిపోతున్నపుడు**
**కేవలం మౌన సుఖం , దుఃఖించకు**

**కోపగించుకోకు, నాకు తెలుసు / అంతగా నేనేదీ కోరుకోకూడదని**

**ఇమంట్స్ జ్యోడోవిస్ (1933-2013) :** కవి, పాత్రికేయుడు, దర్శకుడు, రచయిత, అనువాదకుడు, రాజకీయవేత్త, లట్వియా సాహిత్య రంగంలో ప్రముఖుడు. వీరు రాసిన *ఆవిర్భావాలు* చిరు వచన కవితలు వీరికి ఎక్కువ పేరు ప్రఖ్యాతులు తెచ్చిపెట్టింది. 20 కవిత్వ సంకలనాల వరకూ వెలువడ్డాయి.

**అస్పష్ట చిరు మిణుగురులు చీకటిలో కాలిపోతాయి**
**చీకటంతా మిణుగురులమీద అరుస్తుంది / మీరంతా అబద్ధాలని**

**అస్పష్ట చిరు మిణుగురులు / రంధ్రాల్లో దూరిపోతాయి**
**లోనికి బయటికి / చీకటిలో కాంతి ప్రవహిస్తుంది**

**లోనికి బయటికి అదెలా ప్రవహిస్తుందో**
**నువ్వు చూడనన్నా చూడవు**

**మసకచీకటి రాత్రి గాలుల్లో / గొల్లవాళ్ల ఒంటరి ఆకారాలు**
**నడుచుకుంటూ పోతుంటాయి**

**మసకచీకటి రాత్రి గాలుల్లో / గొల్లవాళ్ల ఒంటరి ఆకారాలు**
**మిణుగురులకు మొగ్గుతాయి**

**నువ్వడుగుతున్నావు నన్ను / నేను ఎక్కడుంటానని?**
**వారితోనే అక్కడే నేనుంటాను** (ఆవిర్భావాలు నుండి)

**లిథువేనియ :** యూరప్‌కి ఉత్తరాన, తూర్పు బాల్టిక్ సముద్ర తీరాన లిథువేనియ ఉంది. దానికి ఉత్తరాన లట్వియ, ఆగ్నేయాన బెలారస్, దక్షిణాన పోలాండ్, నైరుతిన రష్యా కాలినింగ్రాడ్ ప్రాంతం సరిహద్దులుగా ఉన్న దేశం. ఉన్న మూడు బాల్టిక్ రాష్ట్రాల్లో పెద్దది. క్రీ.పూ. 2000 నాటికి బాల్ట్ తెగలు ఈ ప్రాంతంలో స్థిరపడ్డారు. 1240 నాటికి వారంతా లిథువేనియా తెగలుగా ప్రకటించుకున్నారు. 1251 నాటికి వారంతా క్రైస్తవ మతంలోకి మారిపోయారు. 1936 నాటికి గెడిమినస్ నాయకత్వంలో లిథువేనియా, విలిన్యస్ ని రాజధానిగా చేసుకుని శక్తివంతమైన రాజ్యంగా తయారైంది.

యూరప్‌లోని ఇతర ప్రాంతాలనుండి కూడా వలసల్ని ప్రోత్సహించారు. తూర్పున బెలారస్, యుక్రేనియ వరకూ లిథువేనియా విస్తరణ కొనసాగింది. 1377లో లిథువేనియా నాయకుడు పోలాండ్ నాయకురాల్ని జడ్విగని వివాహం చేసుకోవడంతో అక్కడి రాజయాడు. లిథువేనియాని చూసుకుందుకు తన శతృవు వైటటస్‌కి అప్పగించాడు. వారిద్దరి ఒడంబడికలో రెండు దేశాలూ స్థిరంగా కొనసాగాయి. వైటటస్ మరణించాక 1573 నాటికి పోలాండ్ అధీనంలోకి లిథువేనియా పోక తప్పలేదు. 1795 నాటికి నెమ్మదిగా ఒక్కో ప్రాంతాన్ని ఆక్రమించుకుంటూ లిథువేనియాని రష్యాలో కలుపుకుంది. ఎన్ని తిరుగుబాట్లు చేసినా రష్యా నుండి తప్పించుకోలేకపోయారు. కానీ 1915లో జర్మనీ లిథువేనియాని ఆక్రమించుకుని స్వతంత్ర రాజ్యం దర్జాని ఇచ్చింది. అయినా 1940లో రష్యా తిరిగి లిథువేనియా పొందగలిగుతే, 1941లో జర్మనీ మళ్లీ లిథువేనియాని సాధించుకోగలిగింది. 1944లో రష్యా లిథువేనియాని తిరిగి పొందగలిగింది. అది 1991 వరకూ కొనసాగి 1991లో స్వతంత్ర రాజ్యమైంది. అధికార భాష అయిన లిథువేనియన్ భాష అతి ప్రాచీనమైనది. 30 వరకూ

మతాలవారు అక్కడున్నా ఎక్కువ భాగం క్రైస్తవులే. లిథువేనియా కవిత్వం ప్రాచీన సంప్రదాయాలతో నిండిన జానపద గీతాల మీద ఆధారపడ్డది. అలా వాటిని అనుసరించి డొనెలైటిస్ కవిత్వానికి మార్గదర్శకుడయ్యాడు. లిథువేనియా నాయకులు అప్పటి కవుల్ని తమతోబాటు యుద్ధాలకు తీసుకుపోయేవారు. యుద్ధసమయాల్లో ఆ నాయకుల వీరత్వాన్ని కీర్తించడం వారి ముఖ్యమైన పని. అయితే అవేవీ ఎక్కడా గ్రంథస్థం కాలేదు.

18వ శతాబ్దం వరకూ ధార్మిక పరమైన సాహిత్యమే వచ్చింది. 18వ శతాబ్దం నుండి లౌకిక పరమైన సాహిత్యం మొదలయింది. వాటిల్లో ప్రముఖంగా చెప్పుకోదగ్గది క్రిస్టిజొనాస్ డొనెలైటిస్ (1714-1780) రాసిన *నాలుగు రుతువులు* మహాకావ్యం. జర్మనీ కవిత్వ ప్రభావంతో రాసిన-ఒక ఏడాది కాలంలో ఒక గ్రామ చిత్రణ. 19వ శతాబ్దం మొదట్లో ఫ్రెంచి విప్లవం దరిమిలా వచ్చిన పశ్చిమ కవిత్వ ప్రభావంతో రాసిన కవిత్వం వచ్చింది. దానికి ఆద్యులు సిమనస్ స్టనెవిసియస్ (1788-1848), రష్యన్‌ల మూలంగా సాగిన పునరుజ్జీవనంలో భాగంగా బిషప్ ఆంటనస్ బరనౌస్కస్ (1835-1902) ప్రసిద్ధ కావ్యం *అడవి* వచ్చింది. రష్యా రాజకీయ ఆధిపత్యం, పోలాండ్ సాంస్కృతిక ప్రభావం నుండి బయటపడాలనే తాపత్రయం ఆ కాలంలో ఎక్కువయింది. స్వాతంత్ర్యము సిద్ధించాక వింకస్ కుదిర్క (1858-1899) రాసిన కవితనే వారి జాతీయ గీతమయింది.

మైరొనిస్‌గా పిలవబడే జోనస్ మకియులిస్ (1862-1932) లిథువేనియా పునరు జ్జీవనానికి ప్రసిద్ధ కవి తత్వవేత్తగా గుర్తిస్తారు. ఇతర ముఖ్య కవుల్లో జోనస్ బసనవ్సియుస్ (1851-1927), జుర్గిస్ బల్ట్రుసైటిస్ (1873-1944), బాలిస్ స్రు ఓగా (1896-1947), కజిస్ బింకిస్ (1893-1942), జొనస్ ఐస్టిస్ (1904-1973), నలొమెజ నెరిన్(1904-1945), బెర్నర్డస్ బ్రజడ్జియొనిస్(1907-2002), జనిన డెగుటెటె (1928-1990) మొదలైనవారు.


క్రిస్టిజొనాస్

**క్రిస్టిజొనాస్ డొనెలైటిస్ (1714-1780):** స్వీయ ప్రతిభతో లిథువేనియాలోనే కాక, యూరోప్‌లో కూడా ప్రాముఖ్యత పొందిన అద్భుతమైన కవి. 1740 లో ప్రారంభించిన సాహిత్య యాత్ర చివరివరకూ కొనసాగింది. వీరి *ఆరు కల్పితకథలు, నాలుగు రుతువులు* వీరి మరణానంతరమే ముద్రణకు నోచుకున్నాయి. జర్మనీలో కూడా కవిత్వం రాసారు.

ఎగబాకుతున్న సూర్యుడు మళ్లీ ప్రపంచాన్ని మేలుకొల్పుతున్నాడు
నిరుత్సాహకర శీతాకాలపు లావాదేవీలు చెడిపోవటం
చూసి నవ్వుతున్నాడు
అతిశీతలమైన రుతువు పట్టు పూర్తిగా విడిపోయింది
ఎత్తుగా పెరిగిన మంచు కుప్పలు ఏమీకాకుండా కరిగిపోయాయి
మెత్తటి దక్షిణ గాలి పండని భూముల్ని బుజ్జగించి
ప్రతీ ఆకుని గడ్డిపోచని మళ్లీ లేచి బతకమని ప్రతిరోజు వంచిస్తున్నాయి
ప్రతి కొండ కనుమ మంచుబొచ్చుని విసిరేస్తున్నాయి
పొదలు పొళ్లు వసంతం పిలుపుకి ఆనంద పడుతున్నాయి
శరత్కాలపు కన్నీటి ఊబిలో మరణించినవన్నీ,
శరత్కాలపు మంచులో కూరుకుపోయి నిద్రపోతున్నవన్నీ,
లేదా గందరగోళంగా వణుకుతూ పెరగని పొద మాటునున్నవన్నీ
ఆనందపడుతూ గుంపుగా బయటకొస్తున్నాయి
నవ్వే వసంతానికి స్వాగతంగా

*(నాలుగు రుతువులు దీర్ఘ కావ్యంలోని వసంతోత్సాహం నుండి)*

**వింకస్ కుదిర్క (1858-1899) :** లిథువేనియన్ పక్షాన సాహిత్య సాంస్కృతిక కర్యకలాపాల్లో ముఖ్య భూమిక పోషిస్తున్నందుకు రష్యా ప్రభుత్వ హయాంలో అనేకమార్లు నిర్బంధించబడ్డారు. ఒక మాసపత్రికకు సంపాదకుడుగా పనిచేసారు. టీ.బీ. మూలంగా ఆసుపత్రి పాలయ్యేవారు. ఆ అనారోగ్యంతోనే మరణించారు. లిథివేనియన్ కట్టుకథల్ని సేకరించి భద్రపరిచారు. వారి కవిత్వానికి వారే సంగీతాన్ని సమకూర్చుకొనేవారు. వీరి కవిత జాతియగీతంగా ఎన్నుకోబడింది.

**లిథువేనియా జాతీయగీతం :**

లిథువేనియా, నా మాతృదేశమా, వీరుల భూమీ!
గతంనుండి నీ పుత్రులు శక్తిని పొందనీ
నీ బిడ్డలు ధర్మం దారిలోనే నడవనీ
స్వదేశం సమస్త మానవజాతి మంచికోసం వారు పాటుపడనీ
సూర్యుడు లిథువేనియా నుండి చీకటినంతా వెళ్లగొట్టనీ
కాంతి సత్యం మా అడుగులకు మార్గదర్శనం చేయనీ
లిథువేనియా ప్రేమ మా గుండెల్లో మండనీ
మా దేశంకోసం ఐక్యత వికసించనీ

**జొనస్ ఐస్టిస్ (1904-1973) :** ప్రముఖ లిథువేనియన్ కవి. సన్నిహిత సంభాషణ శైలిలో రాజకీయ వస్తువుల్ని కవిత్వం చేసేవారు. జీవితం చివరి దశలో ఉద్యోగరీత్యా అమెరికాలో స్థిరపడ్డారు. అక్కడే మరణించారు.

**ఒక్క రక్తపు బిందువు :**

ఒక్క రక్తపు బిందువు నిన్ను శుద్ధిచేసుండేది
కానీ నీ పిసినారితనంలో నువ్వది పోగొట్టుకున్నావు
పాతకాలం నుండే మన శక్తిని సమకూర్చుకుంటున్నా
మన వాగ్దానాలు నెరవేరకుండానే ఉండిపోయాయి.

ఒక్క మాట నిన్ను రక్షించి ఉండేది
కానీ నీ పిసినారితనంలో నువ్వది పోగొట్టుకున్నావు
మాతృదేశం కోసం మన ప్రాణాలిస్తామని మనం ప్రమాణం చేసినా
మన వాగ్దానాలు నెరవేరకుండానే ఉండిపోయాయి.

**మోల్డోవ :** యూరప్ బల్కన్ ప్రాంతానికి పూర్వోత్తరంలో ఉన్న దేశం. పూర్వం బెస్సరబియగా పిలవబడ్డ ఈ దేశం 1812 వరకూ రుమానియా అధీనంలో ఉంది. ఆ తరువాత ఒట్టొమాన్ సామ్రాజ్యం రష్యాకి ధారాదత్తం చేసింది. మొదటి ప్రపంచయుద్ధం తరువాత మళ్లీ రుమానియా చేతుల్లోకి పోయింది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత సోవియట్ సమాఖ్యలోని భాగం చేయబడింది. సోవియట్ పతనం తరువాత 1991లో స్వతంత్ర దేశమయింది. పశ్చిమాన రుమానియా, ఉత్తరం దక్షిణం తూర్పున యుక్రేనియా సరిహద్దులుగా ఉన్న దేశం. డ్నిస్టెర్, ప్రుట్ నదుల మధ్యే ఎక్కువ భూభాగం ఉంది. మాల్డోవన్ భాష అక్కడి అధికార భాష. 64శాతం ప్రజలు ఈ భాషనే వాడతారు. నిజానికి ఈ భాష రుమానియా భాషే అని అంటారు. మత ప్రతిబంధకాలు లేకున్నా 96 శాతం ప్రజలు క్రైస్తవాన్నే అనుసరిస్తారు.

19వ శతాబ్దం వరకూ మౌఖిక సాహిత్యమే అక్కడ రాజ్యమేలింది. అయితే రుమానియన్ సాహిత్యాన్ని మోల్డోవ సాహిత్యాన్ని ఈ శతాబ్దంలో విడదీసి చూడలేము. మోల్డోవాలో పుట్టి రుమానియాలో స్థిరపడ్డ, రెండు దేశాల వారూ జాతీయకవిగా చెప్పుకునే మిహై ఎమినెస్కు (1850-1889), అలెక్సి మటీవిసి (1888-1917), ఇఒన్ డ్రుట, నికొలీ డబిజ (1948-), లియొనిడలరి, డుమిట్రు మట్కొవ్స్కి(1939-2013), గ్రిగోరీ వియెరు (1935-2009), అర్కదీ సుకెవను (1952-), లియొ బుట్నరు (1949-), ఎమిలీన్ గలైకు-పౌన్ (1964-) మొదలైన కవులు మోల్డోవ సాహిత్య ప్రపంచంలో ముఖ్యులు.

**గ్రిగోరీ వియెరు (1935-2009) :** ప్రముఖ కవి రచయిత. ముఖ్యంగా పిల్లలకోసం ఎక్కువ రాసారు. ప్రకృతి, దేశభక్తి, పూజ్యనీయమైన మాతృమూర్తి వీరి కవితల్లో ఎక్కువ. కానీ వీరి రచనలన్నీ రుమానియా భాషలో రాసినవే.

**దేశీయ భాషతో బతుకు :**

లోయలో ఊటలన్నీ విషమయమైపోయాయి
అలాగే పూల అమృతం
ప్రాణాంతకమైన ఆకాశం కేవలం శాపం
కానీ ఎవరైనా జీవాన్ని నాలుకని ఎందుకు విషమయం చేస్తారు?
నీ అనిత్యమైన నిద్రమబ్బునుండి లే, లే, లే
నీ వివేకాన్ని కాపాడుకో, నీ వివేకాన్ని కాపాడుకో, నీ వివేకాన్ని కాపాడుకో
నీ దేశీయ భాషని దాని ఆత్మని నిలుపుకో

కోకిలపాట విషమయం
వర్షం చినుకులు, మంచు తునకలు కూడా
ప్రాణాంతకమైన ఆకాశం నరికే గొడ్డలి
కానీ ఎవరైనా జీవాన్ని నాలుకని ఎందుకు విషమయం చేస్తారు?
నీ అనిత్యమైన నిద్రమబ్బునుండి లే, లే, లే
నీ వివేకాన్ని కాపాడుకో, నీ వివేకాన్ని కాపాడుకో, నీ వివేకాన్ని కాపాడుకో
నీ దేశీయ భాషని దాని ఆత్మని నిలుపుకో

చెట్టు పండు రుచి కోల్పోయింది
అలాగే తల్లి స్తనం నుండి పాలూనూ
ప్రాణాంతకమైన ఆకాశం కేవలం శాపం
కానీ ఎవరైనా జీవాన్ని నాలుకని ఎందుకు విషమయం చేస్తారు?
నీ అనిత్యమైన నిద్రమబ్బునుండి లే, లే, లే
నీ వివేకాన్ని కాపాడుకో, నీ వివేకాన్ని కాపాడుకో, నీ వివేకాన్ని కాపాడుకో
నీ దేశీయ భాషని దాని ఆత్మని నిలుపుకో

**ఇవాన్ ఫ్రాంకో (1856-1916) :** యుక్రేనియా ప్రముఖ కవి, రచయిత, జాతీయవాది. సామాజిక ఇతివృత్తాలమీద ఎక్కువగా భావకవిత్వం రాసారు.

**నీవైన కళ్లు :**

లోతు లోతైన సముద్రంలా నీ కళ్లు

నెమ్మదిగా శాంతంగా, ప్రకాశవంతంగా మెరుస్తున్నాయి
వాటి లోతుల్లో నా పాత దుఃఖం
మరకలా మునిగిపోయి కనుమరుగవుతోంది

లోతు లోతైన బావిలా నీ కళ్లు / స్ఫటికంలా అడుగుకి స్పష్టంగా
ఆకాశం అగాధంలోని నక్షత్రంలా / నా ప్రియా, అక్కడ నా ఆశ మెరుస్తోంది

ఈ దేశాలన్నీ ఆటవస్తువుల్లా ఆడుకోబడ్డాయి. అనేక చేతులు మారుతూ వచ్చాయి. వాటి ప్రభావం వారి సాహిత్యంలో అడుగడుగునా కనిపిస్తుంది. మి

ముకుంద రామారావు
హైదరాబాదు,
ఫోన్ : 99083 47273

# రవీంద్ర జయంతి



ఆలపాటి రవీంద్రనాథ్

**మా**న్యులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు 'నా అనువాద రచన ఒకటి *జ్యోతిప్రెస్* అధినేత ఆలపాటి రవీంద్రనాథ్ అచ్చువేశారు. వారిని అడిగి ఓ కాపీ తెచ్చుకో. మీ ఇంటికి దగ్గరేకదా. నా అనువాదం ఎలా ఉందో చెప్పాలి' అని అనడంతో ఒక రోజు సాయంకాలం గోల్కొండ క్రాస్‌రోడ్సులో, హెబ్రోనుకు ఎదురుగా ఉన్న *జ్యోతిప్రెస్సు*కు వెళ్ళాను. బయట ఆవరణలో 4,5 కుర్చీలు వేసి ఉన్నాయి. నన్నో కుర్చీలో కూర్చోమని, పుస్తకం తెప్పించి ఇచ్చి, అనువాద ప్రక్రియ దగ్గర నుండి సాహిత్య చర్చ మొదలు పెట్టారు రవీంద్రనాథ్ గారు. తాము చదివిన పుస్తకాలను గురించి అనర్గళంగా చెబుతుంటే, ఆశ్చర్యపడిపోవటం నావంతు అయింది. అమ్మో, ఈయన ప్రెస్ ఓనరు మాత్రమే కాదు, గొప్ప సాహితీవేత్త, voracious reader అనిపించింది.

ప్రెస్సుకు, వారి ఇంటికి (ఆ రోజుల్లో గాంధీనగర్‌లో ఉండేవారు) మధ్యలో మా ఇల్లు ఉండటంతో, తరుచుగా వారిని కలుసుకొని, సాహిత్య కాలక్షేపం చేస్తుండేవాణ్ణి. మా తాతల స్వగ్రామం గోళ్ళమూడిపాడు. వారి వియ్యాల వారిదీ ఆ ఊరు కావడంతో వారికి నా పట్ల ఇంకా ఆత్మీయత, అభిమానం పెరిగాయి. నేను చదివిన హిందీ పుస్తకాలను గురించి ప్రశ్నలడిగి, వాటిలోని మూల ప్రతిపాద్య విషయాన్ని గురించి చర్చించేవారు. వారి ప్రశ్నలకు జవాబు చెప్పేటప్పటికి నా తల ప్రాణం తోకకు వచ్చేది. బందరులో ఉంటూ, 1884-86 మధ్య హిందీలో నాటకాలు వ్రాసిన నాదెళ్ళ పురుషోత్తమకవి (1861-1938) గారి జీవిత విశేషాలనూ, రచనా వ్యాసంగం గురించి ఎన్నో విషయాలు అడిగి తెలుసుకున్నారు.

మేధావుల మెదడుకు పదును పెట్టే వ్యాసాలతో ఒక పత్రిక ప్రారంభించాలనీ, ఆ పత్రికకు ***'మిసిమి'*** అని పేరు పెడదామనుకుంటున్నానీ చెబుతూ, నా అభిప్రాయాలడిగి తెలుసుకున్నారు.

***'మిసిమి'*** పత్రికలను క్రమం తప్పకుండా పంపించేవారు. ఈ వ్యాసం ఎలా ఉంది? ఆ వ్యాసం గురించి మీ అభిప్రాయమేమిటి? అని అడిగేవారు. 'అయ్యా! మీ ***'మిసిమి'*** ఒకటి, రెండు రోజుల్లో చదివి అవతల పారవేసేది కాదు. అది ఆలోచనామృతాన్ని అందించేది. దాన్ని ఆస్వాదించడానికి తీరుబడి కావాల'ని నేనంటే తన కృషి సఫలమైందని భావిస్తూ, చిరునవ్వు చిందించేవారు.

శ్రీమతి ఐరావతీ కార్వే వ్రాసిన *యుగాంత్* అనే పుస్తకాన్ని వారు చదవడం తటస్థించింది. కీ.శే.బాలచంద్ర ఆప్టేగారు ఆ పుస్తకాన్ని తెలుగులోకి అనువదించారు. అక్కడక్కడ నా సహకారం తీసుకున్న సహృదయులు ఆప్టేగారు పీఠికలో నా పేరు కూడా ఉటంకించారు. 'ఇంత మంచి పుస్తకం గురించి నాకిన్నాళ్ళు ఎందుకు చెప్పలేద'ని రవీంద్రనాథ్‌గారు బాధపడ్డారు. ఆ తరువాత ఆ పుస్తకాన్ని క్షుణ్ణంగా చదివి, ప్రభావితులై, శ్రీమతి ఐరావతి చెప్పిన విషయాల ఆధారంగా వ్యాసాలు వ్రాయించి ***'మిసిమి'***లో ప్రచురించారు.

మహాభారతంలో భీమసేనుడి మానసికతను వర్ణిస్తూ ఎం.టి.వాసుదేవన్ నాయర్‌గారు వ్రాసిన *రంటామూషమ్* (మనిషి రెండు ముఖాలు) నవలను గురించి చదువుతున్నప్పుడు, చట్టున రవీంద్రనాథ్‌గారు గుర్తుకు వచ్చారు. వినూత్నపంథాలో భీముడి పాత్రను చిత్రించారు నాయర్‌గారు.

కొత్త కొత్త విషయాలను గురించి, భావాలను గురించి తెలుసుకుంటూ-చదువుతూ వాటిని మననం చేసుకుంటూ, వాటిని పాఠకులకందించాలన్న తపనగల సంపాదకోత్తములయిన శ్రీ రవీంద్రనాథ్ సార్థక జన్ములు.

ఈనాటి సంపాదకులకు, పాఠకులకు, పరిశోధకులకు ఆదర్శప్రాయులు - నిరంతర జిజ్ఞాసయే వారి జీవితానికి కరదీపికగా రూపొందింది. ధన్యులు రవీంద్రనాథ్‌గారు.

– **డాక్టర్ భీమ్‌సేన్ నిర్మల్,** హైదరాబాదు, ప్రముఖ హిందీ సాహిత్యవేత్త, అనువాదకులు.

**4, నవంబర్ : ఆలపాటి రవీంద్రనాథ్ జయంతి**

నోబెల్ పురస్కారం :

# ఏలిస్ మన్రో

- ముక్తవరం పార్థసారథి



అన్ని అంతర్జాతీయ బహుమతుల్లాగానే 1901లో ప్రారంభమైన నోబెల్ కూడా వివాదాలకు అతీతమైనదేమీ కాదు. పలుసార్లు అర్హులకు రాలేదన్న ఆరోపణలున్నాయి. ఇదివరలో రష్యన్ రచయితలు బోరిస్ పాస్టర్నాక్, అలెగ్జాండర్ సోల్జెనిట్సిన్, గతేడాది చైనీస్ రచయిత మోయాన్ లను కేవలం రాజకీయ కారణాలతోనే బహుమతులకు ఎంపిక చేశారన్నారు కొందరు.

ఈ సారి మాత్రం అలాంటి సాహిత్యేతర విషయాలేవీ చర్చకు రాలేదు. పోటీలో వున్న మరొక జపనీస్ రచయిత హరుకి మురకామిని కాదని కెనెడియన్ చెహోవ్‌గా పేరొందిన ఏలిస్ మన్రోకు ఈ పురస్కారం లభించటం ముదావహం. కేవలం కథలు మాత్రమే రాసి ఈ బహుమతి గెల్చుకున్న తొలివ్యక్తి ఈవిడే. (1904లో మరణించిన చెహోవ్‌కు నోబెల్ రాలేదు. అది వేరే విషయం.)

"నవల నాకు అర్థం కాదు. అంత పెద్ద పుస్తకంలో నేను ఎక్సైట్‌మెంట్ కోసం ఎక్కడ వెదకాలి? కథలో ఈ ఎక్సైట్‌మెంట్ సులభం. కథ బాగా వస్తుందో లేదో ప్రారంభించిన వెంటనే తెలిసిపోతుంది. కథలో ఒక విస్ఫోటనం వుంటుంది. దాని కోసమే. దానివైపే కథ నడుస్తుంది. అయితే మరీ చిట్టి పొట్టి (షార్ట్ షార్ట్) కథల్లో చెప్పదలచుకున్నదయినా చెప్పటం సులభం. అందువల్లే నిడివిగల చిన్న కథ నా కిష్టం" అంటుంది ఏలిస్. తన కథల్ని చాలాసార్లు తిరగ రాస్తుంది. తిరగరాయటమంటే విస్ఫోటనానికి అడ్డొచ్చే మాటల్ని తొలగించటమే అని స్పష్టం చేసింది. ఏలిస్‌ను గొప్ప స్త్రీవాది (ఫెమినిస్టు) అన్న వాళ్లున్నారు. దానికామె యిచ్చిన సంజాయిషీ :

*"నేను స్త్రీని. అందువల్ల సహజంగానే నా కథలన్నీ స్త్రీల గురించే. పురుషులు నిజంగా స్త్రీల గురించి ఏమనుకుంటారో నాకు తెలియదు. 'స్త్రీవాది' అనే మాట కూడా నాకు అర్థం కాదు. తొలిరోజుల్లో నేను కూడా స్త్రీవాదిని కాకపోతానా అనుకున్నాను గాని స్త్రీవాదం వెనక ఏదైనా థియరీ వున్నట్టయితే అది నాకు తెలయదు గదా అనుకున్నాను. ఆ అర్థంతో నేనే ఫెమినిస్టును కాదు. స్త్రీల అనుభవాలను రాయడం స్త్రీవాదం అయితే మాత్రం నేను స్త్రీవాదినే. అసలు స్త్రీవాద భావనకు మూలం కూడా యిదే అనుకుంటాను."*

కెనడాలోని నైరుతి అంటేరియోలోని లేక్‌హరన్ పక్కనున్న కుగ్రామంలో 1931లో జన్మించింది ఏలిస్. ఆమె తండ్రి సిల్వర్ ఫాక్స్ ఫార్మర్. అంటే, మెరిసే తెల్ల బొచ్చున్న నక్కల్ని పెంచి, వాటి చర్మాలను అమ్మటం ఆయన వృత్తి. తల్లి స్కూల్ టీచర్. ఏలిస్ రెండేళ్ళు యూనివర్సిటీ ఆఫ్ వెస్టర్న్ అంటేరియోలో చదివింది. జీవిక కోసం (వెయిట్రెస్‌గా), పరిచారికగా పొగాకు తుంచే పనిలో, గ్రంథాలయ గుమస్తాగా పని చేసింది. సహ విద్యార్థి జేమ్స్ మన్రోను పెళ్లి చేసుకుంది. తల్లిగా, యిల్లాలిగా బాధ్యతలు మీద పడ్డాయి. 1963లో మన్రో దంపతులు విక్టోరియాకు వెళ్లిపోయాను. అక్కడే 'మన్రో బుక్స్'ను ప్రారంభించింది. జేమ్స్ నుండి 1972లో విడిపోయిన ఏలిస్, 1976లో భౌగోళిక శాస్త్రవేత్త గెరాల్డ్ ఫ్రెమ్లిన్‌ను 1976లో పెళ్ళి చేసుకుంది.

ఈమె తొలి కథ *ది డైమెన్షన్స్ ఆఫ్ ఎ షాడో* 1950లో కెనడా అత్యున్నత సాహితీ పురస్కారం గవర్నర్ జనరల్స్ ప్రైజ్ గెల్చుకొంది. తరువాతి మరో రెండు సంకలనాలు *హూ డూ యు థింక్ యు ఆర్* (1978). 2009లో జీవన సాఫల్య పురస్కారం మాన్ బుకర్ ఇంటర్నేషనల్ ప్రైజ్ లభించింది. *ది న్యూయార్కర్, ది అట్లాంటిక్ మంత్లీ, గ్రాండ్ స్ట్రీట్, ది పారిస్ రివ్యూ* వంటి పత్రికలు ఏలిస్ కథల్ని విరివిగా ప్రచురించాయి. ఈమె మరో పుస్తకం *లైవ్స్ ఆఫ్ గర్ల్స్ అండ్ వుమెన్* నవలగా అచ్చయింది గాని నిజానికి అవన్నీ పరస్పర సంబంధమున్న కథలే. ఈమె ఇప్పటికి పధ్నాలుగు కథా సంపుటాలు ప్రచురించింది. చివరి సంకలనం *డియర్ లైఫ్* తర్వాత రిటైర్మెంట్‌కు సిద్ధంగా వున్నానని కూడా చెప్పింది.

నోబెల్ సాహిత్య బహుమతి పొందిన పదమూడవ మహిళ, తొలి కెనడియన్ ఏలిస్. (1976 నోబెల్ గ్రహీత సాల్ బల్లో కెనడాలో పుట్టినప్పటికీ అమెరికాలో స్థిరపడ్డారు).

మార్క్‌ట్వేన్‌తో సహా గొప్ప రచయితలందరూ తమ బాల్యాన్నే కథలుగా మలిచారు. పుట్టిపెరిగిన వూళ్లు, అప్పటి మనుషులు, పరిసరాలు అంతగా ప్రభావితం చేస్తాయి మరి. ఏలిస్ కథలకు గ్రామాలు లేదా చిన్న పట్టణాలే నేపథ్యం. ఇప్పటి వాళ్లకు ఈ విషయాలు తెలియవు. నేను సమకాలీన సమస్యలను గురించి రాయలేను. నా మూలాలు నా బాల్యంలోనే వున్నాయి. ఆ గ్రామలెలా వుండేవని ! "ఇప్పటి వూళ్లతో పోలిస్తే అసలవి గ్రామాలే కాదు. అడవుల్ని నరికి, పశువుల్ని పెంచుకొంటూ, లేదా మా నాన్నలాగ నక్కల పెంపకం (ఫాక్స్ ఫార్మింగ్) చేసుకుంటూ పది పన్నెండు కుంటుంబాలు కలిసి ఒక చోట వుండే వాళ్లం అదే వూరు. నాకు తెలిసిన రచయితలందరికీ తరగని కథలగని బాల్యమే అంటుంది ఏలిస్. ఈమె కథల్లో తన చుట్టూ వున్న ప్రపంచాన్ని, మనుషుల్ని అర్థం అయ్యీకాని పద్ధతిలో పరిశీలిస్తుంది. కథంటే నవలకు 'సంక్షిప్త రూపం' అన్న దురభిప్రాయాన్ని తొలగించి, కథా ప్రక్రియకు పరిపూర్ణత తీసుకొచ్చింది. "ఏలిస్ మన్రో ఈస్ మాస్టర్ ఆఫ్‌ది కాంటెంపరరీ షార్ట్ స్టోరీ" అని తన సైటేషన్‌లో ప్రకటించింది స్వీడిష్ అకాడమీ. స్టాక్‌హోంలో డిసెంబర్ 10న జరగనున్న కార్యక్రమంలో ఆమె నోబెల్ బహుమతి మొత్తం 8 మిలియన్ స్వీడిష్ క్రోనర్లు (7.64 కోట్ల రూపాయలు) అందుకోనుంది ఏలిస్.

**తన గురించీ కథల గురించీ ఏలిస్ :**

- కథంటే ప్రయాణం కాదు. గదిలోకి ప్రవేశించటం లాంటిదది. ఆ గది కిటికీల్లోంచి చూసిన లోకం వింతగా కనిపిస్తుంది. గదిలోని ఫర్నిచర్, పరిసరాలు కూడా కొత్తగా వుంటాయి. లోపలికి వెళ్లిన ప్రతిసారీ అదో నూతనానుభవమే.
- సాలెగూడు లాంటి ముడులు, వెలికలు, చిరిగిన కాగితమ్ముక్కలుంటాయి బుర్రలో. అన్నింటినీ జతచేసి కథరాయాలి.
- కథ చదివిన పాఠకుడికి ఒక అద్భుతం అనుభవం లోకి రావాలి ఏం జరుగుతున్నదని కాదు. ఏం జరిగినా అది అద్భుతానుభవమే కావాలి.
- కొన్ని కథలు చదివినప్పుడు తెలిసిన విషయమైనా సరికొత్తగా ఆవిష్కృతమవుతుంది. ఆ నవీన ఆస్వాదన కోసమే రచయిత తపిస్తాడు.
- ఆత్మ కథాత్మకతకూ, స్వానుభవం నుండి రాయటానికీ తేడావుంది. నేను రాసిందంతా ఆత్మ కథాత్మకమనుకుని కొందరు పొరబడుతున్నారు.
- నా పాత్రల గురించి నాకు బాగా తెలుసు. వాళ్లు ఏం దుస్తులు వేసుకుంటారో, ఏ స్కూల్లో చదువుకున్నారో కూడా చెప్పగలను. కథకు ముందరా, కథ తర్వాతా వాళ్లకేం జరిగిందో కూడా నాకు తెలుసు.
- ఈ ఇరవై ఏళ్లుగా నేను యితరుల అవసరాల కోసం బతకని రోజు లేదు. అందువల్ల అనివార్యంగా, ఆ అవసరాల పరిసరాల్లోనే వుంటుంది నా కథా వస్తువు.
- (అమెరికా) దక్షిణ రాష్ట్రాలకు చెందిన రచయితలంటే నా కిష్టం. దీనికి కారణం అక్కడి వాళ్లు ఎక్కువ మంది మహిళలు కావటమే. ఫాక్నర్ నాకంతగా నచ్చదు. యుడోరా వెల్టి; ఫ్లానెరీ ఓ కానర్; కాథరైన్ ఆన్ పోర్టర్; కార్సన్ మాకల్లర్స్ నాకిష్టం.
- మనం దివంగతులైన తల్లి దండ్రుల గురించి ఏమైనా రాయచ్చు కాని ఎదుగుతున్న పిల్లల గురించి అలా రాయలేం గదా. చివరి రోజుల్లో మనల్ని వృద్ధాశ్రమాల్లో చూడ్డానికి వచ్చేది వాళ్లే నాయెమరి.
- మనం కాకుండా, ఇతరులు కూడా అబద్ధాలు చెబుతారని తెలుసు కోవటంలో ఆశ్చర్యమేముంది?
- ఒక అపోహవుంది. ఏ ఇద్దరు స్త్రీ, పురుషులైనా, ఏ వయసు వాళ్లైనా, ఒక గదిలో వుంటే చాలు. ఏదో జరిగిపోయిందనుకుంటారు. కోరికలు రగులుతాయి. విచక్షణ కోల్పోతారు. ఉద్రేకాలు చల్లారిందాకా, ఎవరేం చేస్తున్నారో తెలియదు. ఎదుటి మనుషుల్లో ఏం చూసి యిలాంటి అభిప్రాయాలు ఏర్పరచుకుంటాం మనం.
- నేను డైరీ రాయను. నాకు జ్ఞాపక శక్తి చాలా ఎక్కువ. చాలామంది కన్నా ఎక్కువ సెల్ఫ్ సెంటర్డ్ నేను.
- ఆ వూళ్లో జనం లినోలియం కిచెన్‌లున్న గుహల్లో కాపురాలు చేస్తున్నారు.
- మాటలెందుకు? ముద్దులు మాత్రం సంభాషణ కదా?
- ఎవరు నీకెంత సహాయం చేసినా, మనుషుల నీచత్వాన్ని ఎప్పుడూ తక్కువ అంచనా వెయ్యకు.
- లోకమంతా మనది కాదు. ఎక్కడో ఓ మూల ఏదో జరుగుతుంది. ఆ తర్వాత లోకమంతా తిరిగినా ఆ మూలకూ, మన కథా వున్న సంబంధం మాత్రం ఎప్పుడూ తెగిపోదు.
- పురుషుడు నిష్క్రమిస్తే గదిలో ఏదో వదిలి పోతాడు. స్త్రీ నిష్క్రమిస్తే గది శూన్యమే. చివరికి, జ్ఞాపకాలను కూడా వెంట తీసుకు పోతుంది.
- అంతర్లోకాలలో 'నిధి' నిక్షిప్తం చేసుకున్న వాళ్లు కొందరే. దాన్నెవరూ కొల్లగొట్టకుండా జాగ్రత్త పడాలి.
- సఫలమైనా, విఫలమైనా ప్రేమ జీవితాన్ని మార్చివేస్తుంది.
- నిజమైన ఆనందమంటే కొత్త విషయాలను తెలుసుకోవాలనే కుతూహలమే.
- జీవితం నేను చదివిన కథల్లా డల్‌గా లేదు. డెయిలీ సీరియళ్లలాగ మొనాటనస్‌గా వుంది. తలచు కున్నప్పుడల్లా ఏడుపొస్తుంది.
- కొందరు మాటల్లో గాయపరుస్తారు. మరికొందరు మౌనంతో...
- ఈ లోకంలో సంక్లిష్టం కానిదేదీ లేదు. అన్నీ సంక్లిష్టమే. ఏదీ సులభం కాదు.

ఏలిస్ కూతురు షీలా మన్రో "Lives of Mothers and Daughters : Growing up with Alice Munro" అనబడే స్మృతికావ్యాన్ని 2002లో ప్రచురించింది. ఏలిస్ మన్రో, జీవితాన్ని సాహిత్యాన్ని అర్థం చేసుకోవటానికి ఈ పుస్తకం చాలా ఉపయోగ పడుతుంది.

ముక్తవరం పార్థసారథి
ఫోన్ : 9177618708

# చైనా ప్రయాణం

*గత సంచిక తరువాయి...*

**– ఎమ్. ఆదినారాయణ**

ఈయన్ని ఇలా వదిలి పెడితే మాకు నిద్ర లేకుండా చేసేలాగా ఉన్నాడనుకొని "లియాంద్రో, నేను అలా పొలాల్లో తిరిగి మోనాస్టరీకి వస్తాను" అని చెప్పి మెల్లగా జారుకొని లోయకి అవతలి వైపున ఉన్న దారిలో అడుగులు వేశాను.

యాపిల్ చెట్ల కొమ్మలు మెల్లగా పూల టోపీల్ని పెట్టుకొంటున్నాయి. ఆ చెట్ల మధ్య అలా ముందుకి వెళ్ళే కొద్దీ తేనెటీగలు, పురుగులు కొమ్మల చుట్టూ 'ఝుం' అంటూ రొద పెడుతున్నాయి. లేత గులాబీ రంగులో ఉన్న పీచ్ పువ్వుల గుండెల్లోకి కీటకాలు చొచ్చుకుపోతున్నాయి. మరో పక్కన సీతాకోక చిలుకలు రెపరెపలాడుతూ సుదూర ప్రయాణాలకి సిద్ధం అవుతున్నాయి. వసంత రుతువు రెక్కలు కొట్టుకొంటూ వచ్చి చెట్ల కొమ్మల మీదికి బరువుగా వాలుతున్నట్లు అనిపించింది. సన్నని గాలి మొదలై పరిమళాన్ని, సంగీతాన్ని పెనవేసి నా ముఖానికి రుద్దింది.

మర్నాటి ఉదయం లియాంద్రో అలా సియాన్‌కి వెళ్ళాడో లేదో బైరూబింగ్ కారు మీద వచ్చి, తాను పనిచేస్తున్న 'రాణిగారి సమాధి' వద్దకి తీసుకుపోయాడు. లియాంగ్ షాన్ కొండ మీద ఉన్న ఆ ప్రాంతాన్ని కియాన్‌లింగ్ సమాధి అని పిలుస్తున్నారు. ఇక్కడ నుండి సియాన్‌కి 76 కి.మీ. దూరం. టాంగ్ వంశపు మూడవరాజు గావోజోంగ్ అతని భార్య ఉజెటియాన్ సమాధులు ఇక్కడ ఉన్నాయి. పర్యాటకులు విపరీతంగా వస్తున్నారు. దారి పొడవునా పది అడుగుల ఎత్తులో వున్న రాజులు, గుర్రాల శిల్పాలు చాల శక్తివంతంగా ఉన్నాయి. కోడిగుడ్డు ఆకారంలో మట్టితో చేయబడిన 'జున్' అనే గాలి వాయిద్యంతో పాటలు పాడుతూ యాత్రికుల్ని ఆకర్షిస్తున్నారు వ్యాపారులు. రంధ్రాలు ఉన్న చిన్న మట్టి పిడతాగా ఉండే ఈ 'జున్' చైనా వారికి అతిప్రియమైన ప్రాచీన సంగీత పరికరం. ఒక్కమాటలో చెప్పాలంటే ఇది గోళాకారంలో ఉన్న ఒక పిల్లన గ్రోవి.

అక్కడికి దగ్గరలోనే యువరాణి యోంగ్‌తాయ్ సమాధి కూడా ఉంది. 17 సం॥లకే (క్రీ.శ. 701) మరణించిన ఈమె కోసం భూగర్భంలో నిర్మించిన సమాధి చాలా అందంగా ఉంది. సియాన్‌లో 'దాయంతా పగోడా' కట్టించిన గావోజోంగ్ మనవరాలే ఈమె. హిందూ దేవాలయాల్లోని సన్నని అంతరాళ మార్గం గర్భగుడికి దారి చూపినట్లుగా, ఒక భూగర్భమార్గం యోంగ్‌తాయ్ సమాధికి దారి చూపింది. ఎత్తైన నల్లరాతి పెట్టెలో దాచారు. పాపం! ఆ చిన్నారి మృతదేహాన్ని. గోడల మీద చక్కటి బొమ్మలు వేశారు. ఆ భవన ప్రాంగణంలో ఉన్న 'సిల్కురూట్' మ్యూజియంలో 'ఆసియా - ఐరోపా' దేశాల సంస్కృతిని తెలిపే పురాతన వస్తువుల్ని ప్రదర్శించారు.

ఒక రోజు మధ్యాహ్నం ఇరవై మంది చైనా యాత్రికులు మందిరానికి వచ్చారు. ఎవ్వరికీ 70 సం॥లు వయస్సు తక్కువలేదు. ఆ పదిమంది దంపతులూ ప్రత్యేకంగా ఒక వ్యాను మాట్లాడుకొని షాంగైలో బయలుదేరి బౌద్ధాలయాలు దర్శించుకొంటూ వస్తున్నారు.

"మీ గమ్యస్థానం ఎక్కడో తెలుసుకోవచ్చా?" / "యానాన్"

"లాంగ్ మార్చ్ ముగిసిన ప్రదేశమే కదా!" / "అవును"

"బౌద్ధధర్మానికి యానాన్‌కి సంబంధం లేదనుకుంటాను"

"నిజమే! మా దృష్టిలో సామాన్య మానవులతో కలిసి జీవించిన బుద్ధుడు ఒక తిరుగుబాటుదారుడు, విప్లవకారుడు. అందుకని ఆధునిక చైనా విప్లవాలు పుట్టిన యానాన్‌ని మా గమ్యస్థానంగా చేసుకొన్నాం'' అని వర్ణించారు.

అందరికీ కలిపే భోజనం ఏర్పాట్లు చేశాడు మియావో. పుట్టగొడుగుల పులుసు మరలా ఇన్నాళ్ళకి దొరికింది. మోనాస్టరీలో ఉండటానికి, మూడు పూట్లా భోజనానికి కలిపి రోజుకి 15 యువాన్లు చెల్లించాలి. రెండు రోజుల తరువాత మరల యాత్ర కొనసాగించారు వాళ్ళు.

ఒక సాయంత్రం యాపిల్ పళ్ళ బుట్టతో ప్రత్యక్షమైంది ఒకావిడ. నా వద్దకి వచ్చి "మాది ఈ ఊరే. మీ గురించి చాలా విన్నాను. నా కొక చిన్న పెయింటింగ్ కావాలి" అని అడిగింది. ఆమెకి 30 సంవత్సరాలు ఉంటాయి. ఎరుపుకి

తిరిగిన శరీరఛాయ. తేనె రంగు జుట్టుని చిత్రమైన పద్ధతిలో ముడి వేసుకొంది. "నేను బ్యూటీ పార్లర్‌లో పనిచేస్తున్నాను సియాన్‌లో. వారానికి ఒక్కసారి తియోఫోసికి వచ్చి పోతుంటాను" అని చెప్పింది.

పెయింటింగ్ చేయాలంటే పేపరు కోసం మరలా ఆ హాల్లోకి వెళ్ళాలి. దానికి మియావో పర్మిషన్ కావాలి. ఇదంతా ఎందుకని, నా గదికి తీసుకెళ్ళి నా వద్ద బొమ్మలన్నీ ఆమె చేతికిచ్చి "నీకు నచ్చింది ఒకటి తీసుకో" అన్నాను.

ఆమె అన్నీ వెతికి నేను వేసిన ఒక చిన్న డ్రాయింగ్ తీసుకొంది. ఒక పెద్ద పడవ పక్కన నిలబడి ఉన్న చిన్న పిల్లవాడి బొమ్మ అది.

"ఇన్ని పెద్ద బొమ్మలు ఉండగా ఈ చిన్న డ్రాయింగ్‌నే ఎందుకు కోరుకుంటున్నారు?" అని అడిగాను.

"నాకు కావాల్సింది మీరు వేసిన ఒక బొమ్మ మీ గుర్తుగా ఉంచుకోవటం కోసం. ఈ పేపరు మీద మీ విలువైన కాలం, దృష్టి, ఆలోచన ఈ బొమ్మ రూపంలో ఘనీభవించింది. అందుకే నాకిది కావాలి'' అంటూ నవ్వు ముఖం పెట్టింది.

"మీరు పెయింటింగ్ చదివారా?"

"అవును పరిస్థితుల ప్రభావం వలన ఇలాగా ఉద్యోగం చేయాల్సి వచ్చింది. ప్రస్తుతం నా తమ్ముడు యూనివర్సిటీలో యానిమేషన్‌లో మాస్టర్స్ చేస్తున్నాడు".



రైతు చిత్రం (చైనా)

ఆ చిన్న డ్రాయింగ్‌ని ఆమెకి ఇచ్చి, యాపిల్ బుట్టలో నుండి రెండు ఎర్రటి పళ్ళు నేను తీసుకొని మిగిలిన వాటిని భిక్షువులకి ఇవ్వమని చెప్పాను. నా కోసం ఆమె ఒక పెద్ద యాపిల్ కాయని కోసింది. కబుర్లు చెప్పుకొంటూ ఇద్దరం తినేశాం. నా విజిటింగ్ కార్డు తీసుకొంది. ఒకరికొకరం ఫోటోలు తీసుకొని బై బైలు చెప్పుకొన్నాం.

ఆ మర్నాటి ఉదయం గ్రామంలో దూరంగా పాటలు వినిపిస్తూ ఉంటే అటుగా వెళ్ళాను. అది చైనీస్ పాప్ సంగీతం. పొగమంచు అప్పటికి ఇంకా తగ్గలేదు. తీరా దగ్గరికి వెళ్ళి చూస్తే బజార్లో 50 మంది స్త్రీలు స్టీరియో పెట్టుకొని డాన్సు చేస్తున్నారు. సియాన్‌లో మొదటి రోజు సాయంత్రం చూసిన అందమైన యాంగ్‌గే నృత్యాన్ని మరలా ఇక్కడ కూడా చూడగలిగాను.

లోకల్ స్కూల్లో పనిచేస్తున్న భార్యాభర్తలు పరిచయం అయ్యారు. భార్య ఇంగ్లీషు పాఠాలు చెబుతుంది. భర్త ఆర్ట్ టీచర్. "మిమ్మల్ని మా స్కూలుకి ఆహ్వానిద్దామని ఇలా వచ్చాం" అన్నారు. న్యూ ఇయర్ గ్రీటింగ్‌లు రాసి ఉన్న, ఎర్రటి పొడవైన పేపర్‌ని నా కోసం బహుమతిగా తెచ్చారు. ఇలాంటి ఎర్రరంగు కాగితాలతో ఇంటి ముఖద్వారానికి రెండు పక్కలా అలంకరణ చేయటం చూస్తూనే ఉన్నాను.

వాళ్ళ స్కూల్లో 'Travel and Education' అనే అంశం మీద నేను ఇంగ్లీషు మాట్లాడుతుంటే, ఆమె దాన్ని తన సొంత ఇంగ్లీషులోకి మార్చి పిల్లలకి చెప్పింది.

నా తర్వాత ఆ టీచరమ్మ కూడా మాట్లాడి ఒక చైనా బౌద్ధ భిక్షువు చేసిన భారతదేశ యాత్ర గురించి చెప్పింది. ఇదీ ఆ కథ- హుయాన్‌త్సాంగ్ ఇండియా నుండి బౌద్ధ ధర్మ సూత్రాల్ని తెచ్చిన తరువాత కాలంలో ఒక చైనా యాత్రికుడు ఉత్తర భారతదేశం వెళ్ళి బౌద్ధ పుణ్యక్షేత్రాలను గురించి తెలుసుకొంటున్న సమయంలో అతనికి ఒక పురాతన తాళపత్ర గ్రంథం దొరుకుంది. అది ఒక ప్రముఖ బౌద్ధ సూత్రానికి సంబంధించినది. అలాంటిది ఎవ్వరి వద్దాలేదు. ఎలాగైనా ఆ సూత్రాన్ని తీసుకెళ్ళి తన రాజుకి ఇవ్వాలి అని అతని పట్టుదల. సరిహద్దుల్లో సోదా చేస్తే దొరికిపోతాననే భయం ఉంది. కాబట్టి ఆ చైనా యాత్రికుడు ఆ సూత్రాన్ని రహస్యంగా సిల్కు మీద రాసుకొని చుట్టగా చేసి, తన భుజాన్ని కోసి అక్కడ దాచుకొని, గాయం మానిందాకా జాగ్రత్తగా ఉండి, తరువాత చైనా వెళ్ళి తన రాజుకి అందజేస్తాడు.

అయితే ఆ సిల్కుగుడ్డ అంతా రక్తంతో తడిచి పోవటం వలన అక్షరాలు కనిపించకుండా పోతాయి. తనకోసం అంత కష్టపడి తీసుకొచ్చిన ఆ సూత్రాన్ని చదవలేక పోయినందుకు రాజు ఎంతో బాధపడతాడు. విచారంగా ఉంటున్న తన తండ్రిని చూసిన కుమార్తె అసలు విషయం తెలుసుకొంటుంది. తాను అప్పటికే తల్లిదండ్రుల ఇంట్లో ఒక బిడ్డకు జన్మనిచ్చి రెండు నెలలు దాటి పోతుంది. "నాన్నగారూ, ఈ సమస్యని నేను పరిష్కరిస్తాను" అని చెప్పి ఆ సిల్కు గుడ్డని తీసుకెళ్ళి తన చనుపాలలో నానబెట్టి ఉతికే సరికి, రక్తం మరకలు కరిగిపోయి అక్షరాలన్నీ స్పష్టంగా

కనిపిస్తాయి. దాంతో ఆ చైనా యాత్రికుడి గొప్పతనం అందరికీ తెలిసిపోతుంది.

నా తిరుగు ప్రయాణపు తేదీ దగ్గర పడుతూ ఉంది రెండు వారాలు కళ్ళముందే కరిగిపోయాయి. పింగ్‌లియాంగ్ నుండి ట్రెజోరో ఇక్కడికి వస్తానని చెప్పాడు. ఇంతవరకూ ఉత్తరం కూడా లేదు. ఉదయం లైబ్రరీలో మియావోని కలిసినప్పుడు 'రేపు సాయంత్రానికి ట్రెజోరో వస్తాడనీ, రెండు రోజులు వారితో ఉన్నాక, అక్కడ నుండి నేరుగా సియాన్‌కే నన్ను పంపిస్తాడని' చెప్పాడు మియావో. ఐతే నేను తియోఫోసిలో ఉండేది ఒక్కరోజే నన్నమాట. వెంటనే నేను యవతోంగ్ వద్దకు వెళ్ళి పిల్లలకి యాపిల్స్ ఇచ్చి వాళ్ళని ముద్దుపెట్టుకొన్నాను.

మర్నాటి సాయంత్రానికల్లా ట్రెజోరో వచ్చాడు. అతన్ని చూడగానే చాలా సంతోషం వేసింది. ఆ తరువాత ఒక గంటకల్లా కియాలిస్మో కూడా వచ్చాడు. ఆ తరువాత కాసేపటికి *నాన్‌ఛాంగ్ యూనివర్సిటీ* నుండి ఆర్కో అనే ఇంజనీరింగ్ ప్రొఫెసరు కూడా వచ్చింది. అందరూ కూడబలుక్కొని వచ్చినట్లుగా ఉంది.

అందరికి మియావో మంచి భోజనం, గదులు ఏర్పాటు చేశాడు. మిత్రుల్ని రిసీవ్ చేసుకోవటం అంటే ఆయనకి పండుగే మరి!



చైనా చిత్రం

తెల్లారే సరికల్లా నేను అన్నీ సర్దుకొని సిద్ధంగా ఉన్నాను. ట్రెజోరోతో వాళ్ళ ఊరికి వెళితే అక్కడ కూడా నాకు కొత్త స్నేహితులు ఏర్పడతారు అని సంతోషంగా ఉంది.

అందరూ మియావో గదిలోకి చేరి ప్రపంచాన్ని గురించి పిచ్చాపాటి కబుర్లు సాగించారు. బుద్ధుడి జీవితాన్ని గురించి కాసేపు సీరియస్‌గా మాట్లాడుకొన్నాక వెంటనే టాపిక్ రూటు మారి పూర్వకాలం నాటి చైనా మీదికి వెళ్ళింది.

ఉత్తర ఆసియాలోని సంచార జాతుల వారందరినీ సమైక్యపరచి మంగోలు సామ్రాజ్యాన్ని స్థాపించిన చంఘీజ్‌ఖాన్ (క్రీ.శ. 1162-1227) శక్తిని గురించి, అతని మనుమడు మరియు చైనాలో యువాన్ సామ్రాజ్యాన్ని స్థాపించిన కుబ్లయ్‌ఖాన్ (క్రీ.శ. 1215-1294) పరిపాలనా దక్షత గురించి, అతని ఆస్థానంలో 17 సం॥ల పాటు రాయబారిగా ఉన్న ప్రఖ్యాత ఇటలీ యాత్రికుడు మార్కోపోలో (క్రీ.శ. 1254-1324) తెలివితేటల గురించి అందరం కలిసి కాసేపు మాట్లాడుకొన్నాం.

"రష్యన్ భాష నేర్చుకొంటే ప్రపంచం అంతా తిరగవచ్చనే భ్రమలో ఉండేవారట చైనా వాళ్ళు ఒకప్పుడు" అని ఒకరు చెబుతుంటే, మరొకరేమో "రెండవ ప్రపంచ యుద్ధ సమయం నాటికి చైనా మార్కెట్‌లో మనిషి మాంసం అమ్మేవారని" చెప్పుకుంటున్నారు. నేనేమో వారికి విశాఖపట్నం పరిసరాల్లో ఉన్న బౌద్ధ ధర్మ స్తూపాల గురించి కొన్ని ఫోటోలు చూపించి రెండు పేజీల ఇంగ్లీషు నోట్స్ ఇచ్చాను. 'Love for the life' అనే అంశం మీద మియావో చిన్న ఉపన్యాసం ఇచ్చాడు.

అంతలో మందిరంలోకి ఒక పెద్దాయన వచ్చి "సార్! నేను టెలిఫోను డిపార్టుమెంట్‌లో పనిచేసి రిటైర్ అయ్యాను. సియాన్ నుండి ఇక్కడ వరకూ ఉన్న పాత 'సిల్కు దారి' మొత్తం నాకు తెలుసు. కావాలంటే మీకు చూపిస్తాను" అంటూ మియావో దగ్గరికి వెళ్ళాడు.

"మీ కోసం నేనే ఇతన్ని పిలిపించాను. ఈ అవకాశం మళ్ళీ మనకి దొరకదు. చూద్దాం పదండి!" అని మియావో చెప్పగానే అందరం బయలుదేరాం.

లోయకి ఒక పక్కనున్న తారురోడ్డు మీదుగా సాగిపోయింది మా కారు. మలుపులు తిరుగుతూ పది కిలోమీటర్లు పోయాక 'వాన్ బై' అనే గ్రామంలో ఆగింది. అక్కడ నుండి నడచుకొంటూ రెండు ఫర్లాంగులు వెళ్ళాక పాత సిల్కురూట్ కనిపించింది. బీడుగా మారిపోయిన ఆ మెలికల మార్గం ఒకప్పుడు తూర్పు, పశ్చిమ దేశాల నాగరికతకి వారధి. ఈ మార్గంలో ప్రతి 50 కిలోమీటర్లకి ఏదో ఒక బౌద్ధ విహారం ఉండేది. హుయాన్‌త్సాంగ్ లాంటి బౌద్ధయాత్రికులు ప్రయాణించిన ఈ మార్గంలో మేమందరం నడుస్తూ కాసేపు చరిత్రని స్మరించుకొన్నాం.

హాన్ వంశపు రాజులకాలంలో కనిపెట్టబడిన సిల్కుని ఐరోపా దేశాల వారికి ఎగుమతి చేయటానికి బాటలు అవసరమయ్యాయి. అలాగే చైనాలో వివిధ ప్రాంతాల్లో తయారవుతున్న సిల్కుని వివిధ మార్గాల ద్వారా, ప్రధాన

సిల్కు రూట్లోకి చేర్చేవారు. సియాన్ నగరంలో మొదలైన ఈ దారి మధ్య ఆసియా, పర్షియా, టర్కీల మీదుగా ఐరోపా చేరుకొనేది. సిల్కుని రవాణా చేసిన బాట కాబట్టి దానికి 'సిల్కు రూట్' అనే పేరు వచ్చింది. సియాన్ మొదలు ఐరోపా వరకూ సాగిపోయిన ఈ బాట మొత్తం పొడవు దాదాపు 6500 కిలోమీటర్లు. ఆ సిల్కు రూట్‌కి మన పాటలీపుత్రం (పాట్నా), మచిలీపట్నం కూడా అనుసంధానం చేయబడి ఉన్నాయని తెలుసుకొని ఆశ్చర్యపోయాను.

"సముద్రాల మీద కూడా ఒక సిల్కు రూట్ ఉంది! తెలుసా?" అని అడిగాడు కియాలిస్కో.

"అయ్యా! మీరు అంతర్జాతీయ వ్యాపారస్తులు. మీరు చెపితే తెలుసుకుంటాం" అంటూ ఆర్కో మేడం కోరింది.

"ఆ నౌకా మార్గం చైనా తీరంలోని కాంటన్ ఓడరేవులో బయలుదేరి జావా, మలయా, సిలోన్, అరేబియా చేరుకొని అక్కడ నుండి ఎర్ర సముద్రం ద్వారా ఈజిప్టు వెళ్ళి, ఆ పైన ఉన్న మధ్యధరా సముద్రం ద్వారా ఐరోపాకి చేరిపోయేది" అని వివరించాడు.

సిల్కు ఉత్పత్తిని చైనా వారు చాలా రహస్యంగా కాపాడారు. తద్వారా ఐరోపా వారి ధనం చైనాకి చేరిపోయింది. ఐతే క్రీ.శ. 500 నాటికి ఇదే సిల్కు దారిలో, సిల్కు తయారీ రహస్యం కూడా ప్రయాణించి బయటికి వెళ్ళింది. తర్వాత ప్రతిదేశంలోనూ సిల్కు ఫ్యాక్టరీలు (Sericulture)లు వెలిశాయి.

'వాన్ బై' గ్రామానికి దిగువగా ఉన్న ఒక అద్భుతమైన లోయలో మెలికలు తిరిగిన బాటల మీద ప్రయాణించాం. ఆ మార్గంలో కూడా చాలా యవతోంగ్‌లు ఉన్నాయి. ఒకప్పుడు ఒంటెల బిడారులు ప్రయాణించిన ఆ మార్గంలో ప్రస్తుతం విద్యుత్ కేంద్రాన్ని స్థాపిస్తున్నారు. లోయ అంచులకి వేళ్ళాడుతున్న పీచ్ చెట్ల క్రింద పొడుగు తోక పిట్టలు విహారం చేస్తున్నాయి.




సాయంత్రం మోనాస్టరీకి చేరుకున్నాక మియావో "మన కారుకి 'Time Machine' అని పేరు పెడితే బాగుంటుంది" అన్నాడు.

"ఎందుకూ?" అని ట్రేజోరో అడిగాడు, అది తన కారు కాబట్టి. "ఈ కారు మనందరికీ కొత్త రాతియుగం నాటి యవతోంగ్ గుహల్నీ, మధ్య యుగాల నాటి 'సిల్కు రూట్'ని చూపించి మరల ఆధునిక ఆకాశ హర్మ్యాల ప్రపంచంలోకి తీసుకొచ్చింది కాబట్టి" అని చెప్పగానే 'You are right Master' అంటూ అందరం నవ్వుకొన్నాం.

భోజనాలయ్యాక అందరం బయలుదేరిపోవాలని నిశ్చయించుకొన్నాం. అంతలో స్థవిర భిక్షువు (Grand Monk) వచ్చి "రేపు ఉదయం వరకూ ఆగండి. మీకు ధ్యానం గురించి ఉపన్యాసం ఇవ్వదలిచాను" అని చెప్పగానే, అలసిపోయిన మా శరీరాలకి అవకాశం దొరికి నిద్ర లోయల్లోకి దొర్లిపోయాం. వేకువ జామునే నాలుగు గంటలకి లేచి అందరం నూడిల్ సూప్ తాగాం. వెంటనే ఆ చలిలోనే అవలోకితేశ్వర విగ్రహం ముందు మా చేత పద్మాసనాలు వేయించి ధ్యానం మీద ఉపన్యాసం ఇచ్చాడు స్థవిర భిక్షువు. ఈయన వయస్సు 50 సం॥లు ఉంటుంది. 40 సం॥ల నుండి ఆయన ఇక్కడే ఉంటున్నాడు. కాబట్టే చిన్న వయసులోనే స్థవిర భిక్షువు పదవి లభించింది.

"బుద్ధుని విగ్రహం చుట్టూ నడుస్తూ కూడా ధ్యానం చేయవచ్చు" అంటూ మా అందరి చేతా నడిపిస్తున్నప్పుడు, నేను 'భ్రమణకాంక్ష'లో రాసిన "ఈ నడకంతా నా ధ్యానంలో ఒక భాగం" అనే వాక్యం గుర్తుకొచ్చింది. "భోజనం చేసిన ప్రతిసారీ, 99 అడుగులు నడిస్తే 99 సంవత్సరాలు జీవించవచ్చు" అని కూడా చెప్పాడు.

"నిర్వాణం అంటే ఏమిటో తెలుసుకోవాలని ఉంది" అని అడిగాను నేను.

"మెదడులో పెరిగే దురాశ, ద్వేషం, భ్రాంతి అనే కలుపు మొక్కల్ని నాశనం చేసి వాటి స్థానంలో ఔదార్యం, ప్రేమ, జ్ఞానం అనే మంచి మొక్కల్ని నాటు కోవాలని తెలుసుకోవటమే నిర్వాణం" అని చాలా స్పష్టంగా వివరించాడు. నాకు చాలా ఆనందం వేసింది. నేను ఒక బుద్ధా పెయింటింగ్ అతనికి బహుమతిగా ఇస్తూ 'A Gift from India' అని చెప్పాను. అందరం బయలు దేరాం. మా చుట్టూతా చేరిన భిక్షువులందరికీ నమస్కారాలు

తెలియజేశాను. అవలోకితేశ్వర ఆరామం ముందు ఊగుతున్న వెదురు పొదలకి, పాడుతున్న పిట్టలకి "నేను మళ్ళీ వస్తాను" అని చెప్పటానికి నా భాషా పాండిత్యం సరిపోలేదు.

"నీ కోసం సియాన్‌లో ఎదురు చూస్తుంటాను" అని కియాలిస్కో 'బైబై' చెప్పాడు. "మా ఊరికి కూడా మీరు రావాలి" అంటూ ఆర్కో మేడమ్ ఆహ్వానించింది. నేను ట్రెజోరో కారులో కూర్చోబోయే ముందుగా మియావో నా కోసం ప్రత్యేకంగా ఒక యాపిల్ ఇచ్చి "దీని పేరు చెప్పండి చూద్దాం" అన్నాడు.

"యాపిల్ పండే కదా!" అన్నాను.

"కాదు, సరిగా చూడండి!" అనగానే ఆ పండు మీద 'ఫు' (బుద్ధా) అనే చైనీస్ అక్షరాల్ని గుర్తుపట్టగలిగాను.

అందరికీ మరొకసారి నమస్కరించి 'సాయేజేన్' (మరలా వస్తాను) చెప్పి ట్రెజోరో కారులో బయలుదేరాను. రెండు వారాల పాటు ఎంతో ఆనందంగా గడిపిన ఆ ప్రదేశాన్ని వదలక తప్పలేదు.

మొదటగా చేరాలనుకొన్న చోటుకి, చివర్లో అయినా వెళ్ళగలుగుతున్నందుకు ఆనందంగానే ఉంది. దారికి రెండు వైపులా ఎత్తైన కొండలు. ఎక్కడ చూచినా వ్యవసాయమే. ఆ కొండల అంచుల్లో ప్రతిరైతూ ఒక యవతోంగ్ తవ్వుకొని, తల్లి కడుపులో ఉన్నంత హాయిగా నివసిస్తున్నాడు.

"ట్రెజోరో సార్, ఈ దారి కూడా సిల్క్ రూట్‌లో ఒక భాగం అనుకొంటాను?" నేను అడిగాను.

"అవును, హుయాన్‌త్సాంగ్ ఇండియాకి బయలు దేరినప్పుడు ఇదే దారిలో నడిచి, తన మొదటి పెద్ద మజిలీ అయిన 'లాంగ్‌జవ్' కి చేరుకొన్నాడని చరిత్ర చెబుతుంది".

చైనా దుఃఖదాయనిగా ప్రసిద్ధి చెందిన 'హోయాంగ్ హో' నది ఈ ప్రాంతం గుండానే ప్రవహిస్తుంది. ఆ నది నీళ్ళు పసుపు రంగులో ఉండటం వలన దీనికి 'Yellow River' అనే పేరు కూడా ఉంది. "పాత రోజుల్లో నది వరదల కారణంగా ఎంతో నష్టం జరిగిపోతూ ఉండేది. ఇప్పుడు ఈ నది మీద బ్యారేజ్‌లు నిర్మాణం చేయటం వలన దాని పేరు 'చైనా ఆనందదాయని'గా మారింది" అని గర్వంగా చెబుతున్నాడు ట్రెజోరో. రెండు గంటల కారు ప్రయాణం తరువాత పింగ్‌లియాంగ్ చేరుకొన్నాను. ఇది 'గున్‌సు' ప్రావిన్సులో ఉన్న చిన్న టౌను.



చైనాలో బజారు

ట్రెజోరో అపార్టుమెంట్‌లో ఆయన భార్య, కొడుకు నాకు స్వాగతం పలికారు. ట్రెజోరో భార్య తాను వేసిన పెయింటింగ్స్‌తోనే గదులన్నీ అలంకరించింది. ఆమె లోకల్ స్కూల్‌లో ఆర్ట్ టీచర్. కొడుకు హైస్కూల్లో చదువుతున్నాడు.

నేను స్నానం చేసి చాలా రోజులైంది అని కనిపెట్టిన ట్రెజోరో నా కోసం ప్రత్యేకంగా వేడి నీళ్ళు ఏర్పాటు చేశాడు. ఆరుగంటలకి భోంచేసి అందరం ఒకేసారి బయటికి నడిచాం. కింద పార్కులో జరుగుతున్న 'కొరియన్ గంగ్‌నామ్' డాన్సు క్లాసులకి ట్రెజోరో కొడుకు పరుగులు తీశాడు; గుర్రం మాదిరిగా ఎగురుకొంటూ. ట్రెజోరో భార్య కమ్యూనిటీ డాన్సు (యూంగ్‌గే) ప్లేస్‌లో మాకు 'బై' చెప్పింది. మేమిద్దరం అలా బజారుకి బయలు దేరాం. రెండు వారాలపాటు గ్రామంలో ఉండి ఈ టౌనుకి రాగానే నాలో కొత్త శక్తి వచ్చింది. టౌను చిన్నదే అయినా అన్నీ పెద్ద భవనాలే.

పాత పుస్తకాల షాపులో చైనా చిత్రకారుడు కిబైషి 'Qi Baishi' జీవిత చరిత్ర దొరికింది.

మర్నాటి ఉదయం పది గంటలకల్లా మేమిద్దరం ట్రెజోరో సొంత గ్రామంలో ఉన్నాం. దారి పొడవునా కొండలు, యాపిల్ తోటలు, యవతోంగ్‌లు దర్శన మిచ్చాయి. అద్భుతమైన మార్గం.

"మనం ఇప్పుడు మా అమ్మగారి సమాధి వద్దకి వెళ్ళాలి" అంటూ పొలాల్లో నిర్మించిన ఆమె సమాధివద్దకి తీసుకుపోయాడు. ఆమె బ్రతికి ఉంటే రెండు వారాల క్రితమే నేను ఈ గ్రామానికి వచ్చేవాడిని. అయితే అక్కడ సిలువ గుర్తువేసి ఉండటం నాకు వింతగా అనిపించింది. "ఆమె చిన్నతనాన్నే క్రైస్తవమతంలో చేరిపోయింది. అందుకే ఇలా చేశాం" అని చెప్పాడు ట్రెజోరో. నిజానికి చైనాలో

బౌద్ధధర్మంతో పాటుగా ఇతరమతాల వారు కూడా మిలియన్ల సంఖ్యలో ఉన్నారు.

తిరగి వచ్చేదారిలో నన్ను 'యాపిల్ కోపరేటివ్ సొసైటీ' ఆఫీసుకి తీసుకెళ్ళి కొంతమంది సభ్యులకి పరిచయం చేశాడు. వందలకొద్దీ స్త్రీలు పనిచేస్తున్నారు అక్కడ. యాపిల్ గ్రేడింగ్ యంత్రాలు యాపిల్ బరువుని, సైజుని బట్టి వేరు చేస్తున్నాయి. రంగుని మాత్రం చూడలేకపోతున్నాయి. సొసైటీ వారు యాపిల్ కార్మికుల కోసం డూప్లెక్స్ భవనాలు చాలా అందంగా నిర్మించారు. ఆ స్త్రీలకి ఇచ్చే రోజు కూలి 50 యువాన్లలో కొంత డబ్బుని డిపాజిట్ చేసుకొనటం ద్వారా ఇది సాధ్యమయిందని తెలిసింది.

పింగ్‌లియాంగ్ టౌన్‌లోని కాల్లిగ్రఫీ షాపులోకి వెళ్ళాను. 'కిబైషి' చిత్రాల కాపీలు అమ్ముతున్నారు. అక్కడ ఒక 'రైతు చిత్రకారుడు' పరిచయమై 'మనం బొమ్మలు మారకం చేసుకొందామా?' అని చాల వినయంగా అడిగాడు.

"అలాంటి దేమీ అక్కరలేదు. మీ చిత్రాలు చాలా విలువైనవి. నా పెయింటింగ్ ఒకటి మీకు బహుమతిగా ఇస్తాను" అంటూ ఆ షాపులోనే అతనికి రెండు బొమ్మలు వేసి పెట్టాను. పనిలో పనిగా ఆ షాపు యజమాని కూడా నా చేత రెండు బొమ్మలు వేయించుకున్నాడు. అయితే ఆ ఫార్మర్ పెయింటర్ నా రుణం ఉంచుకోకుండా పదినిమిషాల్లో నా portrait వేసి ఇచ్చాడు. అదొక కళాఖండం.

ఆ సాయంత్రానికి జింగ్ అనే 40 సం॥ల వయసు గల లోకల్ కవితో పరిచయమైంది. "నాకు రవీంద్రనాథ్ టాగూర్ అంటే చాలా ఇష్టం" అంటూ తాను ముద్రించిన చైనీస్ కవితల పుస్తకాన్ని చూపించాడు.

నాకోసం రెండు కవితలు వినిపించాడు.

**"నది మీద ఈదులాడే / బాతులకి బాగా తెలుసు**
**గ్రీష్మం నిద్ర లేచిందని" / జీవితం పొగమంచు లాంటిది,**
**కాస్త పొద్దెక్కగానే / కరిగి మట్టిలో కలిసిపోతుంది".**

అవి నాకు చాలా బాగా నచ్చాయి. "మీరు కూడా రెండు కవితలు వినిపించండి" అని కోరగానే నేనూ చెప్పాను.

**"చీకట్లో / ఒంటరిగా ప్రయాణమయ్యాను**
**తోడుకోసం వచ్చింది చందమామ" / "కొండల మీద కట్టిన**
**కోటలు కూడా భయపడుతుంటాయి**
**పది పచ్చగడ్డి పరకలు కనిపించగానే"**

"సార్!" అయితే మనం మాట్లాడు కోవాల్సింది ఇక్కడ కాదు" అంటూ ఒక పెద్ద హోటల్‌కి తీసుకెళ్ళాడు. Samsung Note Book ని మెనూ కార్డుగా ఉపయోగిస్తున్నారు అక్కడ ఉన్న వెయిటర్లు. ఒక టేబుల్ వద్ద మేమిద్దరం సెటిల్ కాగానే ఒక అమ్మాయి వచ్చి "సార్! మీతో ఒక ఫోటో తీయించుకుంటాను" అంటూ చాలా వినయంగా అడిగింది నన్ను. నా భుజం మీద చేయివేసి కూర్చొంది. ఫోటో తీయించుకొంది. షేయ్ షేయ్ (Thank you) అంటూ వెళ్ళిపోయింది. ఆ తర్వాత మేమిద్దరం చాలా సేపు కవితలు, కథలు చెప్పుకొన్నాం.

బయటికి వచ్చేటప్పుడు జింగ్ అడిగాడు. "నువ్వు స్వీడన్ నుండి ఏదో తీసుకొచ్చానన్నావు కదా! ఏమిటది?"

"బాల్టిక్ సముద్రతీరం నుండి రెండు బుజ్జిరాళ్ళు తెచ్చాను" అని చెప్పాను.

పెద్దగా నవ్వి "నీ కంటె పెద్ద పిచ్చివాడు ఎవరూ లేరనుకొంటున్నావా? మా దేశంలో చాలామంది ఉన్నారు. మిఫూ (క్రీ.శ. 1051-1107) అనే చిత్రకారుడు సెలయేటిలోని రాళ్ళు ఎరుకొచ్చి 'ఇవి నా సోదరులు' అని చెప్పటమే కాకుండా అప్పుడప్పుడూ వాటితో మాట్లాడే వాడట! తెలుసా?" అని చెప్పాడు జింగ్. మర్నాటి ఉదయం ఊరి బయట ఉన్న కొండమీదకి వెళ్ళి 'జివాంగ్‌ము' బౌద్ధ ఆరామాన్ని చూశాం. దీన్ని టాంగ్ వంశం వారు క్రీ.శ. 110 సం॥లో నిర్మించారు.

ఇదే కొండమీద టావో మతానికి చెందిన మరో ఆలయం కూడా ఉంది. దాని పేరు స్వాన్‌కింగ్. మందిరం లోపలి గోడలకి అద్భుతమైన చిత్రాలున్నాయి. మందిరంలో ప్రతిష్ఠించిన మూడు భారీ విగ్రహాలని 'Heavenly Gods of Taoism' అని పిలుస్తున్నారు. అక్కడ ఉంటున్న భిక్షువు పసుపు రంగు కాగితం మీద తాను రాసిన కవితల్ని మాకు చూపిస్తున్నాడు. కొండని రాసుకొంటూ సాగిపోయిన 'జింగే' నది, ఎండిపోయి సిగ్గుపడుతూ ఇసుక పైటతో ముఖాన్ని కప్పుకొంది. ఈ టౌన్‌లో నేను చూసిన ఒక గొప్ప బౌద్ధ ఆరామాన్ని 'దాయున్‌సి'. 95 మీటర్ల ఎత్తులో ఉన్న ఈ ఏడు అంతస్థుల పగోడా పరిసరాలకి అందాన్ని చేకూర్చింది. 1960వ సం॥లో బయటపడిన కొన్ని పురాతన బౌద్ధ స్తూపాలని ఆధారం చేసుకొని ఈ కొత్త స్తూపాన్ని నిర్మించారు. దాయున్‌సి అంటే 'మహామేఘం' (The Great Cloud) అని అర్థం వస్తుంది. స్తూపం లోపలి గదుల్లో

999 బంగారు పోతపోసిన విగ్రహాలున్నాయి. ఏడవ అంతస్తు వరకూ యాత్రికుల్ని లిఫ్ట్‌లో తీసుకెళుతున్నారు. ఆలయం, దాని ప్రాంగణం, అక్కడ ఉన్న ప్రతి కట్టడం కూడా ముదురు లక్కరంగులో ఉండటం దాని ప్రత్యేకత.

తియోఫోసి నుండి నేను తీసుకొచ్చిన బహుమతులు బరువై పోగా, వాటిని ట్రెజోరో కొడుక్కి ఇచ్చి, బదులుగా ఒక తేలికైన పుస్తకాన్ని తీసుకొన్నాను. దాని పేరు *Ancient Chinese Ideologists* దానిలో కన్‌ఫూజియస్, మెన్సియస్, లావోజు, చువాంగ్‌జు, మోజి, సుంజి అనే ఆరుగురు చైనా తత్త్వవేత్తల గురించి వ్యాసాలు ఉన్నాయి. ట్రెజోరోకి కృతజ్ఞతలు చెప్పి బస్ మీద సియాన్‌కి బయలు దేరాను. బాగా పూతకొచ్చిన, పీచ్, యాపిల్ తోటల మధ్యగా సాగింది ప్రయాణం. కియాలిస్మో ఆఫీసులో నా కోసం లియాండ్రో ఎదురు చూస్తున్నాడు. నేను సియాన్‌లో ఉండేది సరిగ్గా రెండు రోజులు మాత్రమే. ఈ రోజు, రేపు, ఎల్లుండి ఉదయమే తిరుగు ప్రయాణం.

'The great wild goose Pagoda' ని చూడాలని బయలు దేరాను. లియాండ్రోని తీసుకొని. ఆ ఏడు అంతస్థుల పగోడాకి చేరుకొనే ముఖద్వారంలోనే 10 అడుగుల ఎత్తున్న హుయాన్‌త్సాంగ్ విగ్రహాన్ని దర్శనం చేసుకొన్నాను. ప్రపంచం అంతా తెలిసిన పేరు. 14 సంవత్సరాల పాటు యాత్రలు చేసిన గొప్ప వ్యక్తి. బౌద్ధ ధర్మ పరివ్రాజకుడిగా, పండితుడిగా, ఇక్కడే తన శేష జీవితాన్ని గడిపాడు హుయాన్‌త్సాంగ్. ఆ మహాయాత్రికుడి పాదాలకి నమస్కరించి పరమానందం పొందాను.

తాను భారతదేశం నుండి తెచ్చిన బౌద్ధ ధర్మ సూత్రాల్ని 50 మంది పండితుల సహాయంతో చైనా భాషలోకి అనువాదం చేసిన ప్రదేశం ఇది. తన అనుభవాల్ని కూడా ప్రత్యేకంగా సీ-యూ-కీ *('Buddhist Records of the Western World')* అనే పేరుతో పుస్తకంగా రాశాడు. ఆ గ్రంథాల్ని సాధికారికంగా ఇంగ్లీషులోకి అనువాదం చేసిన ఆంగ్ల పండితుడు శామ్యూల్ బీల్ (1825-1889).

హుయాన్‌త్సాంగ్ చాలా చిన్నవయసులోనే *అభిధర్మకోశం, మహాయాన సంగ్రహం* లాంటి బౌద్ధ ధర్మ గ్రంథాల్ని అధ్యయనం చేశాడు. ఆ పరిస్థితుల్లో *యోగాచార భూమి సూత్ర* అనే ముఖ్యమైన మౌలిక ప్రతికోసం అతని అన్వేషణ మొదలైంది. భవబంధాల నుండి సంపూర్ణ స్వేచ్ఛను ప్రసాదించే జ్ఞాన మార్గానికి సంబంధించిన ఆ గ్రంథం కోసం చేసిన ప్రయాణాల్లోనే హుయాన్‌త్సాంగ్‌కి పరిపూర్ణ జ్ఞానోదయం కలిగి ఉంటుందని నా విశ్వాసం.

తన కంటే ముందుగా భారతదేశంలో ప్రయాణం చేసిన ఫాహియాన్ (క్రీ.శ. 337-422) భారతదేశం నుండి చైనాకు వచ్చిన కుమారజీవ, బోధిధర్ముడు లాంటి మహా పండితుల ప్రయాణాలు హుయాన్‌త్సాంగ్‌కి ఎంతో ఆత్మబలాన్ని ఇచ్చి ఉంటాయి. చక్రవర్తి అశోకుడు (క్రీ.పూ. 304-232) తర్వాత బౌద్ధ ధర్మానికి ప్రపంచ వ్యాప్త గుర్తింపు తీసుకొచ్చిన ఏకైక వ్యక్తి హుయాన్‌త్సాంగ్. బౌద్ధధర్మం దాదాపుగా క్షీణించిన దశలో ఆయన ఇండియాకి వచ్చి గొప్ప గ్రంథాల్ని సేకరించగలిగాడు. అంతటి అమూల్యమైన గ్రంథాల్ని కాపాడటానికే ఈ మహా పగోడా నిర్మించబడింది.

హుయాన్‌త్సాంగ్ సంచరించిన ఈ అద్భుతమైన పగోడా పరిసరాల్లో నడుస్తూ ఉంటే, నేను కూడా ప్రపంచం అంతటా ప్రయాణాలు చేసి *భూభ్రమణ కాంక్ష* అనే పుస్తకాన్ని రాయాలని అనుకొన్నాను.

"సార్, మీ కోసం నేను చాలా ఫోటోలు తీశాను కాబట్టి, నా కోసం మీరు ఒక చిన్న బొమ్మ వేసి ఇవ్వాలి" అంటూ పట్టు పట్టాడు లియాండ్రో.

చిన్న పేపరు మీద స్కెచ్ పెన్నుతో 'సముద్రం మీద సాగిపోతున్న తెరచాప పడవ' బొమ్మ వేసి ఇచ్చాను.

"Indo - Brazil స్నేహం కోసం, ఈ బొమ్మ పక్కన మీ కవిత లేకుండా ఎలాగా?"

**"సంసారం ఒక సాగరం / ఆ నీటి మీద నడవలేవు**
**ఈత కొట్టి దాటలేవు / జ్ఞానం అనే పడవతోనే ప్రయాణం చెయ్యగలవు"**

అనే కవిత రాసి లియాండ్రోకి ఇచ్చి "రేపు మనం హుసియాన్ టౌన్‌లో ఉన్న రైతు చిత్రకారుల్ని కలిసేందుకు వెళదాం. 'అతే అమాన్‌హా' (See You Tomorrow) అని చెప్పి చైనీస్ రంగులు, బ్రష్‌లు, పేపర్లు కొనడానికి సియాన్ సిటీవాల్ సెంటర్‌కి బయలు దేరాను.

మూడు వారాల నుండి కొనసాగుతున్న, నా చైనా సౌందర్య స్వప్న యాత్ర రేపటి రాత్రి వరకూ మేలుకొనే ఉంటుంది. మి

డాక్టర్ ఎమ్. ఆదినారాయణ
ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్నం.
ఫోన్ : 9849883570

# అశ్రుగీతి
# జయశంకర ప్రసాద్ (ఆఁసూ)

**- కోడూరు పుల్లారెడ్డి**

ఆధునిక హిందీ ఛాయావాద కవిత్వాన్ని సుసంపన్నం చేసిన కవులలో జయశంకర ప్రసాద్‌ది అగ్రస్థానం. తొంభై శాతం ప్రఖ్యాత హిందీ సాహిత్యకారులెవ్వరూ తమ ఆత్మకథలను వ్రాయలేదు. అందుకు జయశంకర ప్రసాద్ కూడా అపవాదు కాదు. ఆ కారణంగా హిందీసాహిత్య చరిత్రకారులు ఆయన జీవితాన్ని వివిధ కోణాల్లో పరిశీలించి ఒక నిర్ణయానికి వచ్చి గ్రంథస్థం చేయటం జరిగింది. ఆయన క్రీ.శ. 1889లో కాశీలోని 'గోవర్ధన సరాయ్' వీధిలో ఒక ధనిక కన్యాకుబ్జ హల్వా వైశ్య కుటుంబంలో జన్మించాడు. ఆయన పూర్వీకులు 'జౌన్‌పూర్'లో వుండేవారని కొందరు, కాదు 'కాన్‌పూర్'లో వుండేవారని మరికొందరు చెబుతారు. కాని వారు 'గాజిపూర్' జిల్లాలో 'సైదుపూర్' గ్రామవాసులన్న వాదన బలంగా వినిపిస్తూ ఉంది. అక్కడి నుండి వారు చైనాతో వ్యాపారం చేసేవారని ప్రతీతి. ఆ వ్యాపారంలో నష్టం రావటం వల్ల ఆ కుటుంబ మూలపురుషుడు 'జగన్ సాహు' సైదుపూర్ వదలిపెట్టి బనారస్‌లో స్థిర నివాసం ఏర్పరచుకొన్నాడు. ఆయనకు ఇద్దరు కుమారులు 'గణపతి సాహు', 'గురుసహాయ సాహు'. గణపతి సాహుకు కుమారుడు ఒక్కడే - శివరత్న సాహు. శివరత్న సాహుకు ఆరుగురు సంతానం. అందులో దేవీప్రసాద్ ఒకడు. ఈ దేవీ ప్రసాద్‌కు ఇద్దరు కుమారులు - 'శంభూరత్న', 'జయశంకర ప్రసాద్'. ముగ్గురు కుమార్తెలు - దేవకి, సేవకి, ప్యారీ.

జయశంకర ప్రసాద్ అందరికంటే చిన్నవాడు కావటం వల్ల ఆయన బాల్యం ప్రేమానురాగభరితమై వైభవోపేతంగా గడిచింది. ఆయన బాల్యావస్థ దాటి యౌవనదశలో అడుగుపెట్టకముందే తల్లిని కోల్పోయాడు. మరో రెండేళ్ళ తర్వాత దుకాణాన్ని నిర్వహించే - తానెంతో ప్రేమించే - అన్న శంభూరత్న అకాల మరణం (1906) ప్రసాద్‌కు గొడ్డలిపెట్టు అయింది. 17 సం॥ల లేత వయస్సులో వ్యాపారపర్యవేక్షణ, గృహావసరాలు తీర్చటం మొదలైనవి ప్రసాద్ ప్రధాన బాధ్యతలయ్యాయి.

ప్రసాద్ తన 20 ఏళ్ళ వయస్సులో ప్రథమవివాహం చేసికొన్నాడు. వధువు గోరఖ్‌పూర్ నివాసి. పది సంవత్సరాల వివాహబంధం తర్వాత ఆమె నిస్సంతుగ మరణించింది. ఒక సంవత్సరం తర్వాత ప్రసాద్ ద్వితీయవివాహం చేసుకొన్నాడు. సంవత్సరం జరిగీ జరగకనే భార్య ప్రసవ సమయంలో కన్నుమూసింది. పుట్టిన మగబిడ్డ కూడా తల్లిబాటనే పయనమయ్యాడు. మూడు నాలుగేళ్ళ తర్వాత 'గోరఖ్‌పూర్ నివాసి' యే అయిన దేవరియాను తృతీయ వివాహం చేసికొన్నాడు. ఈమె వల్ల ప్రసాద్‌కు ఒకే ఒక సంతానం - రత్నశంకర్ - కలిగాడు.

బాధామయ జీవితం వెళ్ళబుచ్చుతున్న జయశంకర ప్రసాద్ ఎప్పుడో గాని బయటి ప్రదేశాలకు వెళ్ళేవాడు కాదు. 10 సంవత్సరాల వయస్సులో కాశీలోని 'క్వీన్స్ కాలేజి'లో చేరటానికి వెళ్ళాడు. మరొకసారి 11 సంవత్సరాల వయస్సులో తల్లివెంట థార్, ఓంకార్, ఉజ్జయిని, పుష్కర్, జైపూర్, బ్రజ్, అయోధ్యలకు తీర్థయాత్రకు వెళ్ళాడు. ఆ ప్రయాణంలో ఆయన మనస్సులో మనోహరమైన ప్రకృతి దృశ్యాల యెడల మోహవిభ్రాంతి దృఢంగా చోటుచేసుకొంది. ద్వితీయకళత్రం గతించినపుడు ఆమె కర్మకాండలు నిర్వర్తించటానికి గయకు వెళ్ళి అక్కడి నుండి మహోదధి, భువనేశ్వర్, జగన్నాథ్‌పూర్లను దర్శించుకొన్నాడు.

ప్రసాద్‌కు బిడియం, సంకోచం, వినయం పాళ్ళు ఎక్కువ. ఆయన జనసమూహం ఎక్కువగా వున్న చోట్లకు, ఉత్సవాలకు, సభాసమావేశాలకు దూరంగా వుండేవాడు. అసలు ఆయన తన కవితలను ఏ సాహితీ సమావేశంలోను ఒక్కసారి కూడ చదవలేదు. ఆనాటి ఏ హిందీసాహిత్యసంస్థ కూడా ఆయనను అధ్యక్షునిగా ఎన్నుకోలేదు. క్రీ.శ. 1906లో అన్నగారు మృతి చెందినది మొదలు 30 సం॥ల వరకు

ఆయన 'సుంఘని సాహు' వీధిలోని తమ దుకాణాన్ని సద్వర్తనతో నిర్వహించటం, గృహవ్యవహారాలు సక్రమంగా నిర్వర్తించటం తన ప్రథమ కర్తవ్యంగా భావించేవాడు. మిగిలిన సమయమంతా సాహితీసృజనం చేసేవాడు. ఈ రెండింటితో ఆయన జీవితమంతా ముడిపడి ఉండేది. పగలంతా దుకాణంలో గడిచిపోయేది. అందువల్ల ఆయన సాహితీసృష్టి చాలాభాగం రాత్రి పొద్దుపోయినంతవరకు జరుగుతూ ఉండేది. ప్రసాద్‌కు జీవితాంతం అన్నగారు చేసిన అప్పులు తీర్చటం, కుటుంబ ఆర్థికస్థితిని సరిచేయటంతోనే సరిపోయింది. ఋణశేషం వుండగానే ఆయనను అనారోగ్యం వరించింది.

క్రీ.శ. 1936లో ప్రసాద్ ఒకరోజు మోతీచంద్ తమ్ముడు నారాయణచంద్ వివాహవిందుకు వెళ్ళాడు. అక్కడ నుండి వచ్చిన తర్వాత ఆయనకు జలుబుచేసి జ్వరం వచ్చింది. చాలా రోజుల వరకు అది మలేరియా జ్వరం అని అపోహపడ్డారు. చలికాలం వచ్చేసరికి ప్రసాద్‌కు విపరీతమైన దగ్గు మొదలైంది. రోగ నిర్ధారణ సరిగా చేయలేకపోయారు. కడుపునొప్పి కూడా దానికి తోడైంది. అందువల్ల ఆయన ఆహారం తీసుకోవటం కూడా తగ్గించాడు, బలహీన పడ్డాడు. క్రీ.శ. 1936 చలికాలంలో లక్నోలో ఒక ఎక్జిబిషన్ చూడటానికి వెళ్ళాడు ప్రసాద్. ఇదే ఆయన ఆఖరి సారిగా కాశీనుండి బయటకు వెళ్ళటం. అక్కడినుండి వచ్చిన వెంటనే మళ్ళీ ఆయన జ్వరపీడితుడయ్యాడు. ఈసారి ఆయన కఫాన్ని పరీక్షించి జబ్బు 'క్షయ' అని నిర్ధారించారు.

క్రీ.శ. 1937 ప్రారంభంలో ఆయన ఆరోగ్యం కొంచెం నెమ్మదనిపించినా వర్షాకాలంలో జబ్బు మళ్ళీ తిరగబెట్టింది. నాలుకమీద పుండ్లు లేచాయి. డాక్టర్లు స్థల మార్పిడి అవసరమన్నారు. కాని ప్రసాద్ కాశీ వదలిపోవటానికి ఒప్పుకోలేదు. అంత అనారోగ్యస్థితిలో కూడా కుమారునికి వివాహంచేయ సంకల్పించాడు. ఆ సంకల్పం ఫలించకుండానే ఆయన్ను చర్మరోగం కూడా బాధించటం మొదలుపెట్టింది. ఈ జబ్బులన్నిటితో ఆయన ఎముకల గూడయ్యాడు. అప్పుడాయన 'హోమియోపతి' మందులు వాడేవాడట. ఆ మందులు కూడా ఆయనకు ఆరోగ్యం చేకూర్చలేక పోయాయి. క్రీ.శ. 1937 కార్తీక శుక్ల ఏకాదశినాడు ఆయన ప్రాణాలు అనంత వాయువుల్లో లీనమై పోయాయి. ఆ రాత్రి 8.00 గం॥లకు బయలుదేరిన ఆయన శవదహనయాత్రకు 30, 40 మందికంటే వెంటలేరు. కాశీలోని హరిశ్చంద్రఘాట్ వద్ద ఆయనకు అంతిమ సంస్కారం జరిగింది. 48 సంవత్సరాల చిన్న వయస్సులో ఆయన చనిపోవటం వల్ల హిందీ సాహిత్యాభివృద్ధికి కలిగిన నష్టం అపారం.

**విద్యా వ్యాసంగం :** ప్రప్రథమంగా ప్రసాద్ గోవర్ధన సరాయ్ వీధిలో 'మోహినీలాల్ గుప్త' ప్రయివేటు పాఠశాలలో చేరాడు. అక్కడే ఆయన అక్షరజ్ఞానం సంపాదించాడు. తర్వాత క్వీన్స్ కాలేజిలో చేరి 7వ తరగతి వరకు చదివాడు. మిగతా చదువంతా ఇంటి దగ్గరే. 'దీనబంధు' బ్రహ్మచారి ప్రసాద్‌కు సంస్కృతం నేర్పించాడు. 'బేణి', 'శివదా' రచనలు వ్రజభాషలో తండ్రి వినిపించాడు. ప్రసాద్ ఇంటికి చేరువలో కొందరు కాయస్త కుటుంబీకులు వుండేవారు. వారిద్వారా ఉర్దూ, పారసీ కవిత్వాలు ఆస్వాదించి పరవశించేవాడు. 'ఆంసూ' కవితలపై వాటి ప్రభావం మెండుగా వుంది.

**సాహిత్యవాతావరణం :** ప్రసాద్ తన దగ్గరకు వచ్చే విద్వాంసుల పరిచయంతోను, పుస్తకపఠనంతోను ప్రాచీన ఇతిహాసం, పురాతత్వజ్ఞానం గ్రహించాడు. ప్రసాద్ మిత్రమండలి చాలా విస్తృతం. అయినప్పటికీ ఆయనకు ఆత్మీయ మిత్రులంటూ ఎవరూ లేరు. ఏకాకిగా, నిస్సంగిగా వుండేవాడు. ఆయన దుకాణానికి రాయకృష్ణదాస్ (ఈయన ప్రసాద్ జ్ఞాపకాలు వ్రాశాడు), వినోద శంకర్ వ్యాస్ (ఈయన తన 'అంధేరా-ఉజాలా'లో ప్రసాద్ గురించి అంత బాగా వ్రాయలేదు), కేదారనాథ పాఠక్, లక్ష్మీనారాయణసింహ్ 'ఈష్' (వీరిద్దరూ ప్రసాద్ సహ విద్యార్థులు) మొదలైనవారు నిత్యం వస్తుండేవారు. ఈ మిత్ర మండలి రోజూ కొబ్బరి కాయల దుకాణం ఎదురుగా ఉన్న అరుగుమీద గుమిగూడేవారు.

అప్పుడప్పుడు ప్రసాద్ కాశీలోని ప్రముఖ పుస్తక ప్రచురణ సంస్థ 'నాగరీ ప్రచారిణీసభ'కు వెళ్ళేవాడు. ఆ రోజుల్లో అక్కడ కూడా విద్వాంసులు బహుళ సంఖ్యలో కలిసేవారు. డా॥ శ్యామసుందర దాస్, డా॥ రామచంద్ర శుక్ల్, లాలాభగవాన్‌దాస్, అయోధ్యాసింహ ఉపాధ్యాయ్ 'హరిఔధ్', గ్రంథాలయాధ్యక్షుడు కేదారనాథ పాఠక్ వారిలో ముఖ్యులు. వీరంతా ఆనాటి కవిప్రముఖులు. చాలామంది పత్రకారులు, పత్రికా సంపాదకులు కాశీకివస్తే ప్రసాద్‌ను కలవకుండా వెళ్ళేవారు కారు. 'మత్‌వాలా' పత్రికా సంపాదకుడు 'ఉగ్ర్', 'మాధురి' పత్రికాసంపాదకుడు రూప నారాయణ పాండేయ్ (ఈయన భారతదేశంలోనే గొప్ప బెంగాలీ నాటకకర్త అయిన

ద్విజేంద్రలాల్‌రాయ్ నాటకాలన్నింటినీ హిందీలోకి రసరమ్యంగా అనువదించాడు). అలహాబాదుకు చెందిన రామనాథ్ 'సుమన్', వాచస్పతి 'పాఠక్', రామ్‌వృక్ష బేనీపురి, బీహార్‌కు చెందిన శివపూజన 'సహాయ్', జనార్ధన ప్రసాద్‌ఝా 'ద్విజ్' మొదలైనవారు తమతమ రచనలను ఒకరికొకరు వినిపించుకొని కావ్యశాస్త్ర వినోదం ఎంతో సహృదయ వాతావరణంలో జరుపుకొనేవారు.

ప్రసాద్ కవితా ప్రస్థానం 1917-37ల మధ్యకాలం మాత్రమే. అంటే గట్టిగా ఇరవయ్యేళ్ళు. అప్పుడు 'సరస్వతి', 'ఇందు', 'సుధ', 'మాధురి', 'విశాలభారత్', 'హంస్' మొదలైన సాహిత్య పత్రికలు వెలువడేవి. విశాలభారత్ సంపాదకుడు బనారస్‌దాస్ చతుర్వేది, సుధ సంపాదకుడు దులారేలాల్ భార్గవ్ ప్రసాద్‌కు విరోధులు. అందువల్ల ప్రసాద్ రచనలేవీ ఆ రెండు పత్రికల్లో ప్రచురింపబడేవి కావు. ప్రేమ్‌చంద్ మాత్రం ప్రసాద్ చేత ఒక పద్యరూపకమైన ఆత్మకథ వ్రాయించి 'హంస్' ఆత్మకథలతో ఒక ప్రత్యేకసంచిక ప్రచురించాడు. అసలు 'హంస్' పత్రికకు నామకరణం చేసింది జయశంకర్ ప్రసాదే. అయినా వీరిద్దరి విచారధార, భాష, శైలి భిన్నంగా వుంటాయి.

**వ్యక్తిత్వం - స్వభావం :** ప్రసాద్ శరీరచ్ఛాయ మంచి గౌర వర్ణం. ముఖంలో సౌజన్యం, కోమలత్వం, గాంభీర్యం, వినయం చెప్పకనే తొంగిచూస్తూ వుండేవి. చిన్నతనం నుండి కసరత్తు, కుస్తీలంటే ఇష్టపడేవాడు. దండేలు, బస్కీలు తీసేవాడు. నిరంతరం ముఖంలో చిరునవ్వు ప్రకాశిస్తుండేది. కిశోరావస్థలో షేర్వానీ, పాజామా ధరించేవాడు. ఆకుపచ్చని, ఎర్రని రత్నాలు కుట్టిన తలపాగ ధరించేవాడు. యౌవన దశలో పీతాంబరం, దానికి తగ్గ పంచెకట్టు, మెడలో పూమాల, ఫాలభాగాన శైవ చిహ్నమైన విభూతి రేఖలు ధరించేవాడు. మొదట్లో ఆయన శాంతిపురిధోవతి, మల్లుచొక్కా ధరించేవాడు. అప్పుడప్పుడు ఖద్దరు కూడా ధరించేవాడు. చలికాలంలో ఉన్ని చొక్కా ధరించి పైన కోటు వేసుకొనేవాడు. కళ్ళజోడు ధరించి బెత్తం చేత్తో పట్టుకొని హుందాగా నడిచివెళ్ళేవాడు. సామాన్య జీవితం గడపాలన్నది ఆయన ఆశయం.

సాహిత్యం ఆయన ప్రవృత్తి. అది ఆయన జీవిక కాదు. కాబట్టి అది ఆయన జీవితంలో ప్రథమ స్థానం ఆక్రమించుకోలేక పోయింది. ఆయన అత్యంత ధర్మాత్ముడు. శివరాత్రినాడు ఉపవాసం వుండి తన ఇంటి ఆవరణలోని శివమందిరంలో పూజానుష్ఠానం చేసేవాడు. ఆయన ముఖంలో క్రోధచ్ఛాయలెవరూ చూడలేదు. ఆయన ఏనాడూ, ఎక్కడకూడా తన ఆలోచనా సరళిని బహిర్గతం చేసేవాడు కాదు. తనపై వచ్చే నిందా ప్రవాహమంతా గరళకంఠునివలె మ్రింగేవాడు. ఎవరైనా తన ఆలోచనలకు ప్రతివాదం చేస్తే ఇలా అనేవాడు - "వాళ్ళ ఇష్టమొచ్చినట్లు వ్రాసుకోనివ్వండి. నేను మాత్రం వాళ్ళకు ప్రతికూల సమాధానమివ్వను. మిమ్ములను కూడా వారి వ్రాతలకు వ్యతిరేకంగా వ్రాయనివ్వను." ప్రసాద్ వ్యక్తిగత జీవితం గురించి లభ్యమైన వివరాలు చాలా తక్కువ. ఆయన కాపురముండే వీధిలో పొరుగిండ్లపైన ఆడిపాడే నాట్య కత్తెలుండేవారు. వారిలో చాలామంది ఆయన దుకాణంకు వచ్చేవారే అయి వుండవచ్చు. వారి ద్వారా కూడా కావలసిన వివరాలు లభించలేదు. నశ్యం, జరదాలు విక్రయించే ఈ శివకవి 'పాన్' తప్పకుండా నమిలేవాడు. కానీ మిగతా అన్ని బనారసీ అవగుణాలకు దూరంగా వుండేవాడు. సిద్ధేశ్వరీదేవి సంగీతమంటే ఆయనకు ప్రాణం. ఆమె ఆయన ఇంట్లోని శివమందిరానికి ప్రతి శివరాత్రి వచ్చి భక్తిగీతాలు ఆలపించేది. ప్రసాద్‌ను ఆదరంతో స్నేహంగా గుర్తు చేసుకుంటుండేదని శాంతిప్రియ్ ద్వివేది చెప్పేవారు.

ఆనాటి అన్ని ఘరానాలకు చెందిన ఠుమ్రీ, దాద్రా గాయనీమణులలో శ్రీమతి సిద్ధేశ్వరీదేవి స్థానం సుస్థిరం. క్రీ.శ.1964లో కథక్ సమ్రాట్ శంభుమహరాజ్ తన ప్రియ శిష్యురాలు రీతాగంగూలీని సంగీతంలో నిష్ణాతురాలిగా చేయ్యాలని సిద్ధేశ్వరీదేవి శిష్యురాలిగా చేశాడు. రీతా ఆమెవద్ద ఠుమ్రీలు, దాద్రాలు చక్కగా పాడడంలో మెలుకువలు, సంగీతశాస్త్ర రహస్యాలు తన కఠిన సాధన ద్వారా గ్రహించింది. సిద్ధేశ్వరీదేవి దగ్గర ఆమె చనువు 'అమ్మా' అనేటంతవరకు వెళ్ళింది. నాలుగేళ్ళ తరువాత వివాహం చేసుకొని తన స్వస్థానం లక్నోకు వెళ్ళవలసి వచ్చింది. అక్కడ రీతా, బేగం అక్తర్‌ను ఆశ్రయించి ఆమె క్రీ.శ.1974లో చనిపోయేటంత వరకు శిష్యరికం చేసి గజళ్ళు పాడడంలో నిష్ణాతై మళ్ళీ అమ్మనే ఆశ్రయించింది.

రీతా తన సంగీత సభలలో వినయపూర్వకంగా అంటూ ఉండేది-నా గురువులను విన్నవారికి నా ఠుమ్రీలు, గజళ్ళు నచ్చవు. అయినా అక్కడక్కడా నా గళంలో సిద్ధేశ్వరీదేవి స్వరాలు, బేగం అక్తర్ గమకాలు పలికినపుడు ఆశీర్వాద పూర్వక అభినందనలు అందుకుంటాను. పోతే భారతరత్న

ఎం.ఎస్. సుబ్బులక్ష్మి "తను సిద్ధేశ్వరీదేవి వద్ద ఠుమ్రీ గాయనం, ఆమె చెప్పే ఒక్కొక్క తాన్‌ను 108సార్లు సాధన చేసి నేర్చుకొన్నానని" ఒక సందర్భంలో చెప్పింది.

సిద్ధేశ్వరీదేవి కూతురు శ్రీమతి సరితాదేవి కూడా ఠుమ్రీలు, దాద్రాలు చక్కగా పాడుతుంది.

ప్రసాద్ ఎంతమంది సామాజికులతో కలసి మెలసి ఉన్నప్పటికీ ఏకాంత సాహిత్యారాధనలో నిమగ్నమై వుండటం ఆయన ప్రత్యేకత. సరళస్వభావుడు, శాంతికాముకుడు, సౌందర్యారాధకుడు, ఏకాంతసేవకుడు, సరసకవితోపాసకుడు అయిన ప్రసాద్ అచ్చమైన 'విశ్వనరుడు'. ఇటువంటి అద్భుత కవిని గురించి ఇతర గ్రంథాలలో చాలా తక్కువగా వ్రాయబడడం హిందీసాహిత్యానికి పట్టిన దురదృష్టం.

జయశంకర ప్రసాద్ మొదట్లో 'కళాధర్' అనే కలం పేరుతో వ్రజభాషలో రచనలు చేసేవాడు. అలా కలంపేరుతో రచనలు ఎందుకు చేయవలసి వచ్చిందో, ఆయన కొడుకు రత్నశంకర్ తన తండ్రి మరణం తర్వాత వివరించాడు. దేవీప్రసాద్‌కు ఇద్దరు కొడుకులు - శంభూరత్న, జయశంకర ప్రసాద్ - అని ముందు చెప్పుకొన్నాము. తన పెద్దకొడుకు ఇంటి వ్యవహారాలు చూసుకోవాలనీ, చిన్నకొడుకు తనకు ఇష్టమైన చదువు కొనసాగించాలనీ కోరాడు. కానీ పరిస్థితుల ప్రభావం వల్ల ఆయన అనుకొన్న విధంగా జరగలేదు. పెద్దకొడుకు కోర్టు, ఇతర వ్యవహారాలు చూసుకోవటంతోనే సరిపోయింది. ఆ కారణంగా జయశంకర ప్రసాద్ క్వీన్స్ కాలేజిలో చదువు చాలించి ఇంటిపనులు, దుకాణం వ్యవహారాలు చూసుకోవలసి వచ్చింది. దుకాణంలోనే సాహిత్యాధ్యయనం చేసేవాడు. జయశంకర ప్రసాద్ దుకాణం వ్యవహారాలపై శ్రద్ధ చూపించటం లేదు, ఏమిటో వ్రాసుకుంటుంటాడు, దుకాణానికి వచ్చిన వారికి అప్పుడప్పుడు కవితాధోరణిలో జవాబిస్తుంటాడని వారి కుటుంబ మిత్రులు అన్నకు ఫిర్యాదు చేశారు. ఇది విన్న శంభూరత్నకు మనస్సు చివుక్కుమంది. వ్యాపారసరళిలో కావ్య, శాస్త్ర వినోదం ఏ వైశ్యునికైనా సర్వనాశకహేతువని శంభూరత్న నిశ్చితాభిప్రాయం. అందువల్ల తమ్ముని హెచ్చరించమని తన భార్యతో చెప్పాడు. ప్రసాద్‌కు అన్న అంటే అపారమైన భక్తి ప్రపత్తులు. అప్పుడు 'కళాధర్' పేరుతో వ్రజభాషలో వ్రాసిన కవితలన్నీ కట్టకట్టి ఇంటి అటకపై ఎక్కడో మూలన పడేశాడు. అవి దాదాపు 400 కవితలుండవచ్చు. ఆ తర్వాత ఆయన కుమారుడు రత్నశంకర్ కాలంనాటికి ఆరు రచనలు - *ఊర్వశి చంపు, ప్రేమ్‌రాజ్య్, ప్రేమ్‌పథిక్, విసర్జన్, చిత్రాధర్, కానన్ కుసుమ్* మాత్రమే మిగిలాయి. మిగిలినవన్నీ చెదలు పట్టి ఎందుకూ కొరగాకుండా పోయాయి. శిథిలం కాకుండా మిగిలిన ఆ కవితల్ని రత్నశంకర్ తండ్రి మరణానంతరం ప్రచురించాడు.

ఛాయావాద కవితకు జయశంకర్ ప్రసాద్ ఆద్యుడంటారు. క్రీ.శ. 1915-18ల మధ్యకాలంలో వచ్చిన హిందీకావ్యధారను 'ఛాయావాదం' పేరుతో పిలవటం మొదలైంది. ఈ పేరు ఎవరు, దేని ఆధారంగా పేర్కొన్నారో ఇంతవరకు ఇదమిత్థంగా తెలియరాలేదు. బహుశః శ్రీముకుట్‌ధార్ పాండేయ్ ఛాయావాద కవితలో గల అస్పష్టత కారణంగా వ్యంగ్యంగా 'ఛాయావాదం' అని పేరు పెట్టాడంటారు. కాలక్రమాన ఈ పేరే స్థిరమై బహుళ ప్రచారం పొందింది.

'ఛాయావాదం' భారతీయదృష్టి, అనుభూతి, అనుకున్నది తెలియజెప్పే పద్ధతిపైన ఆధారపడి ఉంటుంది. ధ్వన్యాత్మకత, లాక్షణికత, శృంగారవర్ణనతో బాటు స్వానుభూతికి వ్యతిరేక భావాలు ఛాయావాద కవితలో గల విశేషాంశాలు.

ఛాయావాద కవిత్వం గురించి జయశంకర ప్రసాద్ ఇలా అంటాడు. 'హిందీ కవితాక్షేత్రంలో ఏ పౌరాణిక ఘటనైనా లేక దేశ, విదేశ సుందరీమణుల బాహ్యావర్ణనను స్వానుభావాధారంగా అభివ్యక్తీకరించటాన్ని హిందీసాహిత్యంలో 'ఛాయావాదం' పేరుతో పిలుస్తారు. రీతికాలం (హిందీ సాహిత్యయుగ విభజనలోని ఒక భాగం : క్రీ.శ. 1643-1843) లో ప్రసిద్ధిచెందిన సాహిత్యంలో కమనీయ కావ్యభావనకు ప్రాధాన్యంగల కవితల్లో వివిధ ప్రత్యేక భావాలను సంప్రదాయబద్ధతకు వ్యతిరేకంగా వర్ణించారు. ఈ నవ్యభావాలు అంతరంగాన్ని స్పృశించి పాఠకుల మనస్సులను రంజింపజేసాయి'.

'ఆఁసూ' కావ్యం చదివిన ఏ రసహృదయమైనా ప్రేయసిరూపం, ప్రియసమాగమం, పరస్పరహర్షోన్మాదం అనుభవించి తీరుతుంది. అందువల్ల ఈ విరహాశ్రువులకు కారణం ఎవరో ప్రేయసి ప్రేమనిరాకరణేనని విదిత మవుతుంది. కాని కవి ఈ రచనతో ఆత్మాశ్రయం కోసం పరమాత్మ చెంత దుఃఖం వెళ్ళబోసుకుంటున్నాడు అనటం అసంగతమవుతుంది. ప్రసాద్ ఒక స్వజాతి సుందరిని ప్రేమించాడు. తర్వాత ఆమె చిరుత ప్రాయంలోనే

చనిపోయింది. ఈ విషయాన్ని ప్రసాద్ మిత్రుడు విశ్వంభరనాథ్ 'జిజ్జా' చెప్పారు. కృష్ణప్రసాద్‌గౌడ్ 'భేథన్' కూడా యీ విషయాన్ని ధృవీకరించారు. ఆయన ఆత్మీయుడు వినోద శంకర్ 'వ్యాస్' తన సంస్మరణలో ఒకచోట ఇలా వ్రాస్తాడు. "ప్రసాద్ తరుణ వయస్సులో ఒక ప్రేమ సంఘటన జరిగింది. దాన్ని గురించి నాకు తర్వాత తెలిసింది. క్రీ.శ. 1936 మార్చి 13న ఆయన్నడిగాను. మీ జీవితంలో గుప్తంగా నిలిచిపోయిన ప్రేమాఘాతం ఉందన్నది కాదనలేని సత్యం. ఇన్ని రోజులైనా మీరు నాకు మీ అజ్ఞాత ప్రేయసి ఎవరైనదీ చెప్పలేదు. ఈ ప్రశ్నకు ఆయనిచ్చిన జవాబుతో మళ్ళీ ఎన్నడూ నేను ఆ విషయం ఆయనతో ప్రస్తావించలేదు". రామనాథ 'సుమన్' ఇలా అంటాడు. "ప్రసాద్ 'ఆఁసూ' కావ్యం వ్రాసే కాలంలోనే అందులోని చాలా ఛందోపద్యాలు వినటం తటస్థించింది. అప్పుడన్నాను - మీ మనస్సులో చోటు చేసికొని ఒక ప్రేయసి వుండేదనేది దాచినా దాగని సత్యం. దానికి ప్రసాద్ నవ్వి ఊరకున్నాడు." దీనివల్ల అవగతమయ్యేదేమంటే - 'ఆఁసూ' కావ్యనాయిక అతిలోకసుందరి. ఆ విఫల ప్రేమానుభూతితో కవి ప్రసాద్ నిరంతర బాష్పధారను 'ఆఁసూ' కావ్యంలో ప్రవహింపజేశాడు.

'ఆఁసూ' కావ్యనాయిక జయశంకర ప్రసాద్ మొదటి భార్య అని కొందరు హిందీసాహిత్యకారులు అంటారు. ఆయన క్రీ.శ. 1909లో అనగా తన 20 ఏళ్ళ వయసులో ప్రథమ వివాహం చేసుకున్నారు. పదిసంవత్సరాల దాంపత్యజీవితం తర్వాత ఆమె నిస్సంతుగ మరణించిందని చెప్పుకున్నాము. 'ఆఁసూ' కావ్యం క్రీ.శ. 1925లో 126 గీతాలతో ప్రథమ ముద్రణ పొందింది. అనగా మొదటి భార్య గతించిన తర్వాతే 'ఆఁసూ' రచించాడని అర్థమవుతూఉంది. తర్వాత క్రీ.శ. 1933లో 190 గీతాలతో రెండవ ముద్రణ పొందింది. తన భార్యావియోగం భరించలేని విరహవేదనతో 'ఆఁసూ' కావ్యం వ్రాసినవాడు ఆమె తిరస్కారాన్ని కూడా చిత్రించడం విచిత్రం. పైగా ఆమె మరణించిన సంవత్సరానికే రెండవపెళ్ళి చేసుకోవడం కూడ గమనార్హం. ఏతావాతా చెప్పవచ్చేదేమంటే 'ఆఁసూ' కావ్యనాయిక ఆయన మొదటి భార్య అని చెప్పడానికి ఆ కావ్యం ఆమె మరణించిన తర్వాత వ్రాసినదన్న ఒకే ఒక్క కారణం తప్ప మరొకటి కానరాదు. కాబట్టి 'ఆఁసూ' కావ్యనాయిక జయశంకర ప్రసాద్ మొదటి భార్య కాదంటారు విజ్ఞులు.

జయశంకర ప్రసాద్ తన ఆఁసూ కావ్యంలో ప్రేమికుల సంయోగం చిత్రించినా వియోగవర్ణనే తలమునకలుగ చేశాడు. ఐనా ఇది విప్రలంభ శృంగార కావ్యం క్రిందికి రాదు-భగ్న శృంగార కవిత అనవచ్చు. కవికలయికను ఆకాశం-వెన్నెల, విరహాన్ని సముద్రం, అంధకారాల ప్రతీకలతో ప్రతిభావంతంగ అలరించాడు. ఈ కావ్యం సమకాలీన హిందీసాహిత్యంపైన, రాబోయే తరంపై కూడ ఛాయావాద ప్రభావాన్ని ప్రసాదించింది.

జయశంకర ప్రసాద్ తన హృదయంలో ఘనీభూత వ్యథను పాఠకుని మనస్సు తొలిచివేసేటట్టు వ్యక్తం చేయడంలో సఫలీకృతుడైనాడు కాని తన మనఃక్లేశం నుండి బయట పడలేకపోయాడు. సమస్త ప్రపంచానికి, కరుణ, పరస్పరప్రేమ అవసరమని సూచిస్తుందీ కావ్యం. ఐనా ఈ కావ్యం పూర్తి కావ్యగుణాలను సంతరించుకున్నదనిపించదు.

జయశంకర ప్రసాద్ హిందీ, ఉర్దూ, సంస్కృత సాహిత్యాలలోని సంప్రదాయాలను జీర్ణించుకొని- 'ఆఁసూ' రచనతో సరిక్రొత్త కావ్య కళానిర్మాణ చతురుడని గుర్తింపు పొందాడు. నవ్య భావజాలం/పునరుజ్జీవనం (Renaissance) కాలంలో జన్మించిన ఆంగ్ల కవుల రచనలలో 'ఛాయావాదం' పోకడలు బహుళంగ దర్శనమిస్తాయి. 'ఆఁసూ' కావ్య విశ్లేషణ చేసే ముందుగ వాటిని సూక్ష్మంగా 'ఆఁసూ' కావ్యంలోని 'ఛాయావాదం'తో పోల్చిచూద్దాం.

1. విలియం షేక్స్పియరు (William Shakespeare) - క్రీ.శ. 1564-1616

i. 'I weep for thee and yet no cause I have,
for thou left'st me nothing in thy will,
And yet thou left'st me more than I did crave,
For why I craved nothing of thee still.'

*- The Passionate pilgrim*

'నీ కోసం దుఃఖిస్తున్నాను. అయినను అందుకు నాకు కారణం లేదు. ఎందుకంటే నీవు నన్ను వదలిపెట్టడం నీకిష్టం లేదు. అయినప్పటికి నేనెంత బ్రతిమాలినా నీవు నన్ను వదలిపెట్టావు. నేనింకా నిన్నెందుకు వేడుకుంటున్నానో తెలియదు'.

**ఉదా॥ 'ఇస్ వికల్ వేదనా కో లే, కిస్‌నే సుఖ్ కో లల్‌కారా
యహ్ ఏక్ అబోధ్ అకించన్, బేసుధ్ చైతన్య్ హమారా,'**

- *'ఆఁసూ' 11*

(బోధకందని దైన్యంలో, స్మారకంలేని చేతనావస్థలో వికలవేదననుభవించే వారెవరైనా సుఖాన్ని కోరరు.)

**విశేషం :** వియోగావస్థలో కూడా సంయోగాన్ని తలబోస్తూ గడిచిపోయిన బాధను చిత్రిస్తున్నాడు కవి.

ii. 'Among the many that mine eyes have seen,
Not one whose flame my heart so much as warmed,
Or my affection put to th' smallest teen
Or any of my leisures ever charmed.'

*- A lover's complaint*

'నా కళ్ళు ఎందరినో వీక్షించాయి. కాని ఏ ఒక్కరి వెలుగు నా హృదయాన్ని నీయంత పులకరింప చేయలేదు. నా వాత్సల్యానురాగానికి చాల చిన్న స్పందన కూడ కలిగించలేక పోవడమేగాక, నా తీరిక సమయాలను కూడ ఎప్పుడూ ఉత్తేజపూరితం చేయలేదు.'

Note : ఇక్కడ, విలపించేది నాయిక, 'ఆఁసూ'లోని విరహతాపం నాయకునిది.

ఉదా : **'చుంబన్ అంకిత్ ప్రాచీ కా, పీలా కపోల్ దిఖ్‌లాతా**
**మైఁ కోరీ ఆంఖ్ నిరఖ్‌తా, పథ్, ప్రాత్ సమయ్ సో జాతా।'**

*- 'ఆఁసూ' 68*

(తూర్పుదిశ తన లేతపసుపు పచ్చని చెక్కిళ్ళపై సూర్యబింబం చుంబనగుర్తులు చూపిస్తూ వుంటే నేను అసంతృప్త కళ్ళతో వీక్షిస్తూ ఉషోదయంలో నిద్రపోతున్నాను.)

**విశేషం :** ప్రియురాలు తన దరిచేరుతుందని ఎదురుచూస్తూ రాత్రంతా మేలుకొని అసంతృప్తికి గురియై సూర్యోదయంలో నిద్రపోతున్నానంటున్నాడు కవి.

iii. ' I love to hear her speak, yet well I know
That music hath a far more pleasing sound:
I grant I never saw a goddes go
My mistress when she walks treads on the ground'

*- The sonnets*

'ఆమె మాట్లాడితే వినడం నాకు ప్రియం. అయినా సంగీతంలో రసరమ్యమైన శ్రావ్యత ఉందని నాకు బాగా తెలుసు. నా ప్రేయసి భూమి మీద తిరిగే పదధ్వని వల్ల నేనెప్పుడూ దేవత నడిచివెళ్ళడం చూడలేదనుకోను.'

ఉదా: **'బిజ్‌లీ - మాలా పహ్‌నే ఫిర్, ముస్కాతా సా ఆంగన్ మేఁ**
**హాఁ, కౌన్ బరస్ జాతా థా, రస్ - బూంద్ హమారే మన్ మేఁ।'**

*- 'ఆఁసూ' 25*

(మెఱపు మాలికలా చిరునవ్వు చిలకరిస్తూ నా హృదిలో అనురాగ రసబిందువుల నొలకించిందెవరు చెప్మా!)

**విశేషం :** ప్రియురాలు దూరమైందన్న బాధలో కూడ ఆమె మళ్ళీ తన దరికి వస్తుందన్న ఆశాభావంతో ఉన్నాడు కవి.

2. పి.బి. షెల్లీ (P.B. Shelly) - క్రీ.శ. 1792-1822
'We look before and after, And pine for what is not
Our sincerest laughter, With some pain is fraught;
Our sweetest songs are those that tell of saddest thought.'

*- To a skylark*

'ముందు వెనుకలు చూచి మనము లేని దానికై వంత చెందుతాము. అరమరికలు లేని మన నవ్వుకు కొంచెమైన వేదన చెల్లిస్తాము. సుధామధుర గేయాలన్నీ వ్యథాభరిత గాథలే.'

ఉదా : **'విస్మృతి హై, మాదక్‌తా హై, మూర్ఛనా భరీ హై మన్ మేఁ।'**

*- 'ఆఁసూ' 61*

(విస్మృతి, ఉన్మాదం, తెలివితప్పడం ఈ మనస్సులో నిండివున్నాయి.)

**విశేషం :** ప్రియురాలు తనకు దూరమైన తర్వాత తన దీనావస్థను వెల్లడిస్తున్నాడు కవి.

**'వేదనా మధుర్ హో జావే, మేరీ నిర్దయ్ తన్మయతా।'** *- 'ఆఁసూ' 162*

(నాలో జనించిన యీ నిర్దయ, తన్మయత్వవేదన మధురమగు గాక.)

**విశేషం :** బాధామయ ప్రేమైక భావనను ఉదాత్తీకరిస్తున్నాడు కవి.

3. జాన్ కీట్స్ (John Keats) - క్రీ.శ. 1795-1821
'Ay, in the very temple of Delight
Veil'd Melancholy has her sovran shrine.'

*- Ode on Melancholy*

'అవును, ఆనందానికి నిలయమైన దేవాలయంలో కూడ, అరచాటు వేదన రాజసాన్ని చూపిస్తుంది.'

ఉదా : **'జ్యోఁ జ్యోఁ ఉల్‌ఝన్ బఢ్‌తీ థీ, బస్ శాంతి విహఁస్‌తీ బైఠీ**
**ఉస్ బంధన్ మేఁ సుఖ్ బంధ్‌తా, కరుణా రహ్‌తీ థీ ఐంఠీ।'**

*- 'ఆఁసూ' 52*

(ఏ క్షణమైతే కష్టాలు అనంతమయ్యాయో శాంతి దూరమైంది. (శాంతినవ్వుతుంది). సుఖం ఈ బంధంలో చిక్కుకున్నపుడు సానుభూతి దూరమైంది (కరుణ అలిగింది).

**విశేషం :** గాఢ ప్రేమానుబంధంలో కష్టాలకడలిని ఎదుర్కొనడం తప్పనిసరి. శాంతి, కరుణ రసానుభూతులు కూడ కరువవుతాయని వాపోతున్నాడు కవి.

4. హెచ్. డబ్ల్యు. లాంగ్‌ఫెలో (H.W. Longfellow) - క్రీ.శ. 1807-1882
'When she was good, She was very, very good,
But when she was bad, she was horrid.'

*- House life of Longfellow*

'మంచిగా ఉన్నప్పుడు ఆమె మరీ, మరీ మంచిది. చెడుగా ప్రవర్తిస్తే ఆమె దౌష్ట్యానికి పరాకాష్ట.'

ఉదా : **'మణి-దీప్ లియే నిజ్ కర్ మేఁ, పథ్ దిఖ్‌లానే కో ఆయే।'**

*- 'ఆఁసూ' 83*

(మణిమయ దీపం నీచేత నిడుకొని నాకు దారి చూపడానికి వచ్చావు.)

**విశేషం :** ప్రియురాలు తనకోసం వచ్చిందని పరవశుడవుతున్నాడు కవి.

**'అంతర్ కే తార్ ఖించే థే, తీఖీ థీ తాన్ హమారీ।'** - 'ఆఁసూ' 22

(నాలోని తంత్రులను మీటితే నా తీవ్రబాధ (సంగీతం) తెలుస్తుంది.)

**విశేషం :** కవి తీవ్ర మనోవేదనకీ పదం ప్రతిరూపం

5. రాబర్ట్ బర్న్స్ (Robert Burns) - క్రీ.శ. 1759-1796

'To see her, And love but her forever,
For Nature made her what she is, And never made another!' *– Bonnie Lesley*

'ఆమెను చూడడమంటే ప్రేమించడమే. ఆ ప్రేమ ఎప్పటికీ నిలిచేదే. ఎందుకంటే ప్రకృతి ఆమెను అలా తీర్చిదిద్దింది. అట్లా మరెవరిని సృష్టించలేదు కూడా.'

ఉదా : **'పహలే దేఖా జబ్ తుమ్‌కో' - 'తుమ్ లగే ఉసీ క్షణ్ హమ్‌కో।'**

*- 'ఆఁసూ' 29*

(మొదటిసారి నిన్ను వీక్షించినపుడే నీవు నన్ను ఆకర్షించావు.)

**విశేషం :** 'Love at first sight' అంటే ఇదేనేమో!

**'లావణ్య్ - శైల్ రాఈ-సా, జిస్ పర్ వారీ బలిహారీ
ఉస్ కమనీయ్‌తా కలా కీ, సుషమా థీ ప్యారీ-ప్యారీ।'** - *'ఆఁసూ' 38*

(ఆ లావణ్యరాశి ముందు సౌందర్య పర్వతం ఆవగింజకు కొరగాదు. ఆమె కమనీయ కళాశోభ ఎంతో ప్రియంగా ఉంటుంది.)

**విశేషం :** బాధాతప్తుడైన కవి ఆమె భువనైక సౌందర్యాన్ని మరచిపోలేకున్నాడు.

6. హడ్‌సన్ (H.N. Hudson, Critic)

'This is the poetry in which the poet goes down into himself and finds his inspiration and his subjects in his own experiences, thoughts and feelings.'

'కవి తన అంతరంగంలోనికి ప్రవేశించి తన ప్రేరణను, స్వానుభవంలోని పాత్రలను, అనుభవాలను, ఆలోచనలను, విశ్వాసాలను గుర్తించినపుడే అది కవిత్వం అనిపిస్తుంది.'

**విశేషం :** 'ఆఁసూ' కావ్యంలో పై నిర్వచనం దాదాపు ప్రతి పద్యంలోను గోచరిస్తుంది.

7. ఆల్‌ఫ్రెడ్ ఆస్టిన్ (Alfred Austin, Critic)

'No verse which is unmusical or obscure can be regarded as poetry whatever other qualities it may possess.'

'సంగీతాత్మకం కానిది లేక అస్పష్టంగా ఉన్న ఏ కవిత్వమైనా - అది విశిష్టగుణ సంపన్నమైనా - కవిత్వంగా పరిగణించబడదు.'

**విశేషం :** 'ఆఁసూ' కావ్యమంతటా సంగీతాత్మకతలేని లేక స్పష్టతలేని కవితలు దాదాపు లేవనవచ్చు.

ఉదా : **'ఛిల్-ఛిల్ కర్ ఛాలే ఫోడే, మల్-మల్ కర్ మృదుల్ చరణ్ సే
ధుల్-ధుల్ కర్ బహ్ రహ్ జాతే, ఆఁసూ కరుణా కే కణ్ సే।'**

*- 'ఆఁసూ' 10*

(నా మెత్తని పాదాలలో రాపిడివల్ల కలిగిన బొబ్బలు చిదిమి గాయాలు చేశారు. నా కళ్ళ నుండి ప్రవహించే కరుణాశ్రుధార ఆ గాయాలను కడిగివేస్తూ వుంది.)

**విశేషం :** i. ప్రియురాలి నిష్టుర ప్రవర్తనవల్ల కవి హృదయవేదన తీవ్రమై కన్నీరు చిందుతూ వుంది.

ii. ఛిల్ ఛిల్ కర్, మల్ మల్ కర్, ధుల్ ధుల్ కర్ పదాలలో లయబద్ధమైన సంగీతధ్వని వినిపించడం లేదూ!

'ఆఁసూ'లో ఇచ్చిన ఉదాహరణలలో ఆంగ్లంలో వెలిబుచ్చిన భావాలు ఉన్నాయా లేవా అన్నదే ప్రధానం. ఎందుకంటే 'ఆఁసూ' రచనకు, ఉదహరించిన ఆంగ్లరచనలకు 1 నుండి 3 శతాబ్దాల కాలం తేడా ఉంది. పాఠకులు యీ వ్యవధిని గమనిస్తారని ఆశిస్తాను.

పోతే జగదీశ ప్రసాద్ 'దీక్షిత్' 'ఆఁసూ' కవిత్వంపై ఆంగ్ల రినైసెన్సు కవి పి.బి.షెల్లీ ప్రభావముందంటాడు. పైగా మొదటి పదిపంక్తుల శైలిపై ఎలాస్టర్ ఆత్మ సంగీత ప్రభావముందంటాడు. జయశంకర ప్రసాద్‌కు పై ఇంగ్లీషు కావ్యాలు చదివి అర్థం చేసుకొనే ఆంగ్ల పరిజ్ఞానం లేదనే విషయం మనం మరచిపోకూడదు. అందులోనూ క్రీ.శ. 1937లో ప్రసాద్ మరణించే నాటికి పై కవుల రచనలు హిందీలోకి అనువదించబడలేదు. అందువల్ల 'ఆఁసూ' కావ్యంపై ఆంగ్లకవిత్వ ప్రభావం ఉందనడం వితండవాదమవుతుంది. 'గొప్పవారంతా ఒకేలా ఆలోచిస్తారని' చాటిచెప్పటానికి పై ఇంగ్లీషు, 'ఆఁసూ' కవితలు ఒక ఉదాహరణ.

**'ఆఁసూ' కావ్యవిశ్లేషణ :** సంక్షిప్తంగా చెప్పాలంటే ఛాయావాద కావ్యాల్లో ఆశ, నిరాశ, సానుభూతి, జీవిత సంఘర్షణ, సౌందర్య దర్శనం, వేదన, కరుణ, శృంగారాభి వ్యక్తి, వ్యక్తిగత సుఖదుఃఖాలు, వివిధ కోణాల్లో ప్రకృతి చిత్రణ, 'మార్మికవాదం' (ఇది కూడా ఛాయావాదం లాగే హిందీ సాహితీస్రవంతిలో ఒక ప్రముఖ ప్రక్రియ), ఆధ్యాత్మికతను ప్రకటించటంలో ఒక నిరుపమాన రీతి మొదలైన అంశాలు బహుళంగా వుంటాయి.

జయశంకర ప్రసాద్ రచించిన 'ఆఁసూ' కావ్యం

'ఛాయావాదం'లో రచించిన ప్రథమకావ్యం అంటారు హిందీ సాహిత్య చరిత్రకారులు. ఈ కావ్యం 28 మాత్రల ఛందస్సుతో యతి 14వ మాత్రగా వుంటుంది. కాలక్రమాన ఈ ఛందస్సుకు 'ఆనంద్' అనే పేరుపెట్టారు.

పై నేపథ్యంలో 'ఆఁసూ' కావ్యం 'ఛాయావాదం'ను ఎలా ప్రతిబింబించిందో రేఖామాత్రంగా పరిశీలిద్దాం.

1. **సౌందర్యదర్శనం :** ప్రసాద్ సౌందర్యాన్ని తల మునకలుగా ఆరాధించిన కవిసత్తముడు. అందువల్ల 'ఆఁసూ' కావ్యంలో ఎన్నో గీతాల్లో సౌందర్యదర్శన ప్రవృత్తిని ప్రముఖంగా చిత్రించాడు. కవి ప్రకృతిలోని ప్రతి అంశంలోను సౌందర్యాన్ని దర్శించాడు. 'ఆఁసూ' కావ్యంలో విఫలప్రేమకు ప్రాధాన్యతనిస్తూ ప్రేమరసపూరితమైన జీవితంలోని ఆటుపోట్లను ప్రతిభావంతంగా వర్ణించాడు. కవి ఒకవైపు తాను మోసపోయిన విషయాన్ని ప్రస్తావిస్తూ కూడ తన ప్రియురాలితో గతంలో గడిపిన మధుర క్షణాలను గుర్తు చేసుకున్నాడు.

ఉదా : **'మాదక్ థీ మోహమయీ థీ, మన్ బహలానే కీ క్రీడా**
**అబ్ హృదయ్ హిలా దేతీ హై, వహ్ మధుర్ ప్రేమ్ కీ పీడా।'**

– 'ఆఁసూ' 14

(నా మనస్సుకు ఆహ్లాదం కలిగించిన ఆ క్రీడ నాకు మత్తునూ, ఆకర్షణనూ కల్గించింది. ఆ మధురప్రేమ ఈనాడు నా మనస్సులో అల్లకల్లోలం సృష్టించి బాధిస్తూ వుంది.)

**విశేషం :** గడిచిపోయిన మధుర క్షణాలను తలచుకొని నేడు విరహబాధ భరించలేకున్నాడు కవి. యౌవనంలోని మధురానుభూతులను ప్రకటిస్తూ కూడ ప్రేయసిని ఉపాలంభించటానికి వెనుకాడకపోవటం 'ఆఁసూ' కావ్యంలోని ప్రత్యేకత.

ఉదా : **'లహరోఁ మేఁ ప్యాస్ భరీ హై, హై భఁవర్ పాత్ర్ భీ ఖాలీ**
**మానస్ కా సబ్ రస్ పీకర్, లుఢ్కా దీ తుమ్నే ప్యాలీ।'**

*– 'ఆఁసూ' 58*

(తరగలలో దప్పిక నిండియుంది. కాని సుడిగుండమనే పాత్ర ఖాళీగ వుంది. నా ప్రేమ రసమునంతా ఆస్వాదించి పానపాత్రను త్రోసివేశావు.)

**విశేషం :** వాస్తవంగా 'ఆఁసూ' కావ్యంలో తీరని కోరికలను విస్పష్టరూపంలో కవి వర్ణించాడు. ఒక్కోచోట ఆ క్షణాలను ఉదాత్తంగా చిత్రించాడు. ఈ భావనలన్నీ ఉవ్వెత్తున లేచిన అసంతృప్తి తరంగాలు అని మనం గమనించాలి.

ఉదా : **'జల్ ఉఠా స్నేహ్, దీపక్ సా, నవ్నీత్ హృదయ్ థా మేరా**
**అబ్ శేష్ ధూమ్-రేఖా సే, చిత్రిత్ కర్ రహా అంధేరా।'**

*– 'ఆఁసూ' 64*

(నా నవనీత హృదయంలో స్నేహం దీపంవలె వెలిగింది. ఉన్నట్టుండి ఆ దీపజ్వాల మలగిపోయి పొగ అనే తిమిరాన్ని సృష్టించింది (చిత్రించింది).

**విశేషం :** విరహావస్థలో తన దుఃఖిత హృదయాన్ని చిత్రిస్తున్నాడు కవి.

2. **వేదన-కరుణాభివ్యక్తీకరణ :** 'ఛాయావాద్' కవిత్వంలో వేదన, కరుణ వ్యక్తీకరించడమనేది ఒక ప్రముఖ ప్రవృత్తి రూపంలో దృష్టిగతమవుతుంది. హర్షం, శోకం, హాసం, విరహం, సమాగమం, ఆక్రందన, జననమరణాలు మొదలైన వాటితో ఉత్పన్నమయ్యే వలయాల్లో చిక్కుకున్న మానవజీవితాన్ని జీర్ణించుకున్న కవి హృదయతరంగిణిలో వేదన, కరుణ పొంగి పొరలుతాయి. 'ఆఁసూ' కావ్యంలో కవి హృదయ వేదన సాకారంగా దర్శనమిస్తుంది మనకు.

ఉదా : **'జో ఘనీభూత్ పీడా థీ, మస్తక్ మే స్మృతి-సీ ఛాయీ**
**దుర్దిన్ మేఁ ఆఁసూ బన్కర్, వహ్ ఆజ్ బరస్నే ఆయీ।'**

*– 'ఆఁసూ' 19*

(గడ్డకట్టుకున్న వేదనంతా మనస్సులో స్మృతిబింబంగా పరుచుకుంది. దుర్దినాలలో అది కన్నీరై నేడు ప్రవహిస్తూవుంది.)

**విశేషం :** కవి యీ గీతికలో నిరంతరం తనకు కన్నీరొలకడానికి కారణం వివరిస్తున్నాడు. కావ్యానికి 'ఆఁసూ' (కన్నీరు) అనే పేరిడడం యిందువల్లనే కావచ్చు.

3. **వ్యక్తిగత సుఖదుఃఖానుభూతి :** 'ఛాయావాదం'లో వ్యక్తిగత భావనకు ప్రాధాన్యత ఉంది. కవి సమిష్టితత్త్వం నుండి అంతర్ముఖుడై ఏకత్వంలో లీనమైపోతాడు. తనదైన భావనలో మమేకమై ఆనందిస్తాడు. బాహ్యలాలసత్వం, విశ్లేషణ అతని దృష్టిలో ప్రభావం చూపవు. కాని తన అంతర్ముఖానుభూతితో తనను తాను అభివ్యక్తీకరించటం 'ఛాయావాదం' కవియొక్క ఒకానొక ప్రముఖవిశేషం. ప్రసాద్ 'ఆఁసూ' కావ్యంలో స్వానుభవ దుఃఖాన్ని వ్యక్తీకరించటంలో సంపూర్ణంగా సఫలీకృతుడయ్యాడు.

ఉదా : **'తారాఓం కీ వే రాతేఁ, కిత్నే దిన్-కిత్నీ ఘడియాఁ**
**విస్మృతి మేఁ బీత్ గయీఁ వే, నిర్మోహ్ కాల్ కీ కడియాఁ।'**

*– 'ఆఁసూ' 164*

(నక్షత్రాలు మిణుకు మిణుకుమనే ఆ రాత్రులు, ఎన్ని దినాలు, ఎన్ని ఘడియలు ఈ మమతాహీన కాల శృంఖలాలతో విస్మృతిలో గడిచిపోయాయో?)

**విశేషం :** అధిక వ్యథకు గురైన కవి మనస్సు భూతకాల సుఖక్షణాలను సింహావలోకనం చేస్తూవుంది.

4. **ప్రకృతి చిత్రణ :** ఛాయావాద కృతుల్లో ప్రకృతి చిత్రణ ప్రముఖంగా కనిపిస్తుంది. అది ప్రాణసమానంగా ఇమిడిపోతుంది. 'ఆఁసూ' కావ్యంలో కవి ప్రకృతివర్ణన వివిధరూపాల్లో ఉదాత్తంగా చిత్రించాడు.

i. కవి తన ప్రేయసి ఛాయారూపాన్ని దర్శించినపుడు

ఉదా : **'ప్రాచీ కే అరుణ్ ముకుర్ మేఁ, సుందర్ ప్రతిబింబ్ తుమ్హారా**
**ఉస్ అలస్ ఉషా మేఁ దేఖూఁ, అప్‌నీ ఆఁఖోఁ కా తారా।'**

– *'ఆఁసూ' 156*

(తూర్పు దిశలోని సూర్యుడు అనే అద్దంలో నీ సుందర ప్రతిబింబంను మత్తు కల్గించే ఆ ఉషస్సులో విలోకించి నీవు నా కంటి వెలుగనుకున్నాను.)

**విశేషం :** తన ప్రియురాలి సుందర రూపం ప్రకృతి మాధ్యమంలో వివరిస్తున్నాడు కవి.

ii. మానవీకరణ (Personification) రూపంలో ఛాయావాద కవులు తమ ప్రియురాళ్ళ ప్రతిరూపాలను ప్రకృతితో తాదాత్మ్యం చేసి వివిధ భావజాలంతో వర్ణిస్తారు. ఇది 'ఆఁసూ'లో ప్రత్యక్షంగా కనుపిస్తుంది.

ఉదా : **'శశి ముఖ్ పర్ ఘూంఘట్ డాలే, అంచల్ మేఁ దీప్ ఛిపాయే**
**జీవన్ కీ గోధూళీ మేఁ, కౌతూహల్ సే తుమ్ ఆయే।'**

– *'ఆఁసూ' 34*

(నీ ముఖ చంద్రబింబానికి అరచాటు ముసుగు వేసుకుని పైట కొంగు చాటున దీపంతో నా జీవన సంధ్యాకాలంలో కుతూహలంగా నీవు నాదరికి వచ్చావు.)

**విశేషం :** ఆ అందమైన ప్రియురాలు తాను చావుకు దగ్గరైనపుడైనా తన దగ్గరకు వస్తుందన్న ఆశ వ్యక్తం చేస్తున్నాడు కవి. ఇది మానవ నైజం. ఇంకా ప్రసాద్ 'రాత్రి' అలసి పోయినట్లు 'ఆకాశమంతా' తడిసినట్లు తలపోస్తాడు.

ఉదా : **'థక్ జాతీ థీ సుఖ్-రజనీ, ముఖ్-చంద్ర్ హృదయ్ మేఁ హోతా**
**శ్రమ్-సీకర్ సదృశ్ నఖత్ సే, అంబర్-పట్ భీగా హోతా।'**

– *'ఆఁసూ' 56*

(ప్రియురాలి చంద్రబింబ ముఖం తన హృదయంలో దాచుకున్నందువల్ల సుఖించే రాత్రి కూడ అలసిపోయింది – దూరమైంది. శ్రమవల్ల కలిగిన స్వేదబిందువులు నక్షత్రాల రూపంలో ఆకాశవస్త్రంలో తడిసినట్టు స్పష్టమవుతుంది.)

**విశేషం :** శరద్రాత్రి పండువెన్నెలలో దూరమైన ప్రియురాలి సమాగమనాన్ని సుందరంగా చిత్రిస్తున్నాడు కవి.

**5. మార్మికవాదం, ఆధ్యాత్మికత :** 'ఛాయావాదం'లో తనలోని అజ్ఞాతశక్తితో ప్రేయసిపట్ల తనకు గల హృదయగతప్రేమను బహిర్గత పరుస్తాడు కవి. ఈ అజ్ఞాత శక్తితో కవి తన ప్రేయసిరూపంలో ప్రాణమున్న ప్రకృతి రూపాన్ని సృష్టిలోని సమస్త కణజాలంలోని మెరుపును వీక్షించగలుగుతాడు. 'ఆఁసూ' కావ్యంలో వీటిని ప్రసాద్ చాలాచోట్ల చాలా శక్తిమంతంగా ప్రయోగించాడు.

i. ఉదా : **'యే సబ్ స్ఫులింగ్ హైఁ మేరీ, ఇస్ జ్వాలామయీ జలన్ కే**
**కుఛ్ శేష్ చిహ్న్ హైఁ కేవల్, మేరే ఉస్ మహా మిలన్ కే।'**

– *'ఆఁసూ' 6*

(ఆనాటి మా మహాసంగమంకు కేవలం మిగిలిన చిహ్నలు నాలో మండే జ్వాల నుండి వెలువడే స్ఫులింగాలు ఇవన్నీ.)

**విశేషం :** విరహం వల్ల కలిగిన అంతర్జ్వాల దగ్ధంచేస్తూ వుంది కవి మనస్సును.

ii. ఉదా : **'చమ్‌కూంగా ధూల్ కణోఁ మేఁ, సౌరభ్ హో ఉడ్ జావూంగా**
**పావూంగా కహీఁ తుమ్హేఁతో, గ్రహ్-పథ్ మేఁ టకరాఊంగా।'**

– *'ఆఁసూ' 94*

(ధూళి కణములలో కలిసి మెరుస్తాను. సుగంధంతో ఎగిరిపోతాను. ఆకాశంలో ఎక్కడో ఒకచోట ఢీకొని నిన్ను (నీ ప్రేమను) పొందుతాను.)

**విశేషం :** కిరణాలు, గాలి, ఆకాశం వ్యాపించని ప్రదేశం ఈ జగత్తులో లేదు. ఈ ఉపకరణాల సహాయంతో తన ప్రియురాలిని ఎక్కడున్నా వెదకి పట్టుకోగలనని పూర్తి నమ్మకంతో ఉన్నాడు కవి.

6. **భావవ్యక్తీకరణలో నవ్యరీతులు :** నిరుపమాన రీతితో కావ్యజగత్తులో 'ఛాయావాదం' ఒక ప్రముఖ స్థానం అలంకరించింది. ఈ వినూత్న మెరుపుకవిత ప్రసాద్ రచించిన 'ఝులక్', 'లహర్' కావ్యాల్లో కూడ దృగ్గోచర మవుతుంది.

i. **భావాభివ్యంజనం :** ప్రసాద్ తన హృదయగత సౌందర్యారాధనను వెలిబుచ్చటానికి పదునైన భాషను ప్రయోగించాడు. మధుర స్మృతులను చిత్రించటమే కాక అక్కడక్కడా తాను తిరస్కరించబడటం కూడ నిస్సంకోచంగా వర్ణించాడు. యౌవన మైకంపై ఒక సంకేతమిస్తూ తన ప్రేయసి రూపవైభవాన్నికూడ లోకోత్తరంగా వర్ణించాడు.

ఉదా : **'మేరే జీవన్ కీ ఉల్‌ఝన్, బిఖరీ థీ ఉన్‌కీ అలకేఁ**
**పీ లీ మధు మదిరా కిస్‌నే, థీఁ బంద్ హమారీ పలకేఁ।'**

– *'ఆఁసూ' 51*

(నా జీవితంలోని కష్టాలు ఆమె చెదరిన ముంగురులవలె వున్నాయి. వాటిని తలుస్తూ నేను మత్తులో కునుకుతూ వుంటే ఎవరో నా తీయని మదిర త్రాగేశారు.)

**విశేషం :** తన కష్టాలు, చెదరిన ఆమె ముంగురులతో సామ్యముందని ఆమెవైపు ఆకర్షింపబడ్డాడు కవి.

ii. **ప్రతీకాత్మకత :** ఛాయావాద కావ్యాల్లో ప్రతీకాత్మకత ఒక విలక్షణ ప్రక్రియ. ఆధునిక ఛాయావాద కవులు యీ ప్రతీకాత్మకత కొరకు విశేషవ్యామోహం ప్రదర్శించారు. ప్రసాద్, నిరాలా, పంత్, శ్రీమతి మహాదేవివర్మ సూక్ష్మాతి సూక్ష్మమైన భావ ప్రకటన చేయటంలో ప్రకృతి ప్రసాదిత వరాలను ప్రతీకాత్మక పద్ధతిలో వినియోగించుకున్నారు. 'ఆఁసూ' కావ్యంలో ప్రసాద్ చాలా గీతాల్లో ప్రకృతి పరంగా

ఎన్నో భావచిత్రాలు చిత్రించాడు.

ఉదా : **'ఝుంఝా ఝుకోర్ గర్జన్ థా, బిజ్‌లీ థీ, నీరద్‌మాలా**
**పాకర్ ఇస్ శూన్య హృదయ్ కో, సబ్‌నే ఆ దేరా డాలా।'**

– *'ఆఁసూ' 23*

(తుఫాను గొప్పగాలి ఊపుతో చేసే గర్జన మెఱుపులు, మేఘాల గుంపు – ఇవన్నీ ఈ శూన్య హృదయాన్ని చుట్టుముట్టాయి.)

**విశేషం :** విరహంలో నిత్యం దుఃఖిస్తున్నాడు కవి.

iii. **లాక్షణికత :** భావాభివ్యంజనకు 'లాక్షణికత' గొప్ప గుణాన్ని ఆపాదించటమేకాక ప్రయోజనకారిగా కూడ ఉపయోగ పడుతుంది. ఛాయావాద కవులు తమ భావ ప్రకటనకు సులభశైలిని అనుసరిస్తారు. వారి భావానుభూతిని లాక్షణికత ద్వారానే వ్యక్తపరచటం మనం గమనించవచ్చు. లాక్షణికతతో సంబంధం 'లక్షణ' శబ్దశక్తితో ముడిపడివుంది. కవి ఎక్కడైనా ముఖ్యభావ ప్రకటన చేయడం కష్టమై ఈ లక్ష్యార్థంపై ఆధారపడినప్పుడు వ్యతిరేకార్థం కూడా మనకు ద్యోతకమవుతుంది. ప్రసాద్ 'ఆఁసూ' కావ్యంలో తన సూక్ష్మప్రకటనకు అక్కడక్కడ లాక్షణిక ప్రయోగాలు చేశాడు.

ఉదా : **'లిపటే సోతే థే మన్ మేఁ, సుఖ్ దుఃఖ్ దోనో హీ ఐసే**
**చంద్రికా అంధేరీ మిల్‌తీ, మాలతీ కుంజ్ మేఁ జైసే।'**

– *'ఆఁసూ' 107*

(వెన్నెల, చీకటి మధుమాలతీ నికుంజంలో కలిసినట్లు, నా మనస్సులో సుఖ దుఃఖాలు రెండూ చుట్టుకొని నిద్ర పోతున్నాయి.)

**విశేషం :** చంద్రిక, అంధేరీ (వెన్నెల, చీకటి) శబ్దాలు రెండూ లాక్షణికతకు ప్రతిబింబాలు. ఇక్కడ సుఖానికి బదులు 'చంద్రిక' (వెన్నెల) దుఃఖానికి బదులు 'అంధేరీ' (చీకటి) పదాలు ప్రయోగించబడ్డాయి. వీటితో పరస్పర ప్రభావం చూపించి 'లక్షణ' శక్తి ద్వారా తాను ప్రకటించదలచిన ఉద్దేశాన్ని ప్రతిఫలింపజేశాడు కవి.

iv. **నిరాకారోపమానాలు :** ఛాయావాద రచనల్లో స్థూల ఉపమానాలకు బదులు సూక్ష్మ నిరాకార ఉపమానాలు మెండుగా కనిపిస్తాయి. 'ఆఁసూ' కావ్యంలో ఇలాంటి వాటికి కొదువలేదు.

ఉదా : **'మాదకతా సే ఆయే తుమ్, సంజ్ఞా సే చలే గయే థే**
**హమ్ వ్యాకుల్ పడే బిలఖ్‌తే థే, ఉతరే హుయే నశే సే।'**

– *'ఆఁసూ' 73*

(నీవు మత్తులో వచ్చావు. చేతనావస్థలో వెళ్ళిపోయావు. మత్తు తగ్గిన నేను వ్యాకులతతో విలపించాను.)

**విశేషం :** Water, water everywhere - Nor any drop to drink అన్నట్లు ప్రియురాలు వద్దకు చేరడం, మళ్ళీ త్రోసి రాజని వెళ్ళిపోవడం ఎన్నోసార్లు అనుభవించిన కవి పాపం! ఇక్కడ ప్రియురాలి మూర్తిమంతమైన స్థితిని, 'మత్తు', 'చైతన్యం'తో పోల్చాడు.

v. **సంగీతాత్మకత :** సంగీతత్త్వం ఛాయావాద కవుల్లో అధికంగా కనిపిస్తుంది. ప్రసాద్ 'ఆఁసూ' కావ్యాన్ని ఈ దృక్కోణంలో చూచినప్పుడు కావ్యంలోని గీతాల్లో ఈ సంగీతాత్మకత అక్కడ – ఇక్కడ అనకుండా దాదాపు ప్రతి గీతంలోనూ ధ్వనిస్తుంది.

ఉదా : **'మధు మాలతియాఁ సోతీ హైఁ, కోమల్ ఉప్‌ధాన్ సహారే**
**మైఁ వ్యర్థ్ ప్రతీక్షా లేకర్, గిన్‌తా అంబర్ కే తారే।'** – *'ఆఁసూ' 78*

(చిగురుటాకుల మెత్తపై సుందర మాలతీ పుష్పాలు నిద్రిస్తున్నాయి. నేనపుడు వ్యర్థంగా గగనాన నక్షత్రాలను వీక్షిస్తూ లెక్కబెడుతున్నాను.)

**విశేషం :** ప్రియురాలు ఆగమనం కోసం చుక్కలను వీక్షిస్తూ లెక్కబెడుతున్నాడట కవి.

పై ఉదాహరణలతో 'ఛాయావాదం' విశేష తత్త్వాలను – సౌందర్య భావన, వేదన, కరుణ, ప్రకృతిచిత్రణ, ఆధ్యాత్మికత, ప్రతీకాత్మకత, లాక్షణికత, సంగీతాత్మకత మొదలైనవి 'ఆఁసూ' కావ్యంలో జయశంకర ప్రసాద్ సంపూర్తిగా ప్రోది చేశారన్నది నిస్సందేహం. నిర్వివాదంగా 'ఆఁసూ' ఒక సుందర, సుకుమార ఛాయావాద కావ్యం. ఈ కావ్యం 'కామాయని' మహాకావ్యానికి తొలి సోపానం.

ప్రసాద్ హిందీసాహిత్య ప్రకియలు – కవిత, కథ, నవల, నాటకాలు, వ్యాసాలు – అన్నిటిలో ప్రతిభావంతుడని పించుకున్నాడు. హిందీ సాహిత్యంలో ప్రసిద్ధి చెందిన మహాకావ్యాలు మూడు – తులసీదాస్ 'రామచరితమానస్', ప్రసాద్ 'కామాయని', మైథిలీశరణ్ గుప్త 'సాకేత్'. చిరగాఁవ్ వాస్తవ్యుడైన గుప్త, ప్రసాద్ దివంగతయాత్రలో పాల్గొనలేక కాశీకి వెళితే విశ్వనాథుని దర్శించవచ్చు కానీ ప్రసాద్ కనిపించడే అంటూ విలపించాడు.

ఆయన 'కామాయని' మహాకావ్యాన్ని గురించి రెండు మాటలైనా వ్రాయకుంటే ఈ నివాళి అసంపూర్ణమే అవుతుంది. ఈ కావ్యం ప్రౌఢతమశ్రేష్ఠకృతి. కవి కనబరచిన భావ గంభీరత, కల్పనాభూతపూర్ణ సమన్వయం కొనియాడదగింది. మానవజీవిత విశ్లేషణల్లో ఎక్కడా నీరసత్వం, శుష్కప్రయోగాలు మచ్చుకైనా కనుపించవు. హిందీ సాహితీక్షేత్రంలో 'కామాయని' వంటి మహాకావ్యం నభూతో న భవిష్యతి.

కోడూరు పుల్లారెడ్డి, విశ్రాంత సూపరింటెండెంట్ ఇంజనీర్, విద్యుత్ బోర్డు, కళ్యాణ్‌నగర్-3, హైదరాబాద్-18.
ఫోన్ : 9550818495

రజక వృత్తి

# రేవు నవల

- లంకా వెంకటేశ్వర్లు

నేటి సమాజాన్ని వాస్తవిక దృష్టితో విశ్లేషించిన నవల ఇది. సంపన్న వర్గాలు, వాళ్ళ దగ్గర అర్ధబానిస సేవక వర్గాలుగా రజక వృత్తిదారులు, ఈ రెండు వర్గాల మధ్య పరస్పర సంబంధాలు, ఇవి నిరంతరం సంఘర్షించు కుంటున్న తీరు, ఈ క్రమంలో ఉత్పత్తియైన భావజాలం, ఉత్తరాంధ్ర గ్రామీణ జీవనం ఈ నవల చర్చిస్తుంది. ఆర్థిక దృష్టి చైతన్యంతో వృత్తిదారుడు ముందడుగు వెయ్యబోతే సామాజిక పరిస్థితులు శాసించటం, సామాజిక చైతన్యంతో ఎదిరించబోతే, ఆర్థిక పరిస్థితులు నిలదీయటం దాదాపు నవలంతా పరచుకొని, వృత్తిదారుల్లో చైతన్యం, వృత్తిపనిలో చైతన్యం సమపాళ్ళలో ఆవిష్కరించిన నవల. రచయిత జి.ఎస్.చలం.

ఈ దేశంలో ప్రతి గ్రామంలోను ఉండే కులం రజకులది. రజకుల వృత్తి వ్యక్తిశుభ్రత లేక వస్త్రశుభ్రత నుద్దేశించింది. వృత్తికి వారసత్వం నిర్దేశితమై ఇది పూర్తిగా శ్రామిక కులమైంది. బట్టను నీట ముంచి నానబెట్టి ఉతకటం అనే ప్రక్రియ ఎవరికి వారు కుటుంబపరంగా నిర్వహించుకోవాలి. కానీ మొత్తం గ్రామంలోని వ్యక్తుల వస్త్రాలు శుభ్రం చేయటానికి ఒక కులాన్ని ఏర్పరచినపుడు, సేవ చేసే వారిని గౌరవించకపోగా వారిని హీనంగా చూడటం దారుణం. బట్టలుతికే ప్రక్రియను శాస్త్రీయపరచి చవుడు మట్టితో, బానలో ఉడికించి, మురికినివదలకొట్టే ఒక పనిని వైద్యుడిలా నిర్వహిస్తున్న వృత్తిదారునికి సమాజం రుణపడి ఉంది. ఈ పనిలో స్త్రీ పురుషులు సమానంగా కష్టించి శ్రమజీవనానికి గొప్ప అర్థం ఇచ్చిన కులాన్ని అనేక సందర్భాల్లో అవహేళన చేయటం *రేవు* లో గమనించవచ్చు.

*రేవు* నవలను రచయిత మూడు భాగాలుగా విభజించి 'చలి...చలి', 'దాహం...దాహం', 'వానా...వరదా' అని పేర్లు పెట్టాడు. చలి, వేసవి, వర్షాకాలాల్లో రజకులు పడేపాట్లు, అగచాట్లూ ఈ నవలలో చిత్రీకరించాడు.

కొత్తపల్లి గ్రామంలో రజక కుటుంబాల్లో పైడాలు కుటుంబ మొకటి. పోలిశెట్టి, పైడాలు మొగుడు పెళ్ళాలు. వాళ్ళకి అంకమ్మ, రామిశెట్టి ఇద్దరే పిల్లలు. మేనల్లుడు ఆదిశెట్టిని ఇల్లరికం తీసుకొచ్చి కూతురు అంకమ్మకు పెళ్ళిచేసింది పైడాలు. అంకమ్మ, ఆదిశెట్టి దంపతులకు బూసిగాడొక్కడే కొడుకు. కూతురు పేరు సిమ్మాలు. ఈమెను తమ్ముడు రామిశెట్టికిచ్చి వివాహం చేసింది. రామిశెట్టికి తలదించుకు బతకటం ఇష్టముండదు. భూస్వాములు ఎవరేమనుకున్నా లెక్కచేయడు. ఎదురు తిరుగుతాడు. రామిశెట్టి చాకలిపేటకు సమస్యగా మారాడు. అంకమ్మకు మాత్రం తమ్ముడంటే వల్లమాలిన ప్రేమ. రామిశెట్టి ఎంత ఆత్మాభిమానమునున్నవాడంటే తన చొక్కావేసుకున్నాడని దుర్భాషలాడుతూ చేయి చేసుకున్న దాలినాయుణ్ణి ఉతికేస్తాడు. మరుసటి రోజు పంచాయితీలో తప్పొప్పుకోవటం ఇష్టం లేక తనవారిని, గ్రామాన్ని విడిచి భార్యతో వైజాగు వెళ్ళిపోతాడు. తిరిగి మూడేళ్ళు దాటాక గాని పుట్టినూరు రాడు.

రజకుల పిల్లలు చిన్నప్పటి నుండి తల్లిదండ్రులకు రేవులో పనుల్లో సహాయపడుతుంటారు. క్రమంగా వృత్తి నేర్చుకొని చాకిరీలోకి వస్తుంటారు. "బూసిగాడు నూకల మూట భుజమ్మీద వేలాడదీసుకొని మరోచేత్తో కేరేజి పట్టుకొని తల్లి అంకమ్మ వెంట రేవుకు బయల్దేరతాడు. బట్టలు ఉడకబెట్టే గూనపొయ్యి దగ్గర పుల్లల్ని ఎగదోస్తూ, మండిస్తూ వుంటాడు. తడిబట్టలు ఆరబెట్టేటప్పుడు తనూ ఒక పక్క పట్టుకొని తల్లికి సహాయపడుతుంటాడు." ఇది వృత్తికి వారసత్వం నిర్బంధించటంతో తరువాతి తరం కూడా

విద్యా విజ్ఞానాలకు దూరంగా, మురికి, సేవక బతుకు బతకటానికి సమాజం పన్నిన ఉచ్చుగా భావించాలి.

ఇందులోనే రెండోభాగంలో పెదనాయుడు మరణం. మరణించిన వారిబట్టలు, మంచం ఆ ఇంటి చాకలికివ్వటం ఆచారం. గుడ్డముక్కలు ఇస్తారు గాని, అతను పడుకొనే మంచం మాత్రం ఇవ్వరు. 'నాయురాలమ్మ' ఏదో ఒక మంచం ఇస్తానంటుంది. అంకమ్మ ససేమిరా ఒప్పుకోదు. రివాజు తప్పనంటుంది. రివాజు విషయంలో ఎంతటి వారినైనా ఎదిరించే మనస్తత్వం అంకమ్మది. మంచం విషయం అందరికీ తెలియజేస్తుంది. చేసేది లేక మంచం ఇచ్చేస్తాడు. ఆ విధంగా తన హక్కుల కోసం భూస్వామిని ఎదిరించి చావు మంచం పొందుతుంది.

నాయుడు అంకమ్మకు జీతం ఇవ్వటానికి ఇబ్బంది పెడతాడు. ఎన్ని రోజులైనా జీతం కోసం కబురు రాదు. అంకమ్మే వెళ్ళి అడుగుతుంది. నాయుడు జీతం ఎగవెయ్యటానికి పథకం పన్నుతున్నట్లు ముందుగానే గ్రహిస్తుంది. నాయుడు "జీతం ఇవ్వను నీ దిక్కున్న చోట చెప్పుకో" అంటాడు. ఆవేశం, కోపం, కసి కలగలిసి, తిట్టిన తిట్టు తిట్టకుండా తిడుతుంది. "ఒరే గండా, నా సెమట తాగితే నాసాడు తాగినట్టే" (పుట-84) అని అంకమ్మ అనటం, నాయుడు వాయువేగంతో వచ్చి తన్నటం, అమ్మా అంటూ అంకమ్మ నేలకొరగటం ఒకేసారి జరుగుతాయి. శ్రమను, శ్రమజీవనాన్ని, శ్రామికుల హక్కుల్ని భంగపరచి యజమాని దౌర్జన్యం చేయటం ద్వారా భూస్వామ్య అగ్రవర్ణపు అహంకారం ప్రదర్శించినట్లైంది.

రామిశెట్టి గ్రామం వచ్చేస్తాడు. అక్క సాహసం గురించి, తెగువ గురించి తెలుసుకుంటాడు. ఆ సాహసం, ఆ తెగింపు తనలో ఎందుకు కరువయ్యాయో తెలుసుకొనేందుకు ప్రయత్నిస్తాడు. ఇంతవరకు కుటుంబం కోసమే ఆలోచించిన రామిశెట్టి తన కులం గురించి ఆలోచించటం మొదలు పెడతాడు. తన అక్కనే ఆదర్శంగా తీసుకుంటాడు.

ఈ నవలలో బహుజన స్త్రీ చైతన్యానికి ప్రతీకగా, అంకమ్మ పాత్ర నిలుస్తుంది. రెండో ప్రకరణంలో అసిరినాయుడు రజకుల చెరువులోంచి మోటారు ద్వారా నీళ్ళు తోడటం నిరోధించే క్రమంలో, రజకుల్ని చైతన్య పరచి సమ్మె చేయిస్తుంది. సోమినాయుడు జనుముని చెరువులో ఊరబెట్టడానికి బండితో వచ్చినపుడు తీవ్రంగా ఎదిరిస్తుంది. ఇక్కడ రజకుల శ్రమ సమిష్టి ప్రయోజనాన్నాసించింది. ఊరి ప్రజల బట్టలు శుభ్రం చేయటం వృత్తికాగా, తద్వారా మొత్తం వృత్తిదారుల జీవనోపాధి నుద్దేశించింది. వ్యక్తిగా అసిరి నాయుడు, సోమినాయుడు సొంత ప్రయోజనం కోసం వ్యవస్థకు నష్టం కలిగించటాన్ని వర్గ చైతన్య దృష్టితో ప్రతిఘటించటమవుతుంది.

చివరి ప్రకరణం వర్షాకాలంలో ఎండుకట్టెలు దొరక్క రజకులు ఇబ్బంది పడుతుంటారు. ఒకరాత్రి ఆదిశెట్టి, నాయుడు కళ్ళంలో పాతిన కట్టెల్ని దొంగతనంగా పీకి, పాలేరుకు దొరికి పంచాయితీలో దోషిగా నిలబడతాడు. ఊరిబట్టలు ఉడకబెట్టటానికి అవసరమై చేసిన పనిగా గుర్తించి వదిలేస్తారు. ఈ సంఘటనతో అంకమ్మ ఆత్మాభిమానం దెబ్బతింటుంది. తాను పట్టుపట్టి సాధించుకున్న చావు మంచం బద్దలు చేసి రేవుకు తరలిస్తుంది. ఈ సంఘటన అంకమ్మ వ్యక్తిత్వంలోని గొప్పతనాన్ని చాటి చెబుతుంది. ఆదిశెట్టి సామూహిక ప్రయోజనం కోసమే చేసినా, రాత్రిపూట దొంగతనంగా చేయటంతో దోషిగా నిలబడవలసి వచ్చింది. ఈ మేరకు తన వ్యక్తిత్వానికి నష్టం వాటిల్లింది. కాగా, శ్రమకు ఫలితంగా సాధించుకున్న చావు మంచాన్ని తృణప్రాయంగా సమిష్టి ప్రయోజనం కోసం బద్దలు చేయటంతో వ్యక్తిత్వంలోని ఔన్నత్యాన్ని చాటి చెప్పినట్లైంది.

మొదటి ప్రకరణంలో రామిశెట్టి పాత్ర ద్వారా వృత్తి చైతన్యంతో కూడిన భావజాలాన్ని తెలియపరుస్తారు రచయిత. రామిశెట్టి ఊరు వదిలి వెళ్ళే సందర్భంలో పేటలో ఉన్న పెద్దలతో చర్చ జరుగుతుంది. "కన్నతల్లి పుట్టినూరు సొర్గం" అనే బోడితాత మాటకి "ఊరు ఎవరికి సొర్గంరా! ఉన్నోడికా? లేనోడికా? ఊడిగం చేసి బతికినోడికి పుట్టి నూరేటి! గిట్టినూరేటి! అడుక్కున్నోడికి అన్నం పెట్టిందే అమ్మ" అంటాడు. ఈ మాటలు భౌతిక, ఆర్థిక, సామాజిక దృష్టితో కూడిన అవగాహన వృత్తిదారుడుకి అనుభవం ద్వారా వస్తుందని తెలియపరుస్తుంది. ఇంకా ఆ చర్చలో, యజమానులు ఇచ్చే ముప్పందుం ధాన్యం, సబ్బులు, నీలిమందు, బొగ్గులు కొనటానికే సరిపోతుందనీ, ఏడాది శ్రమకు కూలీ ఏదని ప్రశ్నించటం వృత్తిదారుని చైతన్యపరచటమవుతుంది. కులవృత్తి అయిన బట్టలుతకటం కంటే అదనపు శ్రమగా యజమానుల ఇళ్ళల్లో శుభాశుభ

కార్యాలకు కావుళ్ళు మోయటం దగ్గర్నుంచి కాలుతున్న శవాలకు కాపలా కాసేవరకు చేస్తున్న చాకిరీకి అదనపు ఫలితం రాబట్టాలనే మాటలు వృత్తి చైతన్యాన్ని ఆవిష్కరిస్తున్నాయి.

కళింగాంధ్ర ప్రాంత భాష కథలో ఇమిడి శైలికి సహజత్వాన్నిచ్చింది. అక్కడక్కడ కొన్ని మాండలిక పదాలు సందర్భాన్ని బట్టి జీవశక్తినిస్తున్నాయి. "బొగ్గులారిగం (బొగ్గుల కుంపటి), మసిమాని, మునకాలు కర్ర (ముల్లుకర్ర), దువ్వారం (ద్వారం), సందీమంది (సందిగ్ధావస్థ), కంబారి (పాలేరు), సుల్లరంపని (ఆకతాయిపని), గోలెం (రజకులు వాడే మట్టి పాత్ర), గూన, సల్లంది (చద్దన్నం), కుడక, పలకర్ర (పళ్ళు తోముకొనే పుల్ల), ముక్కలం (మనసులో అయిష్టత), కంకరడంగు (కొంచెం ఉబ్బెత్తుగా ఉండి పంట నూర్పిడికి వినియోగించే కంకర దిబ్బ), కొదం (గిత్త), గోర్జి (ఇరువైపులా చెట్లు కలిగి ఉన్న ఇరుకైన కాలిబాట), ఏరుపిడి (పొలం దున్నేటప్పుడు చేతితో పట్టుకునే మేడికర్ర), ఇగటాలు (చతుర్లు ఆడటం), టిర్రి (చేపలు పట్టి నడుముకు కట్టుకునే బుట్ట), అడ్డుసుడి (అడ్డకోలుగా మాట్లాడటం), బరాతం (పండుగ రోజుల్లో రైతులు వృత్తిదారులకు ఇచ్చే కానుక), నిసాకారం (చిన్నచూపు చూడటం), లజ్జుగుజ్జు (మల్లగుల్లాలు), రొకాయించటం (అదేపనిగా గుచ్చి గుచ్చి మాట్లాడటం), బిల్లిద్రం (పొగరుతో, గర్వంతో ఉండటం), ఇండుపుకాయ (నీటిని శుభ్రం చేసే వస్తు విశేషం), బిజాడి (జంజాటం)" మొదలైన పదాలు ఏ ప్రాంతపు పాఠకుడు చదివినా సందర్భాన్ని బట్టి అర్థమవుతాయి.

సన్నివేశాన్ని బట్టి పాత్రలు మాట్లాడుతున్నపుడు, ముఖ్యంగా వృత్తిదారులు వర్గ స్పృహతో కూడిన వృత్తి చైతన్యంతో మాట్లాడుతున్నట్టు కనిపిస్తుంది. సోమినాయుడు రజకుల చెరువులో జనుము ఊరెయ్యటానికి ప్రయత్నించి నపుడు, అంకమ్మ అడ్డగిస్తుంది. "సెరువు నీకు పట్టా రాస్సిందా గవర్మెంటు" అంటాడు సోమినాయుడు. "రాస్తేనే అవుద్దేటి, తాతలు నుంచి దున్నుతున్న భూమి నీదైనపుడు మా ముత్తాతల్నించి గుంజుతున్న సెరువు మాదవ్వదా?" అంటుంది అంకమ్మ. ఇటువంటి వృత్తి చైతన్యంతో కూడిన సందర్భాలు సంభాషణలు నవలలో చాలా చోట్ల కనిపిస్తాయి.

కథావస్తువుతో పాటు వాతావరణ చిత్రణ, కులవృత్తికి చెందిన పోలికలతో ఉండటం వల్ల పాఠకుడు చివరి దాకా నవల అందించే అనుభవంలోనే ఉండిపోవటానికి దారితీస్తుంది. "చాకి బండలన్నీ నీటికోసం నోళ్ళు తెరచి ఆకాశం కేసి ఆశగా చూస్తున్న గాంద్రు కప్పల్లా ఉన్నాయి. రేవంతా పిట్టలు ఎగిరిపోయిన చెట్టులా ఉంది'' (పుట-42). ఇటువంటి వాక్యాలు నవల నిండా పరచుకుంటాయి.

బట్టలను శుభ్రపరచే ప్రక్రియగా వృత్తిపనిని రచయిత పరిశీలనతో వర్ణించటం ఈ నవలకు నిర్మాణాంశ మవుతుంది. "అతడు తడిపిన బట్టలన్నీ ఒడ్డుమీద గోలెం దగ్గరకు విసురుతుంటే, అంకమ్మ ఒక్కొక్కటి తీసి సోడాకారం గోలెంలో ముంచుతూ కొద్దికొద్దిగా పిండి పక్కనే పరచిన దుప్పటిలో వేస్తోంది. బట్టలు ఉతుకుతున్నపుడు అవి అడుగునపడి మాడిపోకుండా చింకిపాతలు గూన అడుగున వేసి, కారం పట్టించిన బట్టలన్ని అందులో కుక్కింది. పక్కపొయ్యిలో అగ్గి తీసుకొచ్చి పొయ్యిలో వేసింది. కంపలు చిటపటమంటూ అంటుకున్నాయి" (పుట-19). వస్తువులో లీనమై రచన చేస్తున్నపుడు రచయిత అనుభవం. పరిశీలన 'రూపం' తీసుకుంటుంది. అది వ్యక్తీకరణకు స్థాయినిస్తుంది.

సమాజంలో శ్రమ సంబంధాలకు ప్రాధాన్యం ఇచ్చే సిద్ధాంతం ఈ నవలకు భూమిక. కాగా అంతటి సిద్ధాంతాన్ని సైతం పీడనకు, ఘర్షణకు గురియైన ఇలాంటి జీవితాలే రూపొందిస్తాయి. రచయిత అలాంటి జీవితం నుంచి వచ్చినట్లైతే ఆ రచనకు ఆ వర్గపు ప్రాతినిధ్యస్థాయి వస్తుంది. తన నేర్పరితనాన్ననుసరించి ఆ రచన శిల్ప భరితమవుతుంది.

సాధారణంగా వృత్తికులాల సమస్యలను చిత్రించే రచనల్లో జీవితంలోని ఆటంకాలను ఎదుర్కోలేక సమాజం విసిరే సవాళ్లను అధిగమించలేక తుదకు ఓడిపోవటాన్ని తప్పని పరిస్థితిగా చూపించటం జరుగుతుంది. కానీ రేవు లో నిరంతరం చైతన్యంతో ప్రతిఘటన శక్తితో నిలబడి పోరాటం చెయ్యటమే ఏ సమస్యకైనా ఏకైక పరిష్కారంగా నిరూపించిన నవల ఇది.

డాక్టర్ లంకా వెంకటేశ్వర్లు
ఏలూరు, పశ్చిమగోదావరి జిల్లా
ఫోన్ : 9493 890138
















# చదవండి...

- ఎన్నార్కె

✦ **బుద్ధ చరితమ్ :** ''A Pictorial Biography of Sakyamuni Buddha' అను గ్రంథము థాయి భాషలో రచించబడి ప్రపంచ వ్యాప్తంగ ప్రజాదరణ పొందింది. దీనికి ఈ రచన గేయ రూపంలో రచించిన స్వేచ్ఛానువాదం. అందమైన ముఖచిత్రం, అందమైన ముద్రణ. అందమైన రచన పొందికగా గల దీని రచయిత మేడం నారాయణరెడ్డి. ధర్మదీపం ఫౌండేషన్ వారి ప్రచురణ.

*పేజీలు :170, వెల : ₹ 150/-, ప్రతులకు - ఫోన్ : 040-27635654.*

✦ **సప్తపర్ణి :** అన్నపూర్ణ, రమాసుందరి, ఉమాదేవి, నాగలక్ష్మి, ప్రభావతి, గాయత్రి, గీతాభవాని అనే ఆరుగురు సోదరీ మణులు రచించిన భావలహరి సంపుటి. చక్కటి గీతాలను అందమైన బొమ్మలతో కలసి ముద్రించటం వలన పుస్తకం చూడ ముచ్చటగా వచ్చింది.

*పేజీలు :210, ప్రతులకు - ఫోన్ : 9912940182.*

✦ **మాటతీరు :** పూర్ణచంద్ర తేజస్వి, మరికొందరు కన్నడ రచయితలు కన్నడంలో వ్రాసిన కొన్ని కథలను తెలుగులో అనువదించారు శాఖమూరు రామగోపాల్. ఈ కథలతోబాటుగా హిమాచల్ ప్రదేశ్‌లో నా యాత్రానుభవం- అనే వ్యాసం కూడా ఉంది. కన్నడ కథాసాహిత్యపు స్థాయికి ఈ రచనలు అద్దం పడతాయి.

*పేజీలు : 230, వెల : ₹ 200/-, ప్రతులకు - విశాలాంధ్ర అన్ని బుక్‌షాపులు, ఫోన్ : 09052563666.*

✦ **సడిలేని అడుగులు :** ఆచార్య మసన చెన్నప్ప వ్రాసిన రవీంద్రుని గీతాంజలికి ఇది లఘు కవితా రూపం. రచయిత శైలిలో లాలిత్యం ఉంది.

*పేజీలు : 90, వెల : ₹ 80/-, ప్రతులకు - విశాలాంధ్ర పబ్లికేషన్స్, ఫోన్ : 9885654381.*

✦ **కళింగాంధ్ర సాంఘిక చరిత్రకారుడు-** గురుజాడ వ్రాసిన చారిత్రక వ్యాసాలు విశ్లేషణ. రచయిత నల్లి ధర్మారావు. గరజాడ అభిమానలు తప్పక చదవ వలసిన పుస్తకం.

*పేజీలు : 36, వెల : ₹ 10/-, ప్రతులకు - గురుజాడ అధ్యయన వేదిక శ్రీకాకుళం.*

✦ **కాలం తెచ్చిన మార్పు :** బి.ఎస్. రాముల కథల సంపుటి. ఇందులో మొత్తం 15 కథలున్నాయి. ఈ కథలకు మూలాలేమిటో, ఏ పరిస్థితులలో వాటిని వ్రాయవలసి వచ్చిందో రచయిత విపులంగా తమ ముందు మాటలో తెలిపారు. కమిట్‌మెంట్ ఉన్న రచయితగా ఈ బి.ఎస్.

*పేజీలు : 208, వెల : ₹ 100/-, ప్రతులకు - ఫోన్ : 8331966987.*

✦ **నలుపెరుపు :** తల్లావజ్ఝల పతంజలి శాస్త్రి గారి కథలు. చేదైన జీవితము, తేనైన హృదయమూ ఆయన సాహిత్యంలో ప్రధాన లక్షణం- ప్రతీ కథ మూలాలలోనూ అదే కనిపిస్తుంది.

*పేజీలు : 98, వెల : ₹ 100/-, ప్రతులు అన్ని ముఖ్య పుస్తక కేంద్రాలలో లభ్యం, ఫోన్ : 9848132208.*



✦ **ఛత్తీస్ ఘడ్ స్కూటర్ యాత్ర :** పరవస్తు లోకేశ్వర్ లోకేష్, అతని మిత్రుడు సతీష్ సాగించిన యాత్ర విశేషాలు. చారిత్రాత్మకమైన ఈ ఘట్టాన్ని చదివి ఆనందించ వలసిందే. చదివిన వారికి తాము కూడా యాత్ర చేస్తే బాగుంటుంది అన్నంతగా రచన సాగింది.

*పేజీలు : 156, వెల : ₹ 100/-, ప్రతులకు - ఫోన్ : 9160680847.*



✦ **సౌందర్య సృజన చిత్రకళా వ్యాసాలు :** రచయిత ఎల్.ఆర్. వెంకటరమణ. చిత్రకళపై వచ్చిన చక్కని, చిక్కని అందమైన పుస్తకం. 32 వ్యాసాలలో సుప్రసిద్ధ చిత్రకారుల జీవన రేఖల్ని పరిచయం చేయడమే కాదు, ఆ రేఖల నడుమ గల అంశాల్ని సూక్ష్మదృష్టితో చూపటం విమర్శకునిగా వెంకట రమణ సాధించిన సాఫల్యం. ఇది చిత్రకళపై తనకున్న సాధికారతను అందరికీ అర్థమయ్యేలా అందించినందుకు రచయిత అభినందనీయులు. ఈ స్థాయిలో మరిన్ని పుస్తకాలను ఆయన నుంచి ఆశించవచ్చు.

*పేజీలు : 144, వెల : ₹ 80/-, ప్రతులకు - పాలపిట్ట బుక్స్*



✦ **జంగల్ :** రచయిత కరాడి భూమన్న. అడవిపై, నేలపై, నీళ్ళపై సర్వాధికారాలుండాలని అడవంతా తుడుం మ్రోగించిన కవితలివి. రచయిత మరణానంతరం అతని శ్రీమతి కరాడి సునీత ఈ కవితలను ప్రచురించారు.

*పేజీలు :130, వెల : ₹ 50/-, ప్రతులకు - పాలపిట్ట ప్రచురణలు, ఫోన్ : 9705135470.*



✦ **వెన్నెల్లో మంచుపూలు :** తిరువాయిపాటి రాజగోపాల్. ఇందులో 40 కవితలున్నాయి. పదవీ విరమణకు వయసు దగ్గర పడుతుంటే అంతకు ముందు వ్రాసుకున్న కవితలు కొన్నిటిని డైరీనుంచి తీసి కవితలు ప్రచురించారు. మధ్యతరగతి మనస్తత్వాన్ని తిలక్ తరువాత అంత గంభీరంగా చెప్పిన కవి రాజగోపాల్ అన్నారు శిఖామణి.

*పేజీలు :100, వెల : ₹ 60/-, ప్రతులకు -* అన్ని ముఖ్యమైన పుస్తక కేంద్రాలు.



✦ **తియ్యని వేప :** రావికంటి కథలు. తెలంగాణా జీవద్భాషను ఉన్నతమైన రీతిన వ్యక్తికరించటం రచయిత వేముల ప్రభాకర్ ప్రత్యేకత. కథలన్నింటిలోనూ మానవతా వాదానికి, ప్రకృతిని సంరక్షించుకొనే బాధ్యతకు రచయిత ప్రాధాన్యతనిచ్చారు.

*పేజీలు : 160, వెల : ₹ 100/-, ప్రతులకు - ఫోన్ : 9247040332.*



✦ **కృష్ణా :** సి. వేదవతి తనతో 60 సం॥లు వైవాహిక జీవితం గడిపి నిష్క్రమించిన జీవిత భాగస్వామి చింతమనేని కృష్ణారావు గారి జ్ఞాపకాలకు ఇచ్చిన అక్షరనివాళి. నిరాడంబరుడు, సాహితీ పఠన శీలి, సౌమ్యుడు, మంచి మిత్రుడు, మానవతా వాదయిన కృష్ణగారిపై ఆయన సమీప బంధువులు, మిత్రులు ఇచ్చిన అక్షర చిత్రాలీ వ్యాసాలు. మనిషితనం, మానవత్వం అన్వేషించేవారందరూ చదవదగ్గ రచన.

*పేజీలు :108, ప్రతులకు - ఫోన్ : 9392467795.*

✦ **కవిత్వం ఒక సామాజిక సత్యం :** రచయిత డాక్టర్ రాధేయ. కవిత్వాన్ని సామాజిక స్వప్నంగా, సత్యంగా భావించిన రచయిత భావవీచిక యొక్క సమీక్షసారం ఈ రచనలు. కవిత్వం వేరు. జీవితం వేరు కాదని, రెంటికి ఒక దానితో మరొక దానికి విడదీయ రాని సంబంధం ఉందని అద్వైత భావన ఈయన రచల మూల సిద్ధాంతం.

*పేజీలు : 200, వెల : ₹ 140/-, ప్రతులకు - విశాలాంధ్ర, నవోదయలో పుస్తకం లభ్యమవుతుంది.*

# గోపల్లెకు దారి...




ఆది నుండి భారతదేశం లో భాగంగా ఉంటూనే, తమదైన సంస్కృతి, చారిత్రక వైభవాలతో వెలుగొందిన జాతి తెలుగు జాతి. భారతదేశ రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక చరిత్రలో తెలుగు వారిది ఎప్పుడూ ప్రధాన పాత్రే. అలా వివిధ దేశాలకు వలసవెళ్లిన తెలుగువారు అక్కడి స్థానిక సంస్కృతిలో మమేకం అవుతూనే వారి సంస్కృతి సంప్రదాయాలను నిలబెట్టుకొంటున్నారు. వేల సంవత్సరాల చరిత్ర ఉన్న బౌద్ధ సాహిత్యాన్ని నౌకాయానం ద్వార విదేశాలలో ప్రచారంచేసి, భారతీయ సంస్కృతిని నిలబెట్టిన ఘనత మన తెలుగువారిదే.

అలాగే తెలుగువారు ఇతర రాష్ట్రాలలో వివిధ కారణాలతో వెళ్లి కుదురుకొన్నారు. అలా స్థానిక రాజుల దురాగతాలను తట్టుకొనలేక కొన్ని వందల తెలుగు కుటుంబాలు దక్షిణదిశగా దారి పట్టాయి అదే ఇప్పటి తమిళనాడు రాష్ట్రం. దట్టమైన అడవులను చదును చేసి గ్రామాలను ఏర్పరచుకొని, పాడి పంటలను అభివృద్ధి చేసుకొని కుదురుకొన్నారు. అటువంటి తెలుగు కుటుంబాలు తరతరాలుగా తమ వలస జీవనాన్ని కథలుగా చెప్పుకొనడం ఆనవాయితీ.

**గోపల్లె నేపథ్యం :** తమిళనాడులోని మధురకి దక్షిణదిశలో ఉన్న పాండ్యమండల ప్రాంతంలో ఇప్పటికీ 60% పైగానే తెలుగువారున్నారు. సుమారు ఎనిమిది వందల ఏండ్ల క్రిందట ఉత్తరానున్న తెలుగునాడు నుండి వెళ్లి, పాండ్య మండలంలోని తూత్తుకుడి జిల్లా కోవిల్పట్టిమండలం 'ఇడైచేవల్' అనే గ్రామంలో తెలుగు సంతతికి చెందిన వ్యవసాయ కుటుంబాలు కుదురుకున్నాయి. అటువంటి కుటుంబ సంతతికి చెందిన రాయంకుల రాజనారాయణ 'కీరా' అనే కలంపేరుతో పలు రచనలు చేసి ప్రసిద్ధికెక్కారు. చదివింది అయిదవ తరగతే అయినా ఈయనకున్న అమోఘమైన విజ్ఞానాన్ని గుర్తించి పాండిచ్చేరి విశ్వ విద్యాలయం అతిథి ఆచార్య పదవినిచ్చి గౌరవించింది. ఆయన పదవీ విరమణ చేసినప్పటికీ, ప్రభుత్వ గృహ సముదాయంలో ఉచిత వసతి కల్పించింది. ఇప్పుడు ఆయన వయసు 91 సంవత్సరాలు. అయినా తనలోని రచయిత అవిశ్రాంతంగా ఇంకా రచనలు చేస్తూనే ఉన్నాడు. కీరా కృతులను, మిగిలిన రచనలను పరిశీలించినపుడు తమిళ సాహిత్యంలో ఒక ఉన్నత స్థానాన్ని పొందిన వ్యక్తిగా కనిపిస్తున్నారు. తరతరాలుగా వీరి కుటుంబాలలో చెప్పుకొనే వలసజీవితాన్ని విడమరచి నిజంగా జరిగిన కథను వారి అవ్వ చిన్నప్పుడు రాజనారాయణ్ గారికి చెప్పిందంట. అందరి పిల్లాల్లలాగానే ఈయన ఆ కథను విని ఊకొట్టి ఊరుకోలేదు. తన ఏభైయ్యో ఏట వారి కుటుంబాల యథార్థ జీవనగాథను 1976సం.లో తమిళంలో *గోపల్లె పురం* నవలగా అందించినారు. దక్షిణ తమిళనాడులో తెలుగు చదువుకొనే అవకాశం లేకపోవడం వలన, ఆయన తమిళంలోనే తొలి మాండలిక నవలగా *గోపల్లె పురం* రచించారు. తొలి మాండలిక పితామహుడుగా గుర్తింపు పొందిన ఘనత వీరిదే. ఒకవిధంగా చెప్పాలంటే తెలుగోడి చెమట, నెత్తురు నుండి ఈ నవల జాలువారింది. ఆయన మాటల్లో "ఈ నవల శరీరం తమిళమైతే ఆత్మ తెలుగే". డెబ్బైవ దశకంలో ఈనవల తమిళ సాహితీలోకాన్ని ఒక్క కుదుపు కుదిపింది.

**గోపల్లె ఇతివృత్తం :** కొన్ని వందల ఏళ్ల క్రితం - బహుశా తళ్లికోట, గండికోట మొదలైన యుద్ధాలలో పాలకులు ఓటమి పొందిన తర్వాత అనేక తెలుగు కుటుంబాలు దక్షిణాదికి వలసపోయాయి. ఇలా వలసపోయిన కుటుంబాల్లో 'రాయంకుల' ఇంటిపేరు గలవారు కూడా వున్నారు. తమ ఇంటి అందమైన ఆడ పడుచుపై కన్నేసిన ముస్లిం పాలకుడి నిఘా నుంచి చాటుగా తప్పించుకొని వచ్చిన తీరు, దారిలో ఎదురైన కష్టాలు చివరికి పాండ్యమండ్య మండలానికి (తూత్తుకుడి జిల్లా, తమిళనాడు) చేరి అక్కడి నల్లరేగడి అడవిని సాగుచేసుకుని, దివిటీ దొంగల నుంచి తమ గ్రామాన్ని కాపాడుకుంటూ రెక్కలు ముక్కలు చేసుకుని సేద్యంలో దీటైన వారుగా పేరుపొంది, ఆ ప్రాంతానికి నాయకర్లు (నాయకులు) గా ఎదిగిన ఒక కుటుంబ గాథే *గోపల్లె*. రెండవభాగంగా వచ్చిన *గోపుల్లపురత్తు మక్కల్* ( గోపల్లె పురజనులు) ఇంకా అనువాదానికి నోచుకోలేదు.

ఆధునిక సాహిత్యంలో అత్యంత ప్రముఖమైనది నవలా సాహిత్యం. ఈ సాహిత్యం భిన్నకోణాల్లో పరిభ్రమించి ఈ దశకు చేరుకొంది. *గోపల్లె పురం* తెలుగులో *గోపల్లె*గా అనువాదం చేసింది నారాయణరెడ్డి. ఈ *గోపల్లె* నవలను అనువాదం చేసేటప్పుడు అనువాదకుడు తమిళనాడులో తెలుగు తమిళనాటి తెలుగు మాండలికాన్ని ఉపయోగించు కొని వ్రాయడమనేది ఒక ప్రత్యేకత. అంతేగాక ఈ నవల సృజనాత్మకమైనదైనప్పటికీ అందులో చారిత్రాత్మక, సామాజిక అంశాలు, తమిళనాట ప్రచారంలో గల మాండలిక పదాలు అనేకం చోటు చేసుకొన్నాయి. ఈవిధంగా తమిళనాట తెలుగు మాండలికంలో ఒక నవల అనువాదం కావడం అనేది ప్రత్యేకించి చెప్పుకోవలసిన విషయం. 37 సంవత్సరాల తరువాత ఇప్పుడు తెలుగు అనువాదంతో వెలుగులోనికి వచ్చి *గోపల్లె* పరిపూర్ణత సాధించిందని అధికారభాషా సంఘం అధ్యక్షులు మండలి బుద్ధ ప్రసాద్ ఇటీవల పాండిచ్చేరి *గోపల్లె* పుస్తకావిష్కరణ సభలో వ్యాఖ్యానించడం విశేషం. *గోపల్లె* ఇతివృత్తం మూడు కాలాలకు సంబంధించినది.

**1. పూర్వదశ** – ఎనిమిది వందల ఏండ్ల క్రిందట కొందరి పాలకుల పాలనాకాలంలో ఆడవారిపై జరుగుతున్న అకృత్యాలకు తలవంచలేక, తమ సంస్కృతి సాంప్రదాయలను పరిరక్షించుకోవడానికి ఉత్తరాన్నుంచి దక్షిణాది వైపు వలస వెళ్లారు.

**2. మధ్యదశ** – అక్కడి అడవులను కొట్టి, నేలను తీర్చి సాగులోనికి తెచ్చి, కుదురుకొన్నారు. అడవి ఆవులను మచ్చిక చేసుకోని తమ ఊరికి *గోపల్లె* అనిపేరు పెట్టు కొన్నారు. ఆ తరువాత ఆ గ్రామం పెరిగి పెద్దదై ఎన్నో కుటుంబాలను తనలో కలుపుకుంది.

**3. అంతిమదశ** – తెల్లవాళ్లు ఇక్కడకు ఎట్లా అధికారం లోకి వచ్చారో చెప్పబడుతుంది. ఈ విధంగా మూడు తరాలకు సంబంధించిన తెలుగువాళ్ల కథే ఈ నవల.

తరువాత స్వతంత్రోద్యమకాలాన తెల్లవాళ్లు ఈనేలను విడిచి ఎలా వెళ్లిపోయారో చెప్పేది రెండో నవలగా వచ్చిన గోపుల్లపురత్తు మక్కల్ (గోపుల్ల పుర జనాలు) దీనికి కేంద్రసాహిత్య అకాడమీ బహుమతి లభించింది.

నవలను రచించేప్పుడు రచయితలు పెక్కు విధానాలను పాటిస్తారు. ప్రధానంగా చూస్తే మొత్తం కథ పూలను దారంతో గుచ్చినట్లు ఒక అంకం చదివిన తరువాత మరొక అంకాన్ని చదవాలనే ఉత్కంఠను కలిగిస్తుంది. ప్రతీకలు చాలా బాగున్నాయి. రాజనారాయణ ప్రకృతి వనరులకు అధిక ప్రాధాన్యత ఇచ్చి ప్రకృతి వర్ణణలతోటే అత్యంత మనోరంజకంగా మొదటి అధ్యాయాన్ని ఆరంభించారు. ఆయన రాసిన ఒక వర్ణన మాత్రం ఇక్కడ చెప్పుకొందాం.

"రేయి మనుము (జీవు) లలో కూతలు మెల్ల మెల్లగా అణుగుతున్నాయి. పిల్లులు వేటను ముగించి ఇళ్లు చేరుతున్నాయి. పందికొక్కులు వాటి కలుగులకు చేరుతున్నాయి. రీ అని గీ పెట్టిన పెట్టిన ఈలకోళ్లు నోళ్లకు విడుపునిచ్చి కునుకు మొదలు పెట్టేసినాయి. పగటి మనుములలో తొలి మెలకువ జీవి కోడి పుంజు రెక్కల తప్పెటను మోగిస్తూ లేవండహో అంటూ కూతలు పెట్టి పల్లెను లేపుతున్నది. జీనివాయిలు, జిట్టిగువ్వలు, పోలు వాయిలు, పొట్టిపిట్టలు, జిలిబిలి పలుకులను తొలు కొంటున్నాయి. కాకులు కూడా కరకర అరుపులు అందుకొన్నాయి". అన్నం ఉడికిందా లేదా అని ఒక మెతుకును పట్టుకుని చూస్తే చాలు. అలాగే ఈ నవల మొదటి అధ్యాయాన్ని చదివితే చాలు.

ఇది రాజనారాయణన్ పూర్వీకుల చరిత్రకి నవలా రూపం. ఈ నవల చదువుతున్నంతసేపు మనం ఆనాటి ఆ గ్రామంలోనే వున్నట్టు అనిపిస్తుంది, ఒక వేకువను, ఒక వేసవిని, ఒక పల్లె బతుకు తీరుతెన్నులను ఆయన వివరంగా చెప్పే సొబగు చాలా అరుదు. నవలలో గత జ్ఞాపకాలు (ఫ్లాష్ బాక్) పద్ధతిని ఎంతో ఆసక్తిదాయకంగా వాడుకున్నారు. ఈ నవలలో అన్ని రసాలూ వున్నాయి. ఒళ్ళు గగుర్పొడిచే మలుపులు, కళ్ళు చెమ్మగిల్లే ఘట్టాలు చదువుతోంటే 'లైఫ్ ఈజ్ స్ట్రేంజర్ దేన్ ఫిక్షన్' అనిపిస్తుంది. దక్షిణ తమిళనాట మనకి తెలియని మన వారి చరిత్ర ఈ గోపల్లె.

**గోపల్లె నవలలో పరిశీలించ దగ్గ అంశాలు :**

1. అడవిని కొట్టి సాగులోనికి తేవడంలో పడిన కష్టాలు.
2. ఇంటిపేర్లు ఏవిధంగా స్వభావాన్ని వృత్తులను బట్టి, వచ్చి చేరుతాయో, చక్కగా తెలిపారు.
3. ఆనాటి సమకాలీన సమాజానికి ఈ నవల అద్దం పడుతుంది.
4. వీరు తెలుగునాడు నుండి తమిళనాడుకు వలస వెళ్లేప్పుడు ఇక్కడి మణులు మాణిక్యాలను తీసుకొని పోలేదు.

వాటిని తన గర్భంలో దాచుకొన్న నేలతల్లే వారికి మిన్న అందుకే మట్టిని దైవంగా భావించి తాము వలస వెళ్లిన ప్రాంతానికి తీసుకొని వెళ్లి ఇప్పటికీ పూజిస్తున్నారు.

5. ఆనాటి పరిస్థితుల రీత్యా ఇతరభాషాప్రాంతానికి వలస వెళ్లవలసివచ్చినందుకు బాధ పడవలసిన అవసరంలేదని "నాబిడ్డలారా ఎక్కడో ఒకనాడులో ఎక్కడో ఉన్ననాడుకు వచ్చి బతకాల్సి వచ్చిందని కలత పడవద్దు. అంతా నేలతల్లి తావే. ఆమె చేతి వేలు నుండి మరొక వేలుకు వచ్చాము" అని ఒక పెద్దామె చెబుతుంది.

6. ఈ నవలలో వాడిన తెలుగు నుడి చాలా గొప్పది. ఇందులో ప్రత్యేకత తమిళనాట ప్రచారంలో ఉన్న తెలుగు మాండలిక పదాలు చాలా ఉన్నాయి. ఇది ఎన్నోవందల ఏళ్ల తర్వాత తన కాళ్ళ మీద తాను నిలవాలనుకుంటున్న తెలుగు నుడి. ఇప్పటికీ తమిళనాట తెలుగువారి మాటల్లో వినిపించే నుడి. వీటిపైన భాష పరిశోధకులు విస్తృతమైన పరిశోధనలు జరపవచ్చు. ఉదా అవి అచ్చతెనుగు పదాలా/తమిళ పదాలా/మూల ద్రావిడ భాషకు చెందిన పదాలా అని పరిశోధించవచ్చు. కొత్త నిఘంటువును వెలుగులోనికి తీసుకొనిరావచ్చు.

ఈ కథ కొంత కన్యకా పరమేశ్వరి కథను పోలి ఉంది. ఆకాలం నాటి సామాజిక పరిస్థితులకు ఈ నవల అద్దం పడుతుంది. సామాజిక చిత్రీకరణ నవల ఈ మధ్యకాలంలో రాలేదు. ఆనాటి విశ్వనాథ సత్యనారాయణ *వేయ్యి పడగలు* నవల ఎంతటి ప్రాధాన్యత సాధించిందో ఈనాటి ఈ నవల కూడా అంతటి ప్రాచుర్యాన్ని పొందు తుందని ఆశిద్దాం.

హైదరాబాద్‌లో 1-10-2013జరిగిన గోపల్లె పుస్తకావిష్కరణ సభలో ముఖ్య అతిథుల సందేశాలు-

**1. శ్రీ చెన్నూరు ఆంజనేయ రెడ్డి :** గోపల్లె నవలలో ప్రస్తావించబడ్డ తమిళనాట ప్రసిద్ధి పొందిన తెలుగువారి గురించి ప్రస్తావించారు. గోపల్లె నవల దక్షిణాంధ్ర సాహిత్యంలో వెలువడిన తొలి సాంఘిక తెలుగు మాండలిక నవలగా అభివర్ణించారు. ఈనవల అనువాదమే అద్భుతంగాఉంది ఇంక మూల రచయిత రాజ నారాయణ్ గారు ఇంకెంత అద్భుతంగా వ్రాశారో అని వ్యాఖ్యానించారు. రెండవభాగంగా వచ్చిన *గోపుల్లపురత్తు మక్కల్* (గోపల్లె పుర జనులు) అనువదించాలని అయితే ఇది కూడా తమిళనాటి తెలుగు మాండలిక పదాలనే ఉపయోగించి చేస్తే బాగుంటుందని సభాముఖంగా అధ్యక్షులు తెలియజేశారు.

**2. డా. నర్రెడ్డి తులసిరెడ్డి :** లలిత కళలలో సాహిత్యానికి ఎంతో ప్రత్యేకత ఉందని, ఇది సమాజానికి దిక్సూచిగా పనిచేస్తుందని అన్నారు. ఒక మంచి పుస్తకం వందమంది స్నేహితులతో సమానమని అన్నారు. "పుస్తకం లేని మేడ కన్నా పుస్తకం ఉన్న గుడిసే మిన్న" అని వ్యాఖ్యానించారు. గోపల్లె పుస్తకం గురించి ప్రస్తావిస్తూ ఇందులో ఉపయోగించిన మాండిలిక పదాలు ఇక్కడి తెలుగువారు కూడా వాడుకలో పెడితే బాగుంటుందని చెప్పారు.

**3. ఆచార్య ఎల్లూరి శివారెడ్డి :** "తెలుగువారి వలస సాహిత్య సంపదగా, వారి యథార్థ జీవనగాథగా" గోపల్లెను అభి వర్ణించారు. రాష్ట్రేతర ప్రాంతాలలోని తెలుగు రచయితలను, కవులను ప్రోత్సహించాల్సిన అవసరం ఎంతైనా ఉందని, వారికి ప్రభుత్వ అనుమతితో ఒక 25% ప్రోత్సాహకాలను అందిం చేందుకు ప్రయత్నిస్తామని సభాముఖంగా తెలియజేసారు.

**4. డా. కేతు విశ్వనాథ రెడ్డి :** గోపల్లె నవల ప్రతి ఒక్క తెలుగువారు చదవలసిన పుస్తకమని, ఈ నవల సృజనాత్మక వలస సాహిత్యమని అభివర్ణించారు.

**5. సామల రమేశ్ బాబు :** రాష్ట్రేతర తెలుగువారి గొప్పతనాన్ని చాటిచెప్పారు. గోపల్లె నవలలో గల మాండలిక పదాలను కూర్చడంలో నంద్యాల నారాయణ రెడ్డి గారికి తోడ్పాటును అందించిన శ్రీ సామల రమేశ్‌ని అభినందించారు. పుస్తకాలను బహుమతిగా ఇచ్చే సంప్రదాయాన్ని అలవరచుకోవాలని సందేశాన్ని ఇచ్చారు.

ముగింపు- ఇటువంటి చారిత్రాత్మకమైన, పరిశోధ నాత్మకమైన, నవలను ఆర్ట్స్ అండ్ లెటర్స్ అధ్యక్షులు శ్రీ ఆంజనేయ రెడ్డి ముందుకువచ్చి అచ్చేసి, ఇక్కడి తెలుగు ప్రజలకు అందుబాటులోనికి తీసుకొని వచ్చినందుకు అభినందనలు. మనం మరచిన మన నుడిని మనకి మళ్ళీ గుర్తుచేస్తున్న ఈ నవల తెలుగు సేత నారాయణరెడ్డికి, ఆయనకి దారి చూపించిన సం.వెం.రమేష్‌కి, మౌఖికంగా తాను చిన్నతనంలో విన్న వారి యదార్థ గాథను గ్రంథస్థం చేసి మనకందించిన మూల రచయిత శ్రీ రాయంకుల రాజనారాయణకి ధన్యవాదాలు.

డాక్టర్ సగిలి సుధారాణి
పరిశోధకురాలు, ఫోన్ : 9490428825

**మిసిమి** *విజ్ఞాన దాయకం, వినోద ప్రసాదం!*

**మిసిమి** పత్రిక ప్రతినెలా మీ ముంగిట చేరేందుకు మీరు చేయాల్సిన చిన్న పని, ఈ క్రింది వివరాలు మీ సంవత్సర చందా ₹240/- తో పాటు పంపండి. బయటి చెక్కులకు, ఆన్‌లైన్ ట్రాన్స్‌ఫర్‌కు అదనంగా ₹30/- కలపండి.

1. పేరు: ..............................................................................

2. చిరునామా :

   ఇం.నెం. ..............................................................................

   వీధి ..............................................................................

   పేట ..............................................................................

   ఊరు ..............................................................................

   పిన్ ..............................................................................

   సెల్ ..............................................................................

3. సంతకం : ..............................................................................

---

**Our A/c Details for Online Transfer :-**

| | | |
|---|---|---|
| Bank | : | STATE BANK OF INDIA |
| Account | : | MISIMI |
| A/c. No. | : | 10261569316 |
| Branch | : | Saifabad, Hyderabad, INDIA |
| IFS Code | : | **SBIN0007315** |

---

*చందాలు **మిసిమి** పేర ఈ క్రింది చిరునామాకు పంపించగలరు.*

★ మిసిమి లో నూతన చందా దారులుగా చేరండి : 'అగాధం' పుస్తకాన్ని బహుమతిగా పొందండి.

★ రెండు సంవత్సరాల చందా దారులకు 'బాపు బొమ్మల' పుస్తకం పంపిస్తాము.

★ నాలుగు సంవత్సరాల చందా దారులకు 'చార్లీ చాప్లిన్' నా కథ గ్రంథాన్ని బహుమతి.

★ ఐదు సంవత్సరాల చందా దారులు '2011 మిసిమి సంచికల బౌండు' అందుకోవచ్చు.




మిసిమి
మాసపత్రిక

**Kala Jyothi Process Pvt. Ltd.,**

1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyderabad - 500 020.

Ph. 040-27645536, E-mail : misimi_monthly@yahoo.in

e-magazine : www.kinige.com/misimi

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A110 |
| పుస్తకం పేరు | మిసిమి |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya. |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | R. Nandini |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |